# చతుర

ఆగస్టు 2009

రూ.10/-



కోలపల్లి ఈశ్వర్

**వేగుచుక్క**

10 లో...

# కేన్సర్ – CANCER-ల్యుకేమియా BLOOD CANCER వారికి శుభవార్త

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రొస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణకోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు * ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకేమియా * ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకేమియా * క్రానిక్ లింఫోసైటిక్ ల్యుకేమియా * క్రానిక్ మైలాయిడ్ ల్యుకేమియా ఎంతో మంది క్యాన్సర్, ల్యుకేమియా వ్యాధిగ్రస్తులను బాగుచేస్తున్నటువంటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమ కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపీ, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్య పద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త

35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES INSULIN DEPENDENT DIABETES MELLITUS (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషెంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాల్‌ను (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (Opium) (Morphine), బీడి, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకపు పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మాన వచ్చును. లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. (Per Month Rs. 1200/-) Course : 2 Months

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలనొప్పి, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును Kerala Herbal Hair Tonic (Oil) 100 ml. Rs. 400/-. 250 ml Rs. 900/-. Kerala Herbal Shampoo - 100 ml. Rs. 50/-; 250 ml Rs. 120/-; Herbal Hair Capsules 60 - Rs. 300/- (Per Month Rs. 750) Course: 6 Months.

## సంతానం లేని (Infertillity-Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospermia) వెరికోసిల్ వీన్స్ (Varicoseviens) (Per month Rs. 3000/-) Course : 3 months. స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాకపోవుట. అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block). గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs. 3000/-) Course : 3 months

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్ళు, ముక్కు నుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, వస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200 ml Rs. 300/- (Per month Rs. 600/-) Course: 9 months.

❖ **నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్ఖలనము, హస్తప్రయోగము** (Masturbation): నపుంసకత్వము (impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు కుష్చించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంథి వాపు (Enlarge Prostate) per month Rs. 2000/- Course: 3 months ❖ **సుఖ వ్యాధులు** (Venereal Diseases): వ్రణములు, పుండ్లు, సెగవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్రీట్, షాంక్రాయిడ్ (per month Rs. 1000/-) Course: 3 Months ❖ హెర్పిస్ సింప్లెక్స్ (Herpes Simplex) హెర్పిస్ జోష్టర్ (Herpes Zoster) (Per month Rs. 2000/-) Course : 3 months ❖ **స్తనముల బిగువుకు**: జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs. 750/-)Course: 3 months ❖ **స్త్రీలకు పొత్తికడుపు మీద గారిన గీతలు, చారలు పోవుటకు** (Screch Marks): (Per month Rs. 1000/-) Course : 3 months ❖ **మలబద్ధకము** (Constipation) (Per month Rs. 3,00/-) Course : 1 month. **గ్యాస్ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై ఛాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) ఆంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండు. (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పులిపిర్లు** (Warts) ఆనెలు (Corns) Rs. 300/- ❖ **సోరియాసిస్** (Psoriasis) (Per month Rs. 2000/-) Course : 3 months: బొల్లి (Leucoderma). (Per month Rs.2000/-) Course : 3 months ❖ **స్థూలకాయము** (Obesity) : **అధిక బరువును, లావును తగ్గించుటకు** (No Diet, No Exercise) (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **సన్నగా బలహీనముగా ఉండు వారు బరువు పెరిగి, లావుగా అగుటకు, ఎత్తు పెరుగుటకు, (21 సం॥లోపు వారు)** (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **కీళ్ళు కండరాల నొప్పులకు** (Rheumatis arthritis) నరముల వాపు (Neurities) (Backache), **నడుము నొప్పి** (Lumbago), **మెడనొప్పి, వెన్నునొప్పి** (Spinalcord), **తుంటినొప్పి, సయాటిక ఆపరేషన్ లేకుండా** (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పక్షవాతము** (Paralysis) (Per month Rs. 5000/-) Course : 3 months. ❖ **మూర్ఛ, అపస్మారకము** (Fits) (Epliepsy) పిచ్చి, ఉన్మాదము (Mania) హిస్టీరియా (Hysteria) జ్ఞాపకశక్తి తగ్గిపోవుట (Loss of Memory) నిద్రపట్టకపోవుట (Insomnia). (Per month Rs.2000/-) Course : 3 months ❖ **చెవిపోటు** (Ear ache) : **చెవి నుండి చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్‌లేకుండా**. (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **నత్తిని తగ్గించుటకు** (Stammering) : (Per month Rs. 1500/-) Course : 3 months ❖ **స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** (Per month Rs. 3,000/-) Course : 1 month

**అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

**HIV/ AIDS, FITS, PSORIASIS, OBESITY, PARALYSIS, HEPATITIS, HERPES.**




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రేమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్‌పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20. ఫోన్: 65526109, 9866155109, 9392355590




Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించు వారు 10 A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M.

# చతుర

సంపుటి -32
సంచిక - 07
ఆగస్టు 2009
379వ సంచిక



ముఖచిత్ర ఛాయాగ్రాహకుడు : దిలీప్ బెనర్జీ
ముఖపత్రాలంకరణ : రాజుయాట



'యాంలేదే... మనమ్మి
తాకినాదని బావిని
సుద్ది చేసిండ్రు..
నేను ఆ బావిలోకి దుంకి
సచ్చిననుకో.. ఆల్లకి బుద్ది
చెప్పినట్టుంటది..
మనోళ్లకి పౌరుషం వస్తది..'
అన్నాడు ముసలయ్య.
'ఎవురెట్టా పోతే
మనకేంటికయ్యా..
ఇట్లాంటి పనులు సేయకు'
అంది ఓబులవ్వ.
మనిషి బలవన్మరణం
చేసుకుంటే తప్ప అక్కడి
పరిస్థితుల్లో కదలిక రాదా?
ఇరవై ఒకటోశతాబ్దంలో
మారుతున్న గ్రామీణ
సమాజానికి అద్దంపట్టిన
**కోలపల్లి ఈశ్వర్** నవల
## వేగుచుక్క
౧౦ వ పేజీలో
బొమ్మలు: ఆనంద్

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

చిరునామా :

ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

# తిట్లే దీవెనలు



గత శతాబ్దపు గొప్ప ఫిడేలు విద్వాంసుడు ద్వారం వెంకటస్వామి నాయుడు పుట్టుక నుంచే దృష్టిదోషం గలవారు. బాల్యంలో బడిలో నల్లబల్లపై రాసినదాన్ని తన పుస్తకంలో రాసుకోలేక ఇబ్బంది పడుతున్న అతడిని ఉపాధ్యాయుడు క్రూరంగా ఆటపట్టిస్తూ, "ఒరే గుడ్డి వెధవా, కళ్లు కనబడకపోతే బడికెందుకు వస్తావు. ఇంట్లో కూచో" అన్నాడు. దాంతో దుఃఖం కలిగి వెంకటస్వామి మరుసటి దినంనుంచి బడికి పోనని ఇంట్లో ఉండిపోయాడు.

అయితే ద్వారం కుటుంబంలో తాతగారితో సహా అందరూ ఫిడేలు విద్వాంసులే. అతడికి ఫిడేలు వాయించడంపై మక్కువను గమనించిన అతడి అన్న తానే ఫిడేలు నేర్పించడం ప్రారంభించారు. తర్వాత అతడి ప్రతిభను గమనించి ప్రఖ్యాత వాద్య విద్వాంసుల కచ్చేరీలకు తనవెంట పిలుచుకువెళ్లేవారు. చిన్న చిన్న కార్యక్రమాలు, దేవాలయాల ఉత్సవాల్లో ద్వారం కచ్చేరీలు ఉండేవి.

అటువంటి ఓ కచ్చేరి ముగించుకుని అన్నగారి చేతిని ఆసరాగా చేసుకుని ద్వారం వెళ్లబోతున్నారు. ఆ సభలో ఒక మూలన కూర్చున్న వృద్ధుడు ఫిడేలు వాయించిన చిన్నవాడిని చూడాలని చెప్పాడు. వృద్ధుడికి గౌరవ సూచకంగా దగ్గరకెడితే ఆయన ద్వారంను కౌగిలించుకున్నాడు. "ఎంత బాగా వాయించావు నాయనా! ఆ దినం నేను నిన్ను గుడ్డి వెధవ అన్నాను. కాని నీవు కాదు నాయనా గుడ్డి, నేనే గుడ్డివాణ్ణి. నన్ను క్షమించు నాయనా" అన్నాడు.

"మీరు గురువులు. ఆ రోజు అలా తిట్టడమే దీవెనలయ్యాయి. లేకుంటే నేటికి బడిలో మామూలుగా చదువుతూనే ఉండేవాడినేమో! ఇప్పుడు నాకిష్టమైన రంగంలో ప్రావీణ్యం సంపాయిస్తున్నాను" అంటూ గురువుగారికి నమస్కారం చేశాడు ద్వారం.

అప్పటి నిజం

# తానొకటి తలిస్తే..?

ద్వారం వెంకటస్వామి నాయుడికి అన్న వెంకట కృష్ణయ్యే ఫిడేలు గురువు. వారిద్దరి కచ్చేరి విని ప్రజలు జేజేలు పలికేవారు. అయితే ద్వారం సోదరులు దీంతో సంతృప్తి చెందక సంగీత కళాశాలలో చేరి ఉన్నత శిక్షణ పొందాలని విజయనగరం వెళ్లారు. అక్కడ సంగీత కళాశాల ప్రిన్సిపాల్ ఆదిభట్ల నారాయణదాసు, రాజు ఆనంద గజపతి వారి సంగీత కచ్చేరి విన్నారు. రాజుగారూ, దాసుగారూ ద్వారంతో "నిన్ను విద్యార్థిగా కళాశాలలో చేర్చుకునేందుకు వీలుకాదు... ఎందుకంటే" అని మాట నిలిపారు. వీలుకాదనే మాటను వినగానే ద్వారం నెత్తిన పిడుగుపడ్డట్లయింది. వెంటనే ఆదిభట్ల నారాయణదాసుగారు, "ఎందుకంటే... నీవు ఈ కళాశాలలో ఫిడేలు ప్రొఫెసరుగా ఎంపికయ్యావు" అన్నారు మధ్యలో ఆపేసిన మాటలను పూర్తిచేస్తూ. కాస్సేపు గాబరాపడ్డా, తర్వాత వారి మాటలు అర్థంకావడంతో ఇరువురికీ పాదాభివందనం చేశారు ద్వారం.



రచయిత, విమర్శకుడు, పరిశోధకునిగా ప్రసిద్ధుడయిన కేతువిశ్వనాథరెడ్డికి పరిచయం అవసరం లేదు. నాలుగు దశాబ్దాలుగా సాహితీ వ్యవసాయం చేస్తున్నారు. ఈ క్రమంలో ఎన్నో అవార్డులు అందివచ్చాయి. తాజాగా అజో-విభో-కందాళం ఫౌండేషన్ జీవితకాల సాధన పురస్కారం-2009 వరించింది. ఆయన కథలు కొన్ని కన్నడం, హిందీ, బెంగాలీ, మరాఠీ, ఇంగ్లిషు, రష్యన్ భాషల్లోకి అనువాదమయ్యాయి. వివిధ భాషల్లోకి తర్జుమా అయిన కథ 'ఖడ్గాలూ కాటుకపిట్టలు' గురించి ఆయన మాటల్లోనే విందాం... రండి...


డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డి

## పరిశోధనలపై కొరడా...

# ఖడ్గాలూ కాటుక పిట్టలు

విశ్వవిద్యాలయాల్లో పరిశోధన పేరుతో సాగే వంచన.. నిజమైన శోధన గుర్తింపునకు నోచుకోకపోవటం 'ఖడ్గాలూ కాటుకపిట్టలు' కథలో సమగ్రంగా చర్చకొస్తుంది. మౌఖిక చరిత్రలోగానీ, లిఖిత చరిత్రలో గానీ నిజానిజాలు తరచిచూస్తే బలవంతులు, పీడకులు, వంచకుల పరమావధిగా అధికారప్రాప్తి, రాజ్యప్రాప్తే కనిపిస్తున్నాయి.. రాజ్యాధికారం పొందేవాళ్లు ఏ కులం వారన్న అంశం చర్చనీయాంశం కావటం చూస్తూనే ఉన్నాం. తాము ఫలానా రాజవంశీయులమని చెప్పుకుని సంబరపడేవాళ్లు మనకు కనిపిస్తారు. వంశ గౌరవాల పట్ల ఉండే నమ్మకాలు, ఆధిపత్య ధోరణులు పాఠకుల ముందుకు తెచ్చి వారిని చైతన్యపరచాలన్న సంకల్పంతో ఈ కథకు శ్రీకారం చుట్టాను. ఇక కాటుక పిట్టలు...వీటిని అదృష్టానికి ప్రతీకలుగా భావిస్తారు. కాటుకపిట్టలు కలిసే చోట పట్నం గడితే బంగారం పండుతుందని నమ్ముతారు. ఈ పిట్టల కథ రాజుల గృహ ధర్మానికి, పవిత్ర స్త్రీపురుష బంధానికి సంకేతంగా చెబుతారు.

కథలో ప్రధాన పాత్ర డాక్టర్ రాయడు. కుల బలం, రాజకీయదన్ను అధికంగా ఉన్నవాడు. చిన్నవయస్సులోనే ప్రొఫెసరవుతాడు. అంతా అతని అడుగులకు మడుగులొత్తుతుంటారు. సోపానపటంలో గబగబా నిచ్చెన మెట్లు ఎక్కగలిగిన వానిగా గుర్తిస్తారు. విశ్వవిద్యాలయం ధృవ తార అని కీర్తిస్తారు కూడా. స్వతసిద్ధమైన మేధతో సంబంధం లేకుండా పలుకుబడిగల అధ్యాపకుల్ని విశ్వవిద్యాలయాలు ఏ రీతిగా తలకెత్తుకుంటాయో ఈ పాత్ర ద్వారా పాఠకులకు అర్థం చేసుకోవచ్చు. ఇటువంటి వ్యక్తులకు చరిత్ర పరిశోధనలపై అభిమాన

## కథ వెనుక కథ

మయితే ఉండొచ్చుగానీ నిజమైన గౌరవం ఉంటుందా అనేది సందేహమే. అయితే ఉన్నత వ్యక్తులకు కలిగే సహజ ప్రేరణలే చరిత్ర అని రాయడు వాదిస్తూంటాడు. స్వగ్రామంలో అతను ఇంటి నిర్మాణం చేసినప్పుడు పది ఖడ్గాలు, చేవ తేలిన ఎర్ర చందనంతో చేసిన నాలుగయిదు పెద్ద గదలు, ఒక చిన్న పెట్టెలో ఉంచిన తాటాకుల కావ్యం బయటపడతాయి. బంగారం కూడా కొంత బయటపడిందని పుకార్లు ఊరంతా గుప్పుమంటాయి. పురాతత్వ అధికారులు, పోలీసులు రంగం ప్రవేశం చేస్తారుగానీ వాస్తవాలు రాబట్టే ప్రయత్నం చేయరు. ఇక్కడా వంచనే. ఖడ్గాలు, గదలతో ఒక మ్యూజియం ప్రారంభిస్తామని రాయడి కుటుంబం ప్రకటించేసరికి పురాతత్వ అధికారులు తోకముడుస్తారు. బంగారం విషయాన్ని పోలీసులు విస్మరిస్తారు. పలుకుబడి ఉన్న వ్యక్తులకు అనుకూలంగా అధికార వ్యవస్థలు ఎలా పని చేస్తాయో ఇక్కడ గమనించవచ్చు. అసలు అంశాలన్నీ మరుగునపడి రాయడి వంశచరిత్ర చర్చనీయాంశమవుతుంది.

రాయడి కుటుంబం కృష్ణదేవరాయలకో, కాకతీయులకో... ఈ రెండూ కాకపోతే మట్టిరాజులకో వారసులై ఉంటారన్న ప్రచారం మొదలవుతుంది. ఈ చర్చ రాయడిలో కుతూహలం రేపుతుంది. అప్పటికప్పుడు తాటాకుల కావ్యాన్ని తెలుగు శాఖలో పరిశోధకుడికిచ్చి వివరాలు రాబడతాడు. అదే సమయంలో అమెరికా నుంచి వచ్చిన మిత్రుడు తోడయి మౌఖిక చరిత్రను సేకరించాలని హితబోధ చేస్తాడు. కావ్యంలో పేర్కొన్న చీకటికోట ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడుందో కనిపెట్టి, దాని చరిత్రను రికార్డు చేయించాలని స్థిరనిశ్చయానికొస్తాడు రాయడు. ఈ నిర్ణయం వెనుక పెద్ద వ్యూహమే ఉంటుంది. భారత స్థానిక చరిత్ర కాంగ్రెస్‌లో పేపరు రాయించి అందరినీ ప్రభావితం చేసి అధ్యక్షస్థానాన్ని సొంతం చేసుకోవాలని కలలు గంటాడు. ఈ పథకం అమలు చేసేందుకు తన దగ్గరున్న ఇద్దరు పరిశోధకుల్ని ఇంటికి పిలిపించుకుని వేర్వేరు బాధ్యతలు అప్పచెబుతాడు. తాటాకుల ప్రతి చేతికిచ్చి కావ్య కృతిపతి ఎవరో, ఎప్పటివాడో వంశవృక్షంతో సహా వివరాలు తెలియాలని రావుకి చెబుతాడు. అలాగే చీకటికోట ఆసుపాసులు, దానికి చీకటిదుర్గమనే పేరెలా వచ్చిందో సేకరించే బాధ్యత గఫూర్‌కి అప్పచెబుతాడు.

గఫూర్, రావు ఇద్దరూ విభిన్న మనస్తత్వాలకు ప్రతీకలు. మనసా, వాచా, కర్మేణా పరిశోధనే ప్రాణంగా ముందుకు సాగే వ్యక్తి గఫూరయితే, పైస్థాయి వ్యక్తు




ఈ కథ పేరుతో హిందీ, కన్నడలలో విడుదలైన కేతు విశ్వనాథరెడ్డి కథాసంకలనాలు

## ఇతర భాషల్లో...

'ఖడ్గాలూ కాటుకపిట్టలు' కథ కేతువిశ్వనాథరెడ్డి కథాసంపుటిలో కనిపిస్తుంది. ఈ సంపుటికి 1993-94లో తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు, 1994లో భారతీయ భాషా పరిషత్ అవార్డు, 1996లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు లభించాయి.

★ 'ఖడ్గాలూ కాటుకపిట్టలు' కథ తొలిసారిగా 23 జూన్ 1991 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో అచ్చయింది.

★ హైదరాబాద్‌కి చెందిన జయశ్రీ మోహనరాజ్ ఆంగ్లంలో 'ఆఫ్ స్వోర్డ్స్ అండ్ వాగ్‌టెయిల్స్' పేరిట అనువదించారు. కేంద్రసాహిత్య అకాడమీ సంపుటిలో ఈ కథ చోటుచేసుకుంది.

★ ఈ కథను 'ఖడ్గగళు-గింజన పక్షిగళు' పేరుతో పి.బి.శివన్న కన్నడంలోకి అనువదించారు.

★ ఈ కథ పేరుతోనే హిందీలో అనువాద సంకలనం విడుదలయింది.

★ జనవరి 2000లో భారతీయ భాషా పరిషత్ ప్రచురించిన ప్రపంచ కథల సంకలనం 'వాగర్థ (హిందీ)లో ఈ కథకు స్థానం లభించింది. ఈ కథ ఒరియాలోనూ అనువాదమవుతోంది.

లను మాటలతో బురిడీ కొట్టించి తమకు కావలసింది రాబట్టుకునే వ్యక్తి రావు. ఈ కథలో గఫూర్ ఉదాత్తమైన వ్యక్తిగా మనకి కనిపిస్తారు.

తెలుగు శాఖలో తన బంధువయిన ఒక పరిశోధకుని సాయంతో అక్కడే ఉండి వివరాల సేకరణకు రావు సిద్ధమయితే, పరిచయస్థుల సాయం తీసుకుని కోటల సందర్శనకు బయలుదేరతాడు గఫూర్. ఈ క్రమంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొంటాడు. పరిశోధకులకు క్షేత్రస్థాయిలో ఎదురయ్యే సాధకబాధకాలను పరిచయం చేయటం, వాటిని అధిగమించి ముందుకు సాగటంపై అవగాహన కల్పించటానికి ఈ పాత్ర దోహదం చేస్తుంది. తాను సేకరించిన వివరాల ఆధారంగా గఫూర్ పరిశోధన పత్రం రూపొందిస్తాడు. పరిపాలకుల వంశచరిత్రలు పరిశీలిస్తే వాళ్లు ఒకే కులంలో క్రమానుగతంగా కొనసాగలేదని తేల్చేస్తాడు. పరిపాలనాధికారం పోయే ముందున్న కులమే తర్వాత స్థిరపడిందని నిర్ధరిస్తాడు. అంతే కాదు. ప్రజల నోళ్ల నొక్కగలిగిన ఖడ్గాల చరిత్రే రాజ్యాల చరిత్ర అని, పాలెగాండ్ల చరిత్రే సూక్ష్మ రూపంలోని రాజ వంశాలచరిత్ర అని నిర్ధరిస్తాడు. భవిష్యత్తుపై కొండంత ఆశతో పరిశోధన పత్రంతో రాయడిని కలిసిన గఫూర్‌కి చేదు అనుభవం ఎదురవుతుంది. రావు అప్పటికే గఫూర్‌పైన ద్వేష భావాన్ని రగిలిస్తాడు. పరిశోధనలోని అంశాలన్నీ తప్పుల తడక అని నమ్మించటంలో విజయం సాధిస్తాడు. రాయడు వంశచరిత్రకు విశిష్టతను ఆపాదిస్తూ రావు పరిశోధనపత్రం సాగుతుంది. గఫూర్‌ని ప్రొఫెసర్ చివాట్లు పెట్టటంతో ఈ కథ ముగుస్తుంది.

కథలో పాత్రలు పూర్తిగా కల్పితం కాదు. ముందే చెప్పినట్టు రాయడు పాత్ర పలుకుబడిగల అధ్యాపకులు, వారి ఆధ్వర్యంలో దారితప్పే పరిశోధనలకు ఒక నమూనాగా నిలుస్తుంది. రాయడులాంటి వారున్నంత వరకూ చరిత్ర పరిశోధనల తీరు ఇలాగే సాగుతుంది. గ్రంథచౌర్యాలు, సొమ్ములు పుచ్చుకుని పరిశోధకులకు బదులుగా తామే పరిశోధన పత్రాలు రూపొందించే అధ్యాపకులు ప్రతి విశ్వవిద్యాలయంలోనూ మనకి తారసపడుతూనే ఉంటారు. కథలో పేర్కొన్న చీకటిదుర్గం పులివెందుల తాలూకా వేముల మండలం మీదిపెంట్ల కోట వద్ద ఉన్న ఒక కోట. ఈ కోటను స్వయంగా పరిశీలించిన తర్వాతే స్థలనేపథ్యంగా ప్రవేశపెట్టాను. ఇక తాళపత్ర గ్రంథాలంటారా... తిరుపతి ఓరియంటల్

## ఆమె ఎవరు?

అమెరికాలో 1989 డిసెంబర్‌లో డల్లాస్‌లో రోడియో టాక్ షో నిర్వహించే జాన్సన్‌కు సిజె పేరుతో ఒకామె తనకు ఎయిడ్స్ ఉన్నదని, దాన్ని రోజుకో పురుషుడికి చొప్పున అంటిస్తున్నానని ఉత్తరం రాసింది. ఆ వ్యాధిని ఓ పురుషుడు అంటించడంతో వారిపై పగ తీర్చుకోవడానికి ఇలా చేస్తున్నానని ఉత్తరంలో పంపిన టాక్‌లో చెప్పింది. తను ఎయిడ్స్ వ్యాధిగ్రస్థురాలిని కావడంతో ఓ బార్‌లో తనకు దూరంగా మగవాళ్ళు కూర్చుంటారని బాధ పడింది. పైవిషయాలను చెప్పిన టేప్‌ను రేడియోలో ప్రసారం చేశారు. అయితే దానికి పెద్ద స్పందన లేదు.





నెల తర్వాత జాన్సన్‌ను 28-30 మధ్య వయసు గల అందమైన ఓ నల్లజాతి యువతి కలిసి 'నా పేరు సిజె. నేను పంపిన టేప్‌నే మీరు ప్రసారం చేశారు. నేను చెప్పింది జరుగుతోంది. ఇప్పుడు రోజుకి నలుగురు పురుషులకి ఎయిడ్స్ అంటిస్తున్నాను' అంది.

జాన్సన్ ఐడెంటిటీ కిట్‌తో ఆమె మొహాన్ని చిత్రించి ఎబోనీ అనే పత్రికకు మొత్తం విషయాన్ని వివరిస్తూ ఓ ఆర్టికల్ రాశాడు.

దీనికి పాఠకుల్లో రెస్పాన్స్‌గా భయం మొదలైంది. ఆమె పంపిన టేప్‌ని లై డిటెక్టర్ ఎక్స్‌పర్ట్ ఎనలైజ్ చేసి అందులో అబద్ధం లేదని తేల్చిన సంగతి కూడా ఆ పత్రిక ప్రచురించింది. ఓ సామాజిక సేవా సంస్థ ఆమె బొమ్మను, ఆ విషయాన్ని పోస్టర్స్‌గా ముద్రించి నగరంలోని మగవారి బాత్‌రూంలలో అతికించింది. ఆ తర్వాత వేశ్యల దగ్గరకి వెళ్ళే మగవాళ్ళ సంఖ్య గణనీయంగా పడిపోయింది. ఆఫీసుల నుంచి అందరూ ఇళ్ళకి వెళ్ళడం అధికమైంది. ఇది జరిగి ఇరవై ఏళ్లవుతున్నా ఇంతదాకా సిజెని పట్టుకోలేకపోయారు. బతికివుంటే ఆమె వయసు యాభైలో ఉంటుంది.

కళాశాలలో ఇటువంటి మాన్యుస్క్రిప్టులు వందల్లో కనిపిస్తాయి. వీటి తారీఖులు నిర్ణయించేందుకు రాయడులాంటి ప్రొఫెసర్లు ప్రయత్నిస్తూంటారు. దొంగ సాక్ష్యాలు అల్లుతారు. గఫూర్‌కి క్షేత్రస్థాయి పర్యటనలో సాయపడిన వ్యక్తి వాల్మీకి. బాల్యంలో నాకూ, నా కుటుంబానికి బాగా పరిచయం ఉన్న ఓ వ్యక్తి. బోయకులానికి చెందిన వాడు. అతడ్ని దృష్టిలో పెట్టుకునే ఈ పాత్రకు ప్రాణప్రతిష్ఠచేశాను. పల్లెపట్టుల్లో వాల్మీకిలాంటి వ్యక్తులు ఎందరో కనిపిస్తారు. కాలగర్భంలో కలిసిపోయిన చరిత్రను తవ్విపోస్తారు. మొత్తం మీద 'ఖడ్గాలూ కాటుకపిట్టలు' కథ తెలుగులో విమర్శకుల ప్రశంసలు అందుకుంది. వివిధ భాషల్లోకి అనువాదమై ప్రాచుర్యం పొందింది. ఒక కథ ప్రభావం సమాజంపైన ఎంతమేరకు పడుతుందనేది నిర్ణయించటం అంత మంచి పద్ధతి కాదేమో! "ఈ కథలో సంచలనతకు సమకాలీన వాస్తవికతను జోడించి సముచిత శిల్పాన్ని సాధించారు" అని హేతువాద ఉద్యమ ప్రముఖుడు, పత్రికా నిర్వాహకుడు శూద్ర శ్రీనివాస్ (కన్నడం) ప్రశంసించారు. కుహనా విలువల్ని ఎండగట్టారని ఈ కథపై సంపాదకీయ వ్యాఖ్యలు రావటం సంతృప్తినిస్తోంది. తెలుగు భాషల్లో ఇటువంటి కథలు విరివిగా రావలసిన అవసరం ఇప్పుడు కనిపిస్తోంది.

సేకరణ: **పార్థసారథి చిరువోలు**

పల్లెసీమలే దేశ సౌభాగ్యానికి పట్టుగొమ్మలు. అక్కడి ప్రశాంత వాతావరణం, ప్రకృతి శోభ, గ్రామీణుల అమాయకత్వం ఆకట్టుకునేవే. అయితే వీటితోపాటు అక్కడ రాజ్యం చేస్తున్న అవిద్య, అంటరానితనం, కులాలు, మతాల వివక్ష మనిషిని మనిషిగా ఎదిగే క్రమాన్నే పరిహసిస్తున్నాయి. స్వాతంత్ర్యం గడించి ఆరుదశాబ్దాలు గడిచినా జాతిని పట్టిపీడిస్తున్న ఈ జాడ్యాలు ఇంకా వదలడం లేదు. ఈ నేపథ్యంలోనే వీటిని అంతమొందించేందుకు గుప్పెడుమంది యువతీ యువకులు నడుం బిగించారు. ఫలితంగా వారు ఎలాంటి పరిణామాల్ని ఎదుర్కొన్నారు?

ఇంతకీ వారు విజయం సాధించారా?

స్వాతంత్ర్య దినోత్సవ కానుకగా
చతుర అందిస్తున్న
కోలపల్లి ఈశ్వర్
**వేగుచుక్క** నవల
మీకోసం!



'మహారణ్యం మధ్యలో ఒక మనిషి నిలబడివున్నాడు.

అతను ఆకలి తప్ప ఆలోచన లేని ఆది మానవుడు. సంజ్ఞ తప్ప భాషరానివాడు. మంచీ, చెడు తెలియని ఆటవికుడు. నీతి నియమాలు.. ఆచార వ్యవహారాలూ అనే పంజరాల్లో.. తాను భవిష్యత్ బందీనని ఎరుగనివాడు. కులమతాల తుమ్మముళ్లు.. అరికాళ్లల్లోకి దిగనివాడు.. కుళ్లు కుత్సితాలతో ఒళ్లంతా కుళ్లిపోతుందని ఊహించని వాడు. దేవుళ్ల బొడ్డుకోసి నామకరణం చేసి వారిని చీకటి కొట్లలో బంధించబోయేవాడు తనేనని ఎన్నడూ కలగనని వాడు..

ఉన్నట్టుండి ఆలోచనలో పడ్డాడు. ఆలోచనకో రూపాన్నిచ్చాడు. ఆ రూపాన్ని నాగరికత అన్నాడు. అంతే అతని కథ మారిపోయింది. సింధులోయలోంచి పైకి పాకి... హరప్పా మొహంజదారోల్ని అవలీలగా దాటి ఆకాశం దాకా విస్తరించాడు.

మహారణ్యాలను జనావాసాలుగా మార్చాడు.

ఇప్పుడతను.. నిర్జనారణ్యాల్లో ఒంటరిగా తిరుగాడే అనాగరికుడు కాదు.

కాలమానాన్ని తనతో పాటూ పరుగులెత్తించే నవనాగరికుడు.

వాడిప్పుడు ఒక్కడుకాదు.. వందలుగా వేలుగా కోటానుకోట్లుగా వెల్లువైపోయాడు.

విరగబూసిన శనగచేల మధ్యగా గెనెం మీద నిదానంగా నడుచుకుంటూ నెమళ్ల లంక వెళుతున్నాడు అతను.

అతను అంతకు ముందు పదినిమిషాల క్రితమే.. ఎర్రమట్టి రోడ్డుమీద ఆగిన ఆర్టీసి బస్ దిగాడు. అక్కడే రోడ్డువారగా ఉన్న పాకలో టీ తాగి... ట్రావెలింగ్ బ్యాగ్ తగిలించుకుని ఆ చేల గట్లంటపడి ఊళ్లోకి పోతున్నాడు.

ఆ చేలు దాటగానే మొదలయ్యాయి బంతిపూల తోటలు. గాలితో పాటుగా ఆ పూల మీంచి తేలి వచ్చిన ఒక కమ్మని పరిమళం అతన్ని నిలువెల్లా కమ్ముకుని ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే... "పల్లెలంతా కమ్మగా ఉంటాయి!" అనుకున్నాడు.

దాటలేక దాటలేక ఆ తోటను దాటగానే ఎదురైంది మిరప చేను. ఆ చేలోని ఫిల్టర్ పాయింట్ దగ్గర నిలబడి దూసుకొస్తున్న నీటి ధారతో గిల్లిగజ్జాలాడుతున్నాడొక పదీ పదకొండేళ్ల కుర్రాడు.

నవ్వుకుంటూ ముందుకు సాగిన అతనికి అడ్డం వచ్చింది. 'నాగలబాయి' అని పిలిచే ఓ ఒరల బావి. ఆగి అందులోకి తొంగి చూశాడు. నీళ్లు మరీ లోతుగా లేవు కాస్త పైకే ఉన్నాయి. సూర్యకిరణాలు పడి తళతళ మెరుస్తున్నాయి. వంగి ఓ రాయి అందుకుని నీటిలోకి విసిరాడు. ఒడలు పులకరించిందేమో చిరుకెరటాలుగా సాగుతూ అందులోని నీరు పలకరింపుగా నవ్వింది.

మరో నాలుగడుగులు వేశాడో లేదో... ఆ కాలిబాట పక్కగా ఉన్న ఓ రావి చెట్టు కొమ్మల్లోంచి 'కుహూ.. కుహూ..' అంది కోయిలొకటి. ఊళ్లోకి అడుగు పెడుతున్న అతిథిని అలా స్వాగతించిందేమో! ఆ కుహూ గీతాలు వింటూ అక్కడ కాసేపు విశ్రమించాలన్న కోర్కెను బలవంతాన అదిమిపెట్టి ముందుకు కదిలాడతను.

చెరువు కట్టదిగి వరి పొలాలగుండా నడుస్తుంటే... ఆ పొలాల్లో పనులు చేసుకొంటున్న పల్లెపడుచులు... పెదాలమీంచి జారుతున్న జావళీని మునిపంట నొక్కిపట్టి అతనికేసి నిక్కి నిక్కి చూశారు.

ఎడంచేత్తో క్రాఫ్ ఎగదోసుకుంటూ... ఓసారి గర్వంగా నవ్వుకున్నాడు.

తను దారంట పోతుంటే.. అమ్మాయిల గుండె వేగం హఠాత్తుగా పెరుగుతుందనే సత్యం.. అతనికి ఇదివరకే తెలుసు.

తన ఫిజిక్ అలాంటిది మరి! ఆజానుబా

హుడు.. అరవింద నేత్రుడు.. అని రాముడ్ని పొగుడుతారే.. అలా ఉంటాడ తను.. తరచూ అమ్మ అనేదా మాట. అయితే అమ్మ చెప్పనిదీ... అందరికీ తెలి సింది ఒకటుంది... అది ఆ పురాణ పురు షుడు రాముడికి సైతం లేని బంగారు మేనిఛాయ తన స్వంతం.

ఆలోచిస్తూనే వడివడిగా నడిచి ఊళ్లోని రచ్చబండ దగ్గరకొచ్చాడు. బండమీద నలు గురైదుగురు గ్రామస్థులు కూర్చుని ఉన్నారు. పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న వాళ్లు అతన్ని చూడగానే బాతాఖానీ ఆపేసి ఇటు తిరిగారు.

అతనొక్క క్షణం తటపటాయింపుగా వారికేసి చూసి అడిగాడు "పరమేశ్వరశాస్త్రి గారి ఇల్లెక్కడో కాస్త చెబుతారా? "

భుజంమీద గళ్ల కండువా వేసుకొని ఉన్న ఓ మనిషి ఓ వైపు వేలు పెట్టి చూపుతూ చెప్పాడు. "అదో... అటు సాయగా వెళ్లు.. బడొచ్చుద్ది.. ఆ బడికి ఎడంసేతి పక్క సందులో.. ఎటు చూడ కుండా ఎల్తావుంటే నాగుల పుట్ట తగులిద్ది. ఆ పుట్టకి ఎదురు సందులో చివరిల్లు శాస్తు ర్లుగారిది. మేడిల్లు. పెద్ద ఆకుపచ్చ చెక్క గేటుంటది. లోపలంతా శానా ఇంగిలీస్ పూలమొక్కలు కనబడతాయ్. అదే గుర్తు నీకు"

అతను ఇంటి అడ్రసు వివరంగా చెప్పి కొస మెరుపుగా అడిగాడు "ఇంతకీ నువ్వె వరు బాబూ? ఆరి సుట్టానివా? "

ప్రశ్న వేసింది ఒక్కడైనా..మిగతా వారు జవాబు కోసం ఆత్రంగా చూస్తున్నారు.

"శాస్త్రిగారబ్బాయి చక్రధర్ స్నేహితుడ్ని. మేమిద్దరం పట్నంలో కలిసి చదూకున్నాం. నా బెస్ట్ ఫ్రెండ్ వాడు" చెప్పాడు.

"చెక్రదరం బాబు సావాసగాడివా? పేరేందన్నావ్? "

"రాజు" చెప్పాడతను.

"పో... అటు... బో సాయగా" మళ్లీ అన్నాడు మొదట అడ్రస్ చెప్పినతను.

రాజు అతను చెప్పిన ప్రకారం నడుస్తు న్నాడు. బడి దాటి రెండడుగులు వేశాడో లేదో ఎదురయ్యాడు లక్కీగా చక్రధర్.

"హేయ్.." ఆనందంగా అరిచాడు రాజును చూడగానే.

రాజు బదులుగా నవ్వాడు.

"రావేమో అనుకున్నా" రాజు భుజం మీంచి బేగ్‌ని చొరవగా అందుకుని తన భుజానికి తగిలించుకున్నాడు.

"రేయ్ చక్రీ! నువ్వు వర్ణించినట్టే మహా అందంగా ఉందిరా మీ ఊరు., అబ్బే... మా టౌన్లూ... సిటీలూ ఎందుకూ పనికి రావ్ దీనిముందు"

"నెమళ్ల లంకా? మజాకానా" చక్రధర్ గొప్పగా చూశాడు స్నేహితుడి వంక.

మాటల్లోనే ఇల్లొచ్చేసింది. పాతకాలపు చెక్క గేటును ఒక్క నెట్టు నెట్టాడు చక్ర ధర్. అది భళ్లున తెరుచుకుని... ముందుకూ వెనక్కూ ఊగింది.

గేటు దాటి లోపలకు అడుగుపెట్టబోతూ ఓసారి ఆ ఇంటికేసి చూశాడు రాజు. ప్రశాం తమైన ముని వాటికలా అనిపించింది.

గేటుకు ఆనుకుని గుబుర్లుగా పెరిగి పోయి ఉన్నాయి మందార పొదలు. వాటికి కాస్త దూరంలో ఉట్టిపడుతున్న సౌందర్యశిఖల్లా వున్నాయ్ గ్లాడియోలాలు. బ్లూబెల్ గుండెలమీద వాలివున్న సీతాకోక చిలుకలు రాజుకేసి ఒక్క క్షణం చూసి... ఎగిరిపోయి ఆ దాపుల్లోనే వున్న... జిని యాల మీద వాలాయి.

రాధా మనోహరాలు, నందివర్ధనాలు, సన్నజాజులు ఒక వంక నిలబడి స్వాగతం చెబుతుంటే.. మరోవంక.. డాలియాలూ.. బాల్సమ్‌లూ.. మార్నింగ్ గ్లోరీలూ 'హెలో' అంటూ విష్ చేస్తున్నాయి.

పచ్చలపోగులాంటి పచ్చని జెర్బెరా వంక

అబ్బురంగా చూస్తూ... గోల్డెన్‌రాడ్ కంకిని చేత్తో అలవోకగా ముట్టుకు చూస్తున్న రాజు "మా నాన్నగారు" అంటూ పరిచయ పూర్వకంగా వినబడ్డ చక్రధర్ గొంతు విని ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు. వరండాలో వాలుకుర్చీలో కూర్చుని వున్న పరమేశ్వరశాస్త్రికి అప్రయత్నంగా నమస్కారం చేశాడు.

"చిరంజీవ.. చిరంజీవ" ఆయన దీవించి ముక్కుమీదకు జారుతున్న కళ్లద్దాల్ని చూపుడు వేలితో తోసుకుంటూ చక్రధర్‌ని అడిగాడు. "నీ బెస్ట్ ఫ్రెండూ... మనూరు చూడ్డానికి వస్తాడూ అన్నావ్..."

"అవున్నాన్నా.. ఇతనే" చక్రధర్ చెప్పాడు.

"సంతోషం నాయనా" రాజుతో అని, "అబ్బాయికి స్నానానికదీ ఏర్పాట్లు చూడమని అమ్మకు చెప్పు" అన్నాడాయన.

ఈ లోపు ఒక స్త్రీ... లోపలి గది గుమ్మంలోకొచ్చి బయటకు తొంగిచూసింది.

మెడలో నల్లపూసలూ... ముఖానికి పసుపూ... పాపిడిలో కుంకుమ... భుజం చుట్టూ తిప్పుకొన్న కొంగూ... కళ్లలో "ఎవరూ? " అన్న ప్రశ్న.

ఆమె వయసును బట్టి చక్రధర్ తల్లయి వుంటుందనుకున్నాడు రాజు.

అతని అంచనాని నిజం చేస్తూ అన్నాడు చక్రధర్-

"మా అమ్మ"

వెంటనే నమస్కరించాడు రాజు.

"అమ్మా! రాజని చెప్పానే..."

'అర్థమైంది లేరా' అన్నట్టు నవ్విందామె.

"స్నానం కానిచ్చి రా బాబూ.. భోజనం వడ్డిస్తా"

రాజును తన గదిలోకి తీసుకెళ్లాడు చక్రధర్. రాజు బేగ్ జిప్ లాగి... ఓ లుంగీ... షర్టూ... టవలూ బయటకు తీశాడు.

చక్రధర్ అతన్ని నేరుగా బావి దగ్గరకు తీసుకెళ్లాడు. బావిలోంచి నీళ్లు తోడుతున్న ఓ పద్దెనిమిదేళ్ల పిల్ల చేతిలోని చేదను అమాంతం వదిలేసి పెరటి తలుపు గుండా ఇంట్లోకి తుర్రుమంది రాజును చూడగానే.

"మా చెల్లాయిరా. కొత్తవాళ్లని చూస్తే కాస్త కంగారెక్కువ"

రాజు మనసులో అనుకున్నాడు "కంగారు కాదు లేవోయ్... మన హేండ్సమ్‌నెస్ చూసి ఖంగుతిన్నది"

చక్రధర్ గబగబ పెరట్లోకెళ్లి ఓ పెద్దమోకు తీసుకొచ్చాడు. దాన్ని బావిలోకి వదిలి... దాని కొనకున్న కొక్కెంతో చేదను బయటకు లాగాడు. తరవాత ఓ చేద నీళ్లు తోడి రాజుకు చెప్పాడు, "కానివ్వు... పేంట్ విప్పి టవల్ చుట్టు"

"బాబోయ్... ఇక్కడా... ఆరు బయట! బాత్‌రూమ్ లేదా!"

"నువ్వాకేసా నాయనా! అదుగో బాత్‌రూమ్. త్వరగా నడువ్" చెప్పాడు. రాజు బాత్‌రూమ్ వైపు వెళుతుంటే... పెరట్లో... తులసికోట దగ్గర మడిబట్ట ఆరబెట్టుకుంటున్న ఓ ముసలమ్మ కాస్త ఇవతలికి వచ్చి. అతనికేసి నిశితంగా చూసింది.

"మా బామ్మ" రాజుతో అని బామ్మకు కాస్త గట్టిగా చెప్పాడు "బామ్మా. నా స్నేహితుడు రాజు.. పట్నం నుంచొచ్చాడు"

"ఆఁ.. ఆఁ" అంటూ ఆమె మళ్లీ మడిబట్ట దగ్గరకు వెళ్లిపోయింది.

రాజు బాత్‌రూమ్ తలుపు మూసుకుని స్నానం కానిచ్చి లుంగీ, షర్టూ వేసుకుని వచ్చాడు.

చక్రధర్, రాజు, పరమేశ్వరశాస్త్రీ కాసేపు మాటల్లో పడ్డారు.

"మీ నాన్నగారేం చేస్తారు బాబూ? "

"ఇంగ్లీష్ లెక్చరరండీ"

"అన్నదమ్ములూ... అక్క చెల్లెళ్లూ..."

"ఒక అక్కయ్యా.. తమ్ముడూనండీ,

అక్కయ్యకు పెళ్లయిపోయింది. బావగారు బెంగళూర్లో ఇంజినీరుగా పనిచేస్తున్నారు. తమ్ముడు డిగ్రీ ఫైనలియర్.. మేథమేటిక్స్ మెయిన్. ఇక నేను మీకు తెలిసిందేగా. మీ అబ్బాయిదీ నాదీ ఒకే సబ్జెక్ట్" నవ్వాడు రాజు.

"ఇంట్లో అందరూ తలో రూటన్న మాట... నాన్నగారు లిటరేచరూ... తమ్ముడు మేథమేటిక్సూ, నువ్వు సోషియాలజీ" నవ్వాడాయన.

"నాన్నా! అమ్మ భోజనాలకు లేవమంటోంది"

ఇందాక రాజును చూసి బావిలో చేద వదిలేసి పారిపోయిన చక్రధర్ చెల్లాయి... తలుపు చాటునుంచి తొంగిచూస్తూ చెప్పింది. అలా చెబుతూనే రెప్పలు రెపరెపలాడిస్తూ తనని గమనించటం రాజు చూపుల్ని దాటిపోలేదు.

అందరూ లేచి లోపలికెళ్లారు. వాళ్లు హాలు దాటి భోజనాల గదిని సమీపిస్తున్నప్పుడు హాల్లో ఓ మూల నిలబడి వాళ్లకేసి మిణుకు మిణుకు మని చూస్తున్న బామ్మ "ఒరే... చక్రం... ఓసారిలా వస్తావూ" అని పిలవడం వినిపించింది రాజుకు.

చక్రధర్ అటు వెళుతుంటే... రాజు కూడా అప్రయత్నంగా ఆగాడు.

ముసలామె.. చేతిలో జపమాల తిప్పుతూనే గొంతు తగ్గించి అడుగుతోంది "ఆ పిల్లవాడు మన వాళ్లబ్బాయేనంటావా?"

నోరు చేదుగా అయింది రాజుకు.

"మనిషిని చూస్తుంటే తెలీడంలా? పచ్చగా దబ్బ పండులా ఆ రంగూ... ఆ వాలకం! వెధవ అనుమానాలూ... నువ్వునూ" చక్రధర్ విసుక్కుంటూ చెప్పి గబగబ రాజువైపుగా వచ్చాడు.

"ఏమిట్రా ఇక్కడే నిలబడ్డావ్.. పద లోపలకు"

"రా నాయనా" పరమేశ్వర శాస్త్రి పిలిచాడు.

రాజు భోజనాల గదిలో పీటలముందు వడ్డించిన విస్తర్ల వంకా... చక్రధర్ వంక మార్చి మార్చి చూశాడు.

"రేయ్.. ఏమిటోరా... ఉన్నట్టుండి ఆకలి చచ్చిపోయింది. నాకిప్పుడేం వద్దు" గిరుక్కున వెనుదిరిగాడు.

చక్రధర్ ఒడుపుగా రాజు భుజం వడిసి పట్టుకుని తనవైపు తిప్పుకున్నాడు. ఒక్క క్షణం రాజు కళ్లలోకి లోతుగా చూశాడు.

"నోరు మూసుకుని లోపలకు నడువ్" ముందుకు తోశాడు.

"ఆకల్లేదురా... మళ్లీ తింటా"

"నోరు ముయ్యమన్నాగా?"

"అది కాదురా..."

"షటప్.. ఏదికాదో ఏది అవునో... నాకు తెలుసు. ముందు భోంచెయ్... తరవాత మాట్లాడుతా"

చక్రధర్ కేసి నిర్లిప్తంగా చూశాడు రాజు. తరవాతేమనుకున్నాడో... మౌనంగా వెళ్లి... విస్తరిముందు కూర్చున్నాడు.

★ ★ ★

"ఒరేయ్ చెక్రీ...!"

"ఊc..."

"ఓ మాటడుగుతా. నిజం చెబుతావా?"

"ఇప్పుడడక్కు. నాకు నిద్రొస్తోంది"

భోజనానంతరం విశ్రాంతిగా పడుకుని ఉన్నారిద్దరూ చక్రధర్ గదిలో.

చక్రధర్ అటు తిరిగి పడుకుని నిద్ర

## కొత్తగాలి...

**వర్షాలతో రోడ్డంతా**
**గోతులు**
**డబ్బులతో కాంట్రాక్టర్ల**
**జేబులు**

*-పి.వి.ఎస్ ప్రసాద్, నవులూరు, గుంటూరు జిల్లా*

## కొత్తగాలి...

**చివరగా**
**మనను మోసే**
**నాల్గు భుజాలకు**
**కృతజ్ఞతలు చెప్పుకోలేం!!**
**కృతఘ్నులం మనం!**

*-కందాళై రాఘవాచార్య, బొబ్బిలివాడ, నిజామాబాద్*

నటించాడు.

"చెక్రీ... జోక్కాదు... బి సీరియస్"

రాజు లేచి పట్టెమంచం మధ్యలో కూర్చుని చక్రధర్ భుజం పట్టి బలవంతంగా తనవైపు తిప్పుకున్నాడు.

ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాడు చక్రధర్, "ఏమిట్రా... అసలేమిటి నీ ఉద్దేశ్యం? ప్రయాణం చేసొచ్చావ్... సుష్టుగా భోంచేశావ్. కాసేపు విశ్రాంతిగా పడుకోక ఈ కాకి గోలేంట్రా నాయనా! కన్ను మూతపడ్డం... నువ్వు కాలుగీరడం ఇది పదోసారనుకుంటా చెప్పటం... ఇప్పుడు నువ్వేం మాట్లాడినా నేను వినను. హాయిగా నిద్రపో"

"నువ్వు నాకు సమాధానం ఇచ్చేంతవరకూ నిద్రపోను... నిన్ను నిద్రపోనివ్వను. నాకోపక్క మనసు బాగోకపోతే నిద్రట నిద్ర" మొండిగా అన్నాడు రాజు.

చక్రధర్ రాజుకేసి కోపం నటిస్తూ చూసి "సరే... ఏడువ్" అన్నాడు.

"ఇన్నాళ్లూ... నిజంగా నా కులమేంటో నీకు తెలీదూ? ఒంటిరంగు చూసి మీ కాస్ట్ అనుకున్నావా? అలా అనుకునే నాతో స్నేహం చేశావా?"

"ష్" చక్రధర్ చప్పున సైగచేసి స్వరం తగ్గించి చెప్పాడు. "పద... అలా మా మామిడి తోపులోకెళ్లి మాట్లాడుకుందాం"

ఇద్దరూ లేచి చెప్పులేసుకుని బయలుదేరారు. ఇల్లు దాటి పదిగజాల దూరం వెళ్లాక రాజు మళ్లీ అదే ప్రశ్న రిపీట్ చేశాడు.

"మహాప్రభో... మామిడి తోపులోకెళ్లాక మాట్లాడదామన్నానా?" విసుక్కున్నాడు చక్రధర్.

పదినిముషాలు నడిచాక మొదలైంది కమ్మటి మామిడాకుల సువాసన. ఆహ్లాదకరమైన అనుభూతితో గుండె నిండిపోగా మనసులోని బాధ క్షణంపాటు మటుమాయం అయినట్టనిపించింది రాజుకు.

వారిద్దరూ తోటలోకి ప్రవేశించారు. చుట్టూ మట్టిగోడలు పెట్టి... తాటాకు కప్పు వేసిన ఓ గుడిసె ముందు వాల్చివుందో నులక మంచం. దానిమీద వెల్లికిలా పడుకుని ఆ మామిడి చెట్ల చల్లదనాన్ని మైమరచి అనుభవిస్తూ గురక పెడుతున్నాడు ఓ వృద్ధుడు.

"నర్సి తాతా!" పిలిచాడు చక్రధర్ మంచానికి కాస్త దగ్గరగా వెళ్లి.

నర్సి తాత ఉలకలేదు పలకలేదు గాని.. గుడిసెలోంచి ఓ యువతి తల బైటకు పెట్టి చూసింది. మంచి నిద్రలోంచి లేచినట్టు మత్తుగా ఉన్నాయామె కళ్లు. చక్రధర్ని చూడగానే మత్తు గిత్తూ ఎగిరిపోయిందేమో తత్తరపడుతూ ఇవతలికొచ్చింది.

"దండాలు బాబుగోరూ"

"నీ దండాలు దస్కాలు పొయ్యిలో పెట్టు. తోటక్కాపలా కాయమంటే శుభ్రంగా గురక తీస్తున్నారేమిటి తాతా మనవరాళ్లిద్దరూ?"

చక్రధర్ అలా అంటుండగానే ఆమె తాతను లేపే ప్రయత్నంలో పడింది. ఆయనను అటూ ఇటూ కుదిపి చెవిలో గట్టిగా అరిచి చెప్పింది "లెగు... లెగు... బాబుగారొచ్చింద్రు"

అంత లావు నిద్రా గురకా ఎటెగిరిపోయ్యాయో మరి దిగ్గున లేచి... ఊడిపోతున్న పంచెను ఎగ్గట్టుకుని చక్రధర్‌కి

చేతులు జోడించాడా వృద్ధుడు.

ఒకింత భయంగా గౌరవంగా చూస్తూ సిగ్గుగా అన్నాడు.

"సెమించాల సిన్నయ్యా... యాందో నాయాల్డి సల్లగాలికి పానం ఎటో పోనాది ఇయ్యాలే... తమరి మీనొట్టు సామే. రోజూ రమ్మన్నా వచ్చేటిదిగాదు పాడు నిద్దర. ఇయ్యాలదేటో..." సగంలో ఆపి తల గోక్కుంటూ ఉండిపోయాడు.

నర్సప్ప పడుకునివుంటే తెలీలేదుగాని నిలబడ్డాక తెలిసింది... చెయ్యెత్తు మనిష తను... చర్మం వడలినా ఎముక దిట్టమైన వాడేమో... బాగా కనిపిస్తున్నాడు. ఇంత లేసి బొౠరమీసాలూ... ఎర్రటి కను గుడ్లూ... మొత్తం మీద మామిడికాయల దొంగలకు ఝడుపు పుట్టించే రూపం.

అంత మనిషీ వినయ విధేయలతో వంగిపోయి మరుగుజ్జుగా మారి, కాపలా సమయంలో నిద్రపోవటమనే ఘోరపాపం చేసినందుకు చక్రధర్‌కి సంజాయిషీ ఇచ్చు కుంటుంటే ఏమిటో అనిపించింది రాజుకు.

"ఇంత ఎర్రటి ఎండవేళ... మామిడి పిందెల కోసం ఎవరొస్తార్లే తాతా" పడు కుంటే ఏం పోయిందిలే అన్న అర్థం వచ్చేలా అన్నాడు రాజు.

"అమ్మమ్మమ్మ! అట్టనమాక సామె... పిల్లమూక సెట్ల మీనబడి పిందేపూతా దులిపేది ఈ యాలప్పుడే. సల్లంగా గాలీ స్తుంటే.. పనికి పాలుమాగి కన్ను గూర్కినా సామె"

పోనీలే కుర్రాడు తనకు సపోర్ట్ ఇచ్చా డన్న కృతజ్ఞతైనా లేకుండా... యజమాని మీదే దృష్టి నిలిపి తనను తనే పదే పదే తిట్టుకునే నర్సప్పను చూస్తే రాజుకు చిత్రంగా కోపం రాలేదు. ఎందుకో ఆ ముసలాడి మీద జాలేసింది. "సరేలా తాతా... పోనీలే" అని చక్రధర్‌ని ఒకింత ఆశ్చర్యంగా చూశాడు.

"అదేంగాదులే.. సెరూసేపల ఇగురుతో వరి బువ్వలాగిచ్చాలకి మా తాతకు ఒల్లు దెలీలా" నవ్వింది తాతను లేపిన యువతి. నవ్వాక గుడిసె లోపలికెళ్లి రెండు ఫోల్డింగ్ చెయిర్స్ తెచ్చి నులకమంచానికి కాస్త దూరంలో వేసింది.

"ఇక్కడ కాదు మంగా.. అదో అక్కడ వెయ్యి" దూరంగా రెండు చెట్లమధ్యగా ఉన్న ఖాళీ జాగాకేసి చూపిస్తూ చెప్పాడు చక్రధర్.

ఆమె గబగబ కుర్చీలు మోసుకెళ్లి అతను చెప్పినట్లే వేసింది.

ఇద్దరూ వెళ్లి కూర్చున్నారు.

చక్రధర్ విశ్రాంతిగా చెయిర్ వెనక్కి జారబడి రాజుతో ఏదో అనబోయిన వాడల్లా.. మంగ ఇంకా అక్కడే ఉండటం గమనించి చెప్పాడు, "నువ్వెళ్లిపో ఇక"

ఆమెను దూరంగా వెళ్లనిచ్చి రాజు వంక సూటిగా చూశాడు. "ఆc.. ఇప్పుడడ గరా... ఇందాక నువ్వడిగిన ప్రశ్న"

"నా ప్రశ్నకు జవాబు చెప్పడానికి ఇంత సెట్టింగ్ కావాల్సి వచ్చిందిరా నీకు? " చిరా కును ప్రదర్శించాడు రాజు.

చప్పున మారాయి చక్రధర్ ముఖంలో రంగులు. ఇంత క్రితం లేని ఏదో ఆర్ద్ర భావం కళ్లలో కదలాడుతుండగా... మార్ద వంగా అన్నాడు "రేయ్... నువ్వడిగింది మామూలు ప్రశ్న కాదురా. మన స్నేహా నికి నువ్వు విసిరిన సవాల్! అది ఎదు ర్కొనే ధైర్యం నాకా వాతావరణంలో ఉన్న ట్టనిపించలేదు. అందుకే నిన్నిక్కడకు తీసు కొచ్చింది."

రాజు రోషంగా చూసి, "అదేం కాదు...మన మాటల్లో నేను బ్రాహ్మడ్ని కానని ఎక్కడ బయటపడుతుందో.. ఆ రహస్యం ఇంట్లో ఎవరైనా వింటారేమో.. వింటే ఏం కొంపలంటుకుంటాయో అన్న భయంతోనే నన్నిలా తోటలూ దొడ్లూ

అంటూ ఈడ్చుకొచ్చావ్."

"నీ ఇష్టం... ఏమైనా అనుకో"

రాజు... ఓ నిముషం పాటు నిశ్శబ్దంగా ఉండిపోయి అడిగాడు "చెప్పరా... నిజం చెప్పు... నా కులం నీకు తెలీదూ? "

"తెలీదు"

"తెలీదు కాబట్టే... మీ కాస్టే అనుకుని స్నేహం చేశావ్ నాతో"

"కాదు"

"మరి... మరెందుకలా చెప్పావ్ మీ బామ్మతో"

"ఏం చెప్పాను? " ఆశ్చర్యంగా చూశాడు.

"ఆ ఒంటి రంగు చూస్తుంటే తెలీడం లేదూ... మనవాడే అన్లేదూ నువ్వు!"

"ఓం... అదా!" చక్రధర్ నవ్వేశాడు.

"మా బామ్మ వొట్టి చాదస్తపు మనిషిరా. ఆ మహాతల్లిని కన్విన్స్ చేద్దామని అలా అన్నా"

"మీ యింట్లో మీ బామ్మేనా చాదస్తపు మనిషి... మిగతా అందరూ ఫార్వర్డా? "

"అలా అని చెప్పలేనుగాని... మా బామ్మతో పోలిస్తే... వందరెట్లు బెటర్. అందరిలోకీ మా నాన్నగారి భావాల్లో మోడర్నిటీ ఎక్కువనుకుంటా. ఆయన్ని ప్రాక్టికల్‌గా నేను అబ్జర్వ్ చెయ్యలేదు గాని... థీరిటికల్‌గా ఆయనకా భేదాలు న్నట్టు కనిపించవ్. ఆయన నోటిగుండా... 'ఆం ఇంకా ఈ రోజుల్లో కులమతాలేంటి? ఆ కాలం ఎప్పుడో చెల్లిపోయింది. ఇప్పు డంతా ఫాస్ట్' అనడం ఎన్నోసార్లు విన్నా"

"మరి నిజం చెప్పకూడదూ!"

"ఏ నిజం? "

"అదే... నా కులం"

"నీ కులమేంటో... ముందు నాకు తెలి సేడిస్తేగా!" గలగల నవ్వాడు చక్రధర్.

"చెప్పనా? " సూటిగా చూశాడు నవ్వు తున్న చక్రధర్‌కేసి రాజు.

"వద్దు" చప్పున చెప్పాడు చక్రధర్.

"సృష్టిలో తియ్యనిది స్నేహం అని ఎందుకంటారో తెలుసా రాజూ? " కులమ తాలకతీతంగా ఈ మనుషుల మధ్య ఏర్పడే బంధం అది కాబట్టి. ఇప్పుడు నా స్నేహితుడి కులం అడిగి తెలుసుకుని ఆ బంధాన్ని అవమానపరచలేను"

"చెక్రీ" సంభ్రమంగా చూశాడు రాజు చక్రధర్ వైపు.

ఇన్నాళ్ల స్నేహంలో తను గమనించని సరికొత్త కోణం అతనిలో కనబడుతుంటే.

గుండెల్లో ఇంతక్రితం మండిన మంటకు చక్రధర్ మాటలు చందన లేపనాలు పూస్తుంటే కుర్చీ వెనక్కువాలి ఒక్క క్షణం హాయిగా కళ్లు మూసుకున్నాడు రాజు. అతనికేసే చూస్తున్న చక్రధర్‌కి... ప్రశాం తంగా ఉన్న అతని నుదురు తిరిగి ముడతపడ్డం కన్పించింది.

ఆ ముడత కర్థం ఏమై ఉంటుందా అని అతను ఆలోచిస్తున్నంతలోనే అన్నాడు రాజు, "రేయ్ చెక్రీ... నీకూ నాకూ కుల మత భేదాల్లేవు. అంతవరకూ గొప్పవాళ్ల మే. గర్వించదగ్గ విషయమే కానీ... బ్రాహ్మడినని అబద్ధమాడి... మీ ఇంట్లో సహపంక్తి భోజనానికి కూర్చోబెట్టావ్! అది తల్చుకుంటే మాత్రం నాకు చాలా అస హ్యంగా ఉందిరా. అంతకన్నా నేను మీవాడ్ని కాదని చెప్పి... నాకు మరోచోట భోజనం వడ్డించినా... నేనింతకంటె తక్కువ బాధపడి ఉండేవాడ్నేమో!"

"ఏమిటోరా.. నువ్వు భోజనానికి కూర్చో బోతున్న ఆఖరి నిమిషంలో మా బామ్మ అలా అడిగేసరికి అసంకల్పితంగా అలా అనేశాను. బహుశా.. ఆ అబద్ధాన్ని.. మా కుటుంబాల్లోని ఆచార వ్యవహారాల పట్ల నాకు తెలీకుండా నాలో పెరిగిన కసివల్ల అనివుండొచ్చు లేదా నా ప్రాణ స్నేహి తుడ్ని ఆ ఛాందసురాలు అవమానిస్తుం దేమో అన్న భయంవల్ల కావచ్చు"

"సరే.. జరిగిందేదో జరిగిపోయింది. సాయంత్రం నిజం చెప్పెయ్. వాళ్లు విశాల హృదయంతో ఆదరిస్తే... ముందు అనుకున్న ప్రకారం ఓ నెల్లాళ్లు ఇక్కడే ఉండి ప్రకృతిని ఎంజాయ్ చేస్తాను. లేదంటే... చీకటితో లేచి ఫస్ట్ బస్ ఎక్కేస్తాను."

"విశాల హృదయమా పాడా... ఈ నరాధముల అందరి గుండె పరిమాణం పిడికెడేరా. సైంటిస్ట్ మహాశయులెప్పుడో సెలవిచ్చారుగా. అందుకే ఏ మనిషిని చూడు... సంకుచిత భావాలే" చక్రధర్ మానవాళినే ఎద్దేవా చేస్తున్నట్టుగా ముఖం అసహ్యంగా పెట్టాడు.

"నీ గుండె సైజు మాత్రం ఓ గుప్పెడెక్కువరా చెక్రీ" రాజు నవ్వుతుంటే చక్రధర్ కూడా శృతి కలిపాడు.

మంగ నాలుగు పచ్చి మామిడి కాయలు కోసుకొచ్చి అడిగింది "తింటారా సామి? "

అవి చూడగానే చక్రధర్ నోట్లో నీళ్లూరాయి.

"కాస్త ఉప్పుకారం ఉంటే బావుండేది" రాజు అన్నాడు.

ఉప్పుకారం తెమ్మంటున్న రాజు గొంతు విని అతనికేసి చూసింది మంగ.

"యాంది సామి? "

"ఉప్పూకారమట. అలాగే ఓ గ్లాస్ మంచినీళ్లు కూడా" చక్రధర్ అందించాడు.

"నాతో యాంటికి సాములూ పరాసికాలు? మారాజులు తమరు. మా ఇండ్లల్లో మంచినీళ్లు మీకియాల్నంటే మేము ఉంకో జల్మెత్తాల"

ఆ మాటలంటున్నప్పుడు మంగ పెదవుల మీద విరిసిన నవ్వును కాదు రాజు చూసింది, ఆమె కంటి క్రీనీడల్లో కదలాడిన విషాదాన్ని.

"బాగుంది. నువ్వింకో జన్మ ఎత్తేదాకా... మేమిలాగే ఇక్కడే మంచినీళ్లు కూడా తాక్కుండా నీ కోసం ఎదురు చూడాలా ఏమిటి? అక్కర్లేదు గాని... ఈ జన్మలోనే... ఇప్పుడే... ఇక్కడే... తాగుతాం గాని... త్వరగా పోయిపట్రా" చక్రధర్ చొరవగా చెప్పాడు.

ఆ మాటలు జీర్ణించుకోవడానికి ఓ నిముషంపైనే పట్టింది మంగకి. వాళ్లు నిజంగానే తెమ్మంటున్నారని గ్రహించగానే తూనీగలా పరిగెత్తి గుడిసెలో దూరింది.

వాళ్లడిగిన వస్తువుల్ని చిటికెలో తీసుకుని... పాత ట్రంకు పెట్టిలో దాచిపెట్టిన రెండు స్టెయిన్‌లెస్ స్టీల్ గ్లాసుల్ని బయటికి తీసి... నిండా చల్లని నీళ్లు నింపుకుని ఆఘమేఘాల మీద వచ్చిందక్కడికి. వచ్చేప్పుడు ఓ చాకు కూడా పట్టుకొచ్చింది.

రాజు ఆమె తెచ్చిన చాకుతో మామిడికాయను ముక్కలుగా కోశాడు. ఆ ముక్కల్ని ఇద్దరూ తను తెచ్చిన ఉప్పూకారంలో అద్దుకుని తింటుంటే ప్రపంచంలోని ఎనిమిదో వింతను చూస్తున్నట్టు నిలువు గుడ్లేసుకుని నిలబడిపోయింది మంగ.

ఆమె పరిస్థితి అర్థం చేసుకున్న చక్రధర్ చెప్పాడు.

"ఈ ఉప్పుందే... ఇది దొరికేది ఎవరికైనా సముద్రంలోనే... ఈ కారం తయారయ్యేది... చేలో పండిన మిరపకాయల్నించే. ఇవి మీ ఇల్లు చేరగానే తక్కువావు. మరొకరిల్లు చేరగానే ఎక్కువావు. వాటి రుచి మారనే మారదు"

"అట్టాగా" అన్నట్టు చూస్తుండిపోయిన మంగని అలాగే వదిలేసి... ఇద్దరూ బయ

## కొత్తగాలి...

నలుసు
నేల మీదుంటే అలుసే..
కంట్లోకి దూరిందా
గడుసే!

– సి.కామేశ్వరరావు,
కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా

లుదేరారు.

దార్లో ఆ ఊరి మోతుబరి రైతుల్లో ఒక డైన ఆదెయ్యా నాయుడు వీళ్లకు ముందుగా నడుస్తున్నాడు. సందుమలుపు తిరిగే చోట.. ఎదురుగా వస్తూ కనిపించాడొక బక్కపలచని వ్యక్తి. ఒంటి మీద చొక్కా కూడా లేదు. అప్పటిదాకా పొలంపని చేశా డేమో ఎండనపడి చెమటలు కక్కుకుంటూ వస్తున్నాడు.

ఆదెయ్యా నాయుడ్ని చూడగానే చట్టున ఆగిపోయాడు. ఆదరాబాదరా కాళ్ల చెప్పులు తీసి చంకలో పెట్టుకుని.. "దండాలు బాబయ్యా" అంటూ దారి పక్కగా ఒదిగి నిలబడ్డాడు.

"ఏరా సింగా.. ముసిల్దానికి జొరం తగ్గిందా? " ఆదెయ్యా పలకరించాడు.

"అయ్... తగ్గినాదు సామె. ఇంగా మెతుకు మింగుడు పడడంలే"

"అదే మింగుడు బడద్దిగాని... రేపు తెల్లార్నుంచీ దాన్ని పన్లోకి పంపారేయ్. మీయమ్మగారు సేసుకోలేక సత్తన్నాది"

"అట్టాగేనండయ్యా"

ఆదెయ్యా నాయుడు దర్జాగా నడుచు కుంటూ వెళ్లిపోయాడు. ఆయన వేసుకున్న టెరికాటన్ చొక్కా ఎండకు నిగనిగలాడు తుంటే... దానికేసే కళ్లు మలపకుండా కాసేపు చూసి.. ఆయనకీ తనకీ దూరం పదడుగులు పెరిగిందని నిర్ధారణ కొచ్చాక సింగన్న చంకలోని చెప్పుల్ని నేలమీద పడేసి.. వాటిల్లో కాళ్లు దూర్చాడు.

నడవటం ఆపేసి... ఆ దృశ్యాన్ని ప్రమాన్పడి చూస్తున్న రాజు భుజాన్ని చిన్నగా తట్టాడు చక్రధర్.

ఒక మనిషి... మరో మనిషి ముందు... కాళ్లకు చెప్పులు కూడా వేసుకో కూడని హీనస్థితికి ఎందుకు వచ్చాడు? అసలా పరిస్థితిని ఎవరు సృష్టించారు? తనకు తనే కల్పించుకున్నాడా? లేక ఒకరిచేత అలా ఉండమని శాసించబ డ్డాడా?

మామిడితోపులో తేలికైన రాజు మనసు మళ్లీ బరువెక్కింది.

ఆ బరువెంతో అంచనా వేస్తూ అతని వెంట మౌనంగా నడుస్తున్నాడు చక్రధర్.

★ ★ ★

"రేయ్ కర్రోడా! ఎవరితోనైనా పెట్టుకో గాని చాముండితో పెట్టుకోకు. ఇంకోసారి చెట్లమీద చెయ్యేశావో చెడుగుడు ఆడేస్తా, ఖబడ్దార్!"

చక్రధర్ చెల్లెలు చాముండేశ్వరి గేటు బయట నిలబడి... నల్లగా సన్నగా ఉన్న ఓ ఇరవయ్యేళ్ల కుర్రాడ్ని నిలబెట్టి దులిపే స్తోంది. ఆ అబ్బాయి చేతిలో ఎర్రటి బోగన్ విల్లా గుత్తులున్నాయి.

అప్పుడే మామిడి తోపునుంచి రాజుతో తిరిగొస్తున్న చక్రధర్.. చెల్లెలి మాటల ధాటిని దూరం నుంచే పసిగట్టి రాజుకంటే ఓ అడుగు వేగంగా వేసి చాముండిని సమీ పించి అడిగాడు, "ఏంటే గోల? "

"చూడన్నయ్యా.. ప్రతిరోజూ ఇంతే. మనందరం మధ్యాహ్నం పూట అలా నడుం వాలుస్తామా.. వచ్చేస్తాడీ కర్రోడు. ఏ పూలు దొరికితే అవి చెట్ల మీద పడి దూసేస్తాడు. నాకు నిన్నటిదాకా అర్థం కాలా ఏ మేకనో గోడమీంచి దూకి మొక్కలు తొక్కేస్తోందేమోననుకున్నా. నిన్న సుశీల గమనించి చెప్పింది.. రోజూ వీడు దొంగలా దూరి పూలు కోస్తున్నా డని. ఈరోజు కనిపెట్టుకుని చూస్తున్నా.. వచ్చేశాడు గాడి..."

మాట పూర్తి చెయ్యకుండానే చప్పున ఆపేసి నాలుక్కరుచుకుంది. ఆమె అంతవ రకూ అటు తిరిగి ఉండటంతో చక్రధర్ వెనకే వచ్చిన రాజును గమనించలేదు. మాట్లాడుతూ మాట్లాడుతూ అనుకో కుండా... ఇటు తిరిగింది. నిశ్శబ్దంగా నిల

బడి తనకేసే చూస్తున్న రాజును గమనించగానే... ఆమె బుగ్గలు మంకెనలయ్యాయి. ఇందాకటి వాగ్ధాటి ఏమైందో మరి... అసలు మాటలే రానిదానిలా మారిపోయి వెనకనుంచి ఎవరో తరుముకొస్తున్నట్టూ రెండంగల్లో ఇంట్లోకి ఉరికింది.

రాజుకు చిత్రంగా అన్పించింది. ఏవిటి చెంగు నడుముకు బిగించి ఒంటికాలిమీద విరుచుకుపడుతున్న చాముండి తనను చూడగానే ఎందుకలా పారిపోయింది.

"బ్రతికి పొయ్యావ్‌గాని ఇక వెళ్లి బలుసాకు అమ్ముకో" చక్రధర్ ఆ యువకుడితో నవ్వుతూ అన్నాడు.

ఇద్దరూ లోపలికెళ్లి... బావి దగ్గర కాళ్లూ చేతులు కడుక్కుని వరండాలో కూర్చున్నారు.

లోపల బజ్జీలు చేస్తున్నట్టున్నారు. నూనెలో వేగుతున్న శనగపిండి వాసన వాళ్ల ముక్కు పుటాలకు తగులుతోంది.

"ఇప్పుడు చెప్పెయ్" రాజు అన్నాడు.

"ఉహుఁ ముందు టిఫిన్‌కానీ... రాత్రికి చూద్దాంలే"

"చూద్దాం కాదు... నాకలా మోసం చెయ్యటం ఇష్టం లేదు"

"ఓకే తప్పకుండా చెప్పేస్తా, సరేనా!"

"అన్నయ్యా" తలుపు చాటునుంచి చాముండి పిలిచింది.

గాజుల సవ్వడి విన్పిస్తోంది. పాదాల దగ్గర జీరాడుతున్న పరికిణీ కుచ్చిళ్లు కన్పిస్తున్నాయి.

"ఏమిటి? " అడిగాడు చక్రధర్.

"టిఫిను" సాధ్యమైనంత మెల్లగా చెప్పిందామె.

"ఇలా పట్రావమ్మా" చక్రధర్ విసుగ్గా అన్నాడు. చాముండి మరీ అంతగా దాగుడు మూతలాడ్డం అతనికి చిరాగ్గా అన్పిస్తోంది.

"ఉహుఁ... వచ్చి తీసుకో"

## కొత్తగాలి...

లెక్కగ
నాలుగు చినుకులు
స్నానిద్దామనుకున్న భూదేవికి
పెదాలు కూడా తడవలేదు!

– వి.వి.ఎన్.ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

"అన్నీ వేషాలు!" చక్రధర్ కోపంగా ఆమె చేతిలోని ట్రేని తీసుకొచ్చి తనకూ రాజుకూ మధ్యగా వున్న టీపాయ్ మీద పెట్టాడు.

వేడి వేడి బజ్జీలు సర్దిన ప్లేట్లున్నాయి ట్రేలో. ఓ ప్లేటు తీసి రాజుకిచ్చి తనొకటి తీసుకుంటూ ఇంకా అక్కడే గుమ్మం చాటున తచ్చాడుతున్న చెల్లెల్ని అడిగాడు, "నాన్నేడీ? "

"నాకు తెలీదు" ముక్తసరిగా అని లోపలికెళ్లిపోయింది.

"నిన్న వీరిగాడి చెల్లెలు మనవాళ్ల బావిలో నీళ్లు పట్టుకెళ్లిందని గొడవైందిగా! ఈరోజు పిచ్చిరాజుగారి మనుషులు వాడలోకెళ్లి... ఆ వీరిగాడ్ని... వాడికి వత్తాసొచ్చిన ఇంకో ఇద్దరు కుర్రాళ్లనీ కొట్టార్ట. వాడ జనాలంతా ఒక్కటై పోలీసు కేసు పెట్టబోతున్నార్ట. పంచాయతీ ఆఫీసు దగ్గర ఆగమాగమంగా వుంది. కరణంగారి మనిషొచ్చి మీ నాన్నను పిలుచుకెళ్లాడు" వరండాలోనే ఓ మూలనున్న నవారు మంచం మీద వెల్లికిలా పడుకుని వున్న బామ్మ లేచి కూర్చుని వివరం చెప్పింది చక్రధర్‌కి. చెప్పి మళ్లీ అంది "అయినా పిదపకాలం, పిదప బుద్ధులనీ... ఆ పిల్ల దానికిదేం మాయరోగమో! కావాలని ఊళ్లోకొచ్చి నీళ్లు పట్టుకెళ్లిందట! పుండరీకాక్షయ్య భార్య 'ఇదేం పని చంద్రా!' అనడిగితే.. 'ఈ పని మేము ఎప్పుడో చెయ్యాల్సింది. ఇన్నాళ్లకి ఇంత లేటుగా చేస్తున్నాం' అందట.

ఎంత పోకిరిపిల్లో చూశావా? చదవేస్తే ఉన్న మతిపోయిందని.. పట్నంలో దిగబడి నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చేసరికి... దానికి ఒళ్లూపై తెలీడంలా! అవ్వ దీని విరగబాటు గ్రామానికి ఏంచేటు తెస్తుందో ఏమిటో! హరీ... హరీ...! అనాథ రక్షకా! కాలం ఎటు పోతోందయ్యా స్వామీ! మడీ తడీ ఆచారం... అన్నీ మంటగలిసి పోతున్నాయ్. కలికాలం! ప్రపంచం అంతమయ్యేరోజు దగ్గరకొచ్చేసింది"

ఆవిడ సణుక్కుంటూ చేతిలోని రుద్రాక్ష మాలను తిప్పుతోంది.

రాజు బజ్జీలు తినడం ఆపి అడిగాడు, "ఏమిట్రా... నీళ్లేమిటీ? గొడవేమిటీ?"

చక్రధర్ రాజు కళ్లలోకి ఒక్కక్షణం లోతుగా చూశాడు "మా పల్లెల్లో గొడవలు నీకు చెప్పినా అర్థం కావు. వింటే నవ్వుతావ్. లీవిట్.. బజ్జీలు ఇంకా రెండేస్కో"

"ఇందులో నవ్వులాటేముందిరా చక్రీ... వింటుంటే ఒళ్లు మండిపోతుంటేనూ! మాలపల్లె నుంచి నట్టనడివూళ్లోకొచ్చి.. నీళ్లు పట్టుకెళ్లిందంటే ఆ పిల్ల కెన్నిగుండెలు! పట్నాలెలాగూ పాడైపోయినై. ఎక్కడ చూసినా వర్ణసంకరం జరిగిపోతోంది. మన పల్లెల్లోనైనా సంప్రదాయం బతికిబట్టకడుతుందా అంటే అనుమానంగానే వుంటోంది. అయినా ఎవర్నని ఏం లాభంలే! కాలం అలా తగలడిపోతోంది. మా కాలంలో అయితే మడిబట్ట చుట్టుకున్నప్పుడు... కడజాతివాడ్ని కంటితో చూసినా మళ్లీ స్నానం చేసేవాళ్లం. ఇప్పుడంత ఆచారం ఎక్కడ చచ్చిందీ?" బామ్మ వాక్ప్రవాహం వింటుంటే రాజుకు తింటున్న బజ్జీలు రుచించలేదు.

"అన్నయ్యా పాయసం" తలుపు చాటు నుండి మళ్లీ చాముండి పిలుపు.

చక్రధర్ వెళ్లి అందుకున్నాడు "ఏమిటే నీ వరస! నీకేదో పెళ్లిచూపులు జరుగుతున్నట్టు. ఇవతలికొచ్చి ఇవ్వలేవా?"

"ఇవ్వను" చెప్పింది చాముండి.

చక్రధర్ చెల్లెల్ని మింగేసేలా చూసి రాజు దగ్గర కొచ్చాడు. అతనికో గ్లాసు అందించి... తనోటి సిప్ చేస్తూ కూర్చున్నాడు.

ఓ నిముషం గడిచాక గమనించాడు చక్రధర్. రాజు అసలు తాగటం లేదని "ఓర్నీ దుంపతెంచ... ఏమిట్రా అంత దీర్ఘాలోచనా? విషయం చెబుతాగాని తాగేడువ్"

"ముందు చెప్పవోయ్" రాజు చిరాగ్గా అన్నాడు. చెప్పమంటున్నాడే గాని అతనికి ముసలమ్మ మాటల ద్వారా విషయం దాదాపుగా అర్థమైపోయింది.

"వీరిగాడంటే హరిజనుడురా. చంద్ర అనే అమ్మాయ్ వాడి చెల్లెలు. సొంత చెల్లెలు కాదు. చుట్టాలమ్మాయ్. వాడి పిన్నమ్మ కూతురనుకుంటా. ఆమె తండ్రి టౌన్‌లో టీచర్. ఈ పిల్ల పుట్టినప్పటి నుంచీ అక్కడే పెరిగింది. ఏ కారణం చేతో ఆ పిల్లనెప్పుడూ ఇక్కడికి పంపలేదు వాళ్లు. వీరిగాడి కుటుంబసభ్యులే అప్పుడప్పుడెళ్లి చూసొస్తుండేవాళ్లు. మరెందుకొచ్చిందో.. వారం క్రితం ఈ వూరొచ్చింది. వచ్చిందగ్గర్నుంచి ఏదో ఒక చిలిపిపని చేస్తూనే ఉంది. పట్న వాతావరణంలో పెరిగిందేమో! పల్లెటూరి పద్ధతులు తెలియవు లాగుంది. టౌన్‌లో అంటే... కుల మతాల పట్టింపులు ఇక్కడున్నంత ఇదిగా ఉండవ్. ఎవరి మానాన వాళ్లు బతుకుతుంటారు. ఓ పోర్షన్‌లో బ్రాహ్మణులుంటే మరో పోర్షన్‌లో ముస్లిమ్‌లుంటారు. గ్రౌండ్‌ఫ్లోర్‌లో ఏ రెడ్డీసో వుంటే పైన క్రిస్టియన్సుంటారు. ఈ దరిద్రగొట్టు పల్లెల్లో అట్లా కుదరదు. ఆ పిల్ల ఇక్కడి పరిస్థితులతో రాజీపడలేక మొండిగా

బిహేవ్ చేస్తోంది. మొన్న పెద్దరెడ్డి ఎదు రైతే దారి తొలగలేదట. నిన్నేమో ఎంచక్కా ఊర్లోకొచ్చి నీళ్లు పట్టుకుపో యింది. ఇక చూడు గొడవ... గాలి దుమారంలా లేచింది. వీళ్లెళ్లి వాళ్లను తిట్టడం... వాళ్లు రెచ్చిపోయి వాగడం... వీళ్లు వాళ్ల వీపులు చిట్లగొట్టడం... పోలీసులూ... కేసులూ..." చక్రధర్ చెబుతుండగానే వచ్చాడు పరమేశ్వరశాస్త్రి.

"ఏమైంది నాన్నా?"

"ఏమౌతుంది? ఇరుపక్షాలకీ సర్దిచెప్పేసరికి నా తల ప్రాణం తోకకొచ్చేసింది. ఆ వీరిగాడి చేత వీళ్లకు క్షమాపణ చెప్పించి... రేపు జలశుద్ధి కార్యక్రమం చేసి బావిని మళ్లీ నలుగురూ వాడేట్టుగా చేస్తానని వీళ్లను ఒప్పించా. అబ్బో! ఒక పట్టాన దారికి రాలేదులే సమస్య. మొత్తంమీద రాజీ కుదిర్చా. ఆ పిల్లయినా మరీ చిచ్చర పిడుగులా ఉందిలే. పల్లెకట్టుబాట్లు పల్లెవి. పట్నం పద్ధతులు ఇక్కడెలా కుదుర్తాయి? ఆ పిల్ల ఆశించే సమానత్వం ఇక్కడ ఇరవై ఒకటో శతాబ్దంలో కూడా సాధ్యపడదనుకుంటా" నిట్టూర్చాడాయన.

ఆ రాత్రీ రాజు కోరినట్టు చక్రధర్ ఇంట్లో వాళ్లకి అతని కులం విషయం చెప్పలేదు.

భోజనాల వేళప్పుడు రాజు గుర్తుచేసినా "అబ్బ ఇవాళొద్దులేరా... రేపు తప్పకుండా చెబుతాగా" అంటూ దాటేశాడు.

రాజు భోజనం చేస్తుంటే... చక్రధర్ తల్లి కొసరి కొసరి వడ్డించింది. ఎందుకో గాని... అతను అన్నం తింటన్నంతసేపూ చక్రధర్ బామ్మ శ్రీనివాసమ్మ... ఏవో సంస్కృత శ్లోకాలు సణుక్కుంటూ చేతిలో రుద్రాక్షలు తిప్పుతూ... కళ్లింతింత చేసుకుని అతడికేసే చూస్తుండిపోయింది.

వీళ్ల భోజనాలు అయ్యేలోపు చాముండి మేడమీద పక్కలేసి వచ్చింది.

మేడెక్కగానే పడుకోకుండా పిట్టగోడ మీద కూర్చున్నారు మిత్రులిద్దరూ.

"అది కాదు చెక్రీ..."

"ఆ విషయం తప్ప..." చక్రధర్ హెచ్చరించాడు మరేదైనా మాట్లాడమన్నట్టు.

రాజు మాట్లాడ్డానికి మరేం లేనట్టు కిమ్మనకుండా ఉండిపోవడం చూసి చక్రధర్ అన్నాడు "న్యూస్ వింటావా?"

"చెప్పు" రాజు ముఖంలో ముడి వీడిపోయి సన్నటి హాసరేఖ పెదాలమీద కదిలింది.

"మన మోనాలిసా లేదూ.. పొలిటిక్స్ స్టూడెంట్ మధురవాణి.. రోజుకో రకం హెయిర్ స్టైల్‌తో కాలేజీకొచ్చేది... ఆ మహాతల్లి మొన్నామధ్య... ముంబయి వీధుల్లో గుండు గీయించుకుని తిరుగుతుంటే చూశాట్ట సముద్రగుప్తుడు. ఫారిన్‌లో ప్రస్తుతం అది లేటెస్ట్ ఫ్యాషనట.

"సముద్రగుప్తుడెవర్రా?"

"చంద్రగుప్తుడి నాన్న ఉరఫ్ జీవన్‌కుమార్"

"వాడా.."

"వాడే. అన్నట్టు సముద్రగుప్తుడికి ఎయిడ్స్ వ్యాధట.. తెలుసా? షాజహాన్ ఉత్తరం రాశాడు. అవునూ.. షాజహానయినా గుర్తున్నాడా?" అనుమానంగా చూశాడు చక్రధర్ రాజుకేసి.

గుర్తున్నాడన్నట్టు తలూపాడు రాజు. "షరీఫ్‌గాడు కదూ గుర్తున్నాళ్లే. అవునూ ఇంతకీ నూర్జహాన్‌తో వాడికి పెళ్లయిందా? లేదా!"

"ప్చ్.. కాలేదు. నూర్జహాన్ విశ్వామిత్రుడ్ని చేసుకుందట. వాడికి వైట్‌హౌస్‌లో బట్లర్ జాబ్ వస్తే.. భార్యతో సహా అమెరికా వెళ్లిపోయాడు."

"అశోక్ సామ్రాట్ ఏం చేస్తున్నాడో!"

"బడ్డీ హోటల్ పెట్టుకున్నాట్ట"

"పెర్సిస్ కంబట్టా?"

"విజయశాంతి దగ్గర సర్వెంట్ మెయి డ్‌గా చేస్తోందట"

"అన్నయ్యా?" ఉన్నట్టుండి వినబడింది చాముండి గొంతు.

చక్రధర్ లేచొచ్చి చెల్లెలికోసం చూశాడు. చిన్న మట్టి కూజాతో నీళ్లూ.. ఓ స్టీల్ గ్లాసూ పట్టుకొని నిలబడి వుంది చాముం డేశ్వరి... రెండు మెట్ల కిందుగా.

"నువ్వేంటే... మరీ ఓవర్ యాక్షన్ చేస్తున్నావ్. ఈ రెండు మెట్లూ ఎక్కి పైకొచ్చి నీళ్లక్కడ పెడితే నీ సొమ్మేం పోతుంది?"

చాముండి చక్రధర్‌వైపు ఉరిమి చూసిం దిగాని చీకట్లో కనబడలేదు.

నిశ్శబ్దంగా మెట్టు దిగి వెళ్లిపోయింది. ఆమె కాళ్లకున్న వెండి పాంజేబుల సవ్వడి.. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వచ్చి.. రాజు చెవుల దగ్గర ఘల్లుఘల్లు మంది

"ఎవరూ? మీ సిస్టరా?" తెలిసినా కావా లని అడిగాడు.

"కాదు... కొరివి దయ్యం... మంచినీ ళ్లిచ్చి వెళ్లింది. ఇక రా పడుకుందాం"

చక్రధర్... పడుకుని దుప్పటి కప్పుకు న్నాడు. రాజు కూజాలోంచి గ్లాసులోకి నీళ్లు వంపుకుని గటగట తాగాడు.

అదేం చిత్రమో... నీళ్లు... చాలా తియ్యగా అనిపించాయి.

మరో గ్లాసు వంపుకున్నాడు. ఈసారింకా తియ్యగా ఉన్నట్టనిపించాయి.

ఆ పిల్ల మంచినీళ్లకు బదులు అమృతం తేలేదు గదా! అయినా ఇందాక వచ్చింది చక్రధర్ చెల్లెలేనా... లేక వాడన్నట్టు...

"ఏమిట్రా అన్ని గ్లాసులు తాగుతున్నావ్" మూడోసారి గ్లాస్‌లోకి నీళ్లు వంపుతున్న ప్పుడు కప్పుకున్న దుప్పటి పక్కకు తీసి లేచి కూర్చున్నాడు చక్రధర్.

"నీళ్లేమిటో.. చాలా తియ్యగా వున్నా య్‌రా. ఎన్ని తాగినా..."

"తాగాలనిపిస్తోందా? మా ఊరి నీళ్లం తేరా. ఆ గ్లాసిటీ"

రాజు అందించిన నీళ్లు తాగి ముఖం ఆశ్చర్యంగా పెట్టాడు చక్రధర్.

"నీళ్లలో పంచదార కలిపింది చాముండి" ఒక క్షణం తర్వాత విషయం అర్థమై చెప్పాడు రాజుకు.




**జేడ్** గ్రీన్ చుడీదార్ పైజామా... ఎడం భుజం మీద పరుచుకుని గాలికి రెపరెపలాడుతున్న లేత గోధుమ రంగు మార్బుల్ షిఫాన్ చున్నీ... లిప్‌గ్లాస్ కింద తళతళ మంటున్న చిరునవ్వు...

"రియల్లీ... ఐ లవ్ కంట్రీ సైడ్" లిజీ ఫ్లోరా ఆ మాటలంటూ ఆ స్టేట్‌మెంట్ లోని ఆనందాన్ని ఆస్వాదిస్తున్నట్టూ... ఒక్కక్షణం కళ్లు మూసి తెరు స్తున్నప్పుడు... అందంగా మెరిసిన ఆమె కర్ల్డ్ ఐలాష్ వంక ఆరాధనగా చూస్తూ శమంతారెడ్డి "ఐ టూ" అంది.

"నాకిష్టంలేదు బాబూ... ఏముంటుందా పల్లెటూళ్లలో.. ఎట్‌లీస్ట్ ఓ లైబ్రరీ కూడా... అనుమానమే. బురదా... పశు వులూ... పొలాలూ... దట్సాల్. నో ఎంటర్‌టైన్‌మెంట్ ఎటాల్" వినీతాశర్మ అసహ్యించుకుంది.

"ఐయామ్ సారీ" అందుకుంది ఆర్తి

"పల్లె అందాలు నీలాంటి వాళ్లకేం తెలుస్తాయి. అసలు సిటీస్‌లో ఏముంటుందని? వట్టి సౌండ్ పొల్యూషన్.. ఎయిర్ పొల్యూషన్ తప్ప. ఒకటే పరుగులూ... హడావుడీ... మరీ యాంత్రిక జీవనం. పల్లెల్లో అయితే... ఆ లైఫ్‌స్టైలే వేరు. పచ్చని ప్రకృతీ... స్వచ్ఛమైన గాలీ... కల్తీలేని ప్రేమలూ... అభిమానాలూ వెరసి పల్లెటూళ్లు. అక్కడి మనుషుల ముఖాల్లో కదలాడే అమాయకత్వం చూస్తుంటే వెన్నెల్లో అమ్మ ఒడిలో కూర్చుని వెండి గిన్నెలో పాలబువ్వ తింటున్న అనుభూతి. ఆ అనుభూతి ముందు ఈ సిటీలూ.. సినిమాలూ... కార్లూ ట్రాములూ బలాదూర్"

సంగీతా నాయుడు చీక్స్ మీద బ్లషర్‌ని సుతారంగా కర్చీఫ్‌తో అద్దుకుంటూ అంది "ఆర్తి ఈజ్ సెంట్ పర్సెంట్ కరెక్ట్. మా గ్రేండ్ ఫాదర్‌ది విలేజ్. నేనక్కడికి వెళ్లినప్పుడల్లా గమనిస్తుంటాము కదా... అసలక్కడి మనుషులు ఒకర్నొకరు మనలా హాయ్... హెలో అంటూ పొడిపొడిగా పలకరించుకోరు. మామా అనో... అల్లుడా అనో... వరసపెట్టి ఆప్యాయంగా పిలుచుకుంటారు. నేనైతే మొదట్లో మొదట్లో... వూరు వూరంతా ఒకరికొకరు బంధువులేమో అనుకున్నా. తరువాత తెలిసింది. ఆ పిలుపులకు కారణం బంధుత్వం కాదూ... కేవలం అభిమానం అని. రియల్లీ అడ్మయిరింగ్ రిలేషన్‌షిప్"

"నిజంగా అంత బాగుంటుందా అక్కడి వాతావరణం" కిందపరుచుకున్న నీడల్లో రంగురాళ్లలా మెరుస్తున్న వెలుతురు బిళ్ళల్ని చూస్తూన్న చంద్రకళ అడిగింది.

"వెళ్లి చూడు తెలుస్తుంది" చెప్పింది ఆర్తి.

సంగీత తన బ్లూ జీన్స్ పేంట్‌కున్న పాకెట్‌లోంచి కిట్‌కేట్ బయటికి తీసి కొంచెం కొరుక్కుంది.

"యూ బ్లడీ రాస్కెల్... మాకు పెట్టకుండానే" వినీతా శర్మ ఆమెమీద పడి... లాక్కుని ఓ బైట్ తీసుకుని... చంద్రకళ ఒళ్లోకి విసిరింది చాక్లెట్ బాల్‌ని. చంద్ర కొద్దిగా కొరుక్కుని శమంతారెడ్డికి ఆఫర్ చేసింది. శమంత తర్వాత అది లిజీఫ్లోరా నోట్లోకి పోయింది.

చంద్రకళ ఆ రాత్రి వెంకటేశ్వరావు నడిగింది "నాన్నా! నెమళ్లలంకలో పెదనాన్న ఉన్నాడుగా. ఈ సెలవుల్లో.. నేనక్కడికెళతా!"

"ఎందుకురా.. పెదనాన్న ఇక్కడికి వస్తూనే వుంటాడుగా"

"పెద్దమ్మనసలు తీసుకునేరాడు"

"ఈసారి ఆమెను కచ్చితంగా తీసుకురమ్మని ఉత్తరం రాస్తాగా"

ఎందుకో మరి? తనక్కడికి వెళతానంటే నాన్న ససేమిరా ఒప్పుకోడు. అదేమని అడిగితే "ఎందుకు వెళ్లను... నీ చిన్నప్పుడు బోలెడుసార్లు తీసికెళ్లాం నిన్నక్కడికి" అంటుంది అమ్మ. అప్పటి సంగతి పోనీ... ఇప్పుడెళ్లాస్తానంటే... "నీ హెల్త్‌కి ఆ క్లైమేట్ పడదే... చిన్నప్పుడు వేగాముగా... వద్దు" అంటుంది. అయినా తను కూడా ఇంతకుముందు ఆ విషయానికి అంత ఇంపార్టెన్స్ ఇవ్వలేదు. పిక్నిక్‌లూ... పార్టీలూ... సినిమాలూ... షికార్లూ... స్టడీసూ... ఎగ్జామ్సూ.. ఎప్పుడైనా... కాలేజ్ నుండి ఇంటికొచ్చేసరికో... మధ్యాహ్నం లంచ్ టయానికో... నెమళ్లలంక నుంచి బంధువులొచ్చుంటారు. పెదనాన్న నా ఒళ్లంతా కళ్లతోనే ఆర్తిగా తడిమి "కుశాలగున్నావా తల్లీ" అంటాడు. ఆయన కొడుకు వీరయ్య, తన అన్నయ్య కుర్చీ అంచుమీద బిడియంగా కూర్చుని తనకేసి సిగ్గుసిగ్గుగా చూస్తాడు. తండ్రీ కొడుకులిద్దరూ నీరుకావి పంచలే కట్టుకుంటారు. చలువ చేసిన చొక్కాల మీద... అక్కడ

క్కడా నీలిమందు చారలు స్పష్టంగా కనబడుతుంటాయ్.

ఇద్దరూ మొయ్యగలిగినన్ని మూటలు తెచ్చి పడేస్తారు. పెసలూ మినుములూ మిరపకాయలూ చింతపండు... ఒకటేమిటి.. ఓ దుకాణమే పట్టుకొస్తారు. ఇవన్నీ కాక.. ప్రత్యేకంగా తనకోసం.. ఓ పెద్దసీసా నిండుగా పుట్టతేనె, స్టీలు కేన్లో ఆవు నెయ్యి తెస్తారు. "ఎందుకు బావగారూ ఇవన్నీ?" అంటున్న అమ్మతో అంటాడు పెదనాన్న "అమ్మికంటమ్మా..వోల్ల పెదమ్మ బంపింది. నాకేంటి తెల్సు?"

అన్నయ్య మెల్లగా నన్నడుగుతాడు "సెంద్రమ్మా... ఈ యేడు సదువైపోంగల్నే.... కలెకటేరివి అయిపోయినట్టేగా?" ఆ ప్రశ్న తనను ఎంతో ఇబ్బంది పెడుతుంది. తను చదివేది ప్రస్తుతం డిగ్రీ. తను ఐఏఎస్ రాసి కలెక్టరవుతుందో... ఐపియస్ చేసి పోలీసాఫీసరవుతుందో... అసలేమీ చెయ్యకుండా పెళ్లి చేసుకుంటుందో. ఒకవేళ అయితేగియితే... సెంట్రల్ లేదా స్టేట్ గవర్నమెంటాఫీసులో ఎల్డీసీ అవుతుందో! అయినా అవన్నీ వాళ్లకనవసరం. "మాయమ్మి పట్నంలో సదూతాంది. సదివి సదివి కలకటేరవుద్ది" అంటారు. దట్సాల్, కింది తరగతి మానవులందరూ తమ పిల్లోడ్నో, పిల్లనో స్కూల్లో అడ్మిట్ చెయ్యగానే కనే సినిమాటిక్ డ్రీమ్.

అదే రంగులకల అన్నయ్య కళ్లలో నన్ను చూసినప్పుడల్లా మెరుస్తుంది. ఆకల అర్థంలేనిదైనా దాన్ని కంటున్న కల్ల లేని మనసంటే తనకు చాలా ఇష్టం. వాళ్లు రెండే రెండు రోజులుంటారు. ఇంకా ఉండమంటాడు నాన్న. "బలేవోడివేరా... ఇంటికాడెన్ని పన్లు? రాళ్లాగొచ్చింది. ఇంగ నాలుగు దినాల్లో మొలకల పున్నమి. ఇత్త నాలయ్యి సల్లుకోవాల. రైతులు ఎదురుజూస్తుంటరు" అనేస్తాడు పెదనాన్న.

## కొత్తగాలి...



**చూస్తుంటే**
**వస్తుందా...**
**చేరవలసిన గమ్యం?..**
**అడుగేయకుండా...!**

**-తులసీరాం, హైదరాబాద్**

ఒక్కసారో.. రెండుసార్లో తీసుకొచ్చారు ఇన్నేళ్లలో పెద్దమ్మను. ఉన్న నాలుగురోజులూ తనింట్లోతననే ఎంతో అబ్బురంగా చూసుకునేది. పాలమీద మీగడ తీసి తన అరిపాదాలకు రుద్దేది. ఊర్నుండి పట్టుకొచ్చిన వెన్నపూసలో పంచదార కలిపి తినిపించేది. తినిపిస్తూనే "పసుల కాడ...ఎట్ట జేస్తుండదో ఆ తిరపతమ్మ? మొదులే పాలు పిండడం రాద్దానికి. కర్రావు మా పొగరుమోతు. ఒక్కోసారి పాలీకుండా ఎగిసి తంతది" అని సణుక్కుంటుంది. ఉండమని బతిమిలాడినా కోడల్ని తలచుకుని వెళ్లిపోవాలంటుంది. తీరా వెళ్లే ముందు... తమను వదల్లేక విలవిల్లాడుతూ "బాగా సదూకోమ్మా. పెద్దడాకటేరవ్. మనూల్లోనే వైద్దిగం సెయ్యాల నువ్. ఆ పిచ్చిరాజూ... పెద్దరెడ్డీ... నోల్లు ఎల్లబెట్టి సూడాల" అని తనవంక తృప్తిగా చూస్తుంది.

వీరన్న చెప్పినట్టు కలెక్టర్ అవ్వాలో, పెద్దమ్మ కోరినట్టు డాక్టర్ కావాలో తను అర్థంకాక చూస్తుంటే.. చెంగుతో కళ్లొత్తుకుంటూ తిరిగి తిరిగి చూసుకుంటూ వచ్చిన కొడుకుతో వెళ్లిపోతుంది.

అయితే ఇన్నిటి మధ్య తనకర్థం కానిది ఒకటే. ఎప్పుడూ పెదనాన్నగాని, పెద్దమ్మగాని, అన్నయ్యగానీ... వాళ్ల వూరు రమ్మని తనను ఆహ్వానించలేదు. ఎప్పుడైనా నాన్న మాత్రం ఏ రెండేళ్లకో ఒకసారి

## కొత్తగాలి...

**అమ్మడైతే ఆకలికి అడది**
**వెలయాలు**
**అమ్మడైతే కట్నానికి మగాడు**
**పెళ్లి కొడుకు!**

—వై.కె.మూర్తి, విజయవాడ

వెళ్లొస్తాడు. తను ఓసారి నాన్నతో పాటు వెళ్లాలని అడిగితే "వద్దమ్మా అక్కడి వాతావరణం నీకు సూటుకాదు" అని దాటేశాడు నాన్న. తనకీ అంత ఇంట్రెస్ట్ లేక పోవటంతో తనెప్పుడూ ఆ విషయంలో పట్టుపట్టలేదు.

ఇప్పుడెందుకోగాని... ఓసారి వెళ్లిరావాలని మనసులో తీర్మానించుకుంది. అది బహుశా.. ఆర్తీ.. సంగీతా పల్లెల పట్ల తనలో కలిగించిన ఆసక్తివల్లనేమో!

కానీ నాన్న ఓపట్టాన ఒప్పుకునేట్టు కన్పించటంలేదు. అయినప్పటికీ తన నిర్ణయం మారదుగాక మారదు. ఒక్కసారి... ఒకసారంటే ఒక్కసారి తను.. పల్లెకు వెళ్లాల్సిందే... అక్కడి మనుషుల మధ్య ఆత్మీయ బంధాలనూ... వారి కళ్లలో ప్రతిఫలించే అమాయకతనూ... అనుభవించి తీరాల్సిందే.

ఆ డిటర్మినేషన్‌తోనే.. తనిక్కడ... ఇలా... మరి ఇదేమిటి? మనుషుల మధ్య ఆత్మీయత కాదుగదా... అసలు మనుషుల్ని మనుషులుగా చూసే మనసులే కనబడ్డంలేదు...ఇక్కడ సౌండ్ పొల్యూషన్, ఎయిర్ పొల్యూషన్ లేక పోవచ్చేమోగాని... కేస్ట్ పొల్యూషన్...

చూరు మీద ఉడిగిన తెల్లకోడి పుంజు నీలుగుతూ నిలబడి నిక్కిచూస్తూ 'కొక్కొరోక్కో' అంటుంటే నిద్రపట్టని చంద్ర ఆలోచనలు చెల్లాచెదురుగా ఆ తెల్లారగట్ల చీకట్లలో చిందిపడ్డాయ్.

ఆరుబయట నులక మంచంలో వెల్లికిలా పడుకుని తూర్పున వెలుగుతున్న వేగుచుక్క కేసి చూస్తోందామె.

ఇక్కడికొచ్చాక తెలిసింది... నాగరాజుగా తనకూ, తన ఫ్రెండ్స్ సర్కిల్‌కూ పరిచితుడైన తన పెదనాన్నను 'మాదిగ నాగడు' అని అంటారని, 'అన్నయ్యా' అని తను, 'వీరయ్యా' అని నాన్న ఆప్యాయంగా పిలిచే ఆయన కొడుకును ఊళ్లోవాళ్లంతా 'ఈరిగాడా' అని పిలుస్తుంటే ప్రపంచంలో ఎనిమిదో వింతను చూస్తున్నట్టే ఉంది తనకు. లక్ష్మీదేవి అనే పెద్దమ్మ పేరును వక్రీకరించి... కనీసం అది దేవత పేరనే గౌరవం కూడా లేకుండా 'ఒసే లచ్చాయ్... లచ్చీ' అనే వాళ్లను తనేం చెయ్యాలి? ఆడదాని పేరు పక్కన కనీసం 'అమ్మ' అని చేర్చాలన్న ఇంగితజ్ఞానం కూడా లేకుండా... తిరపతీ... అని తన వదిన జెండర్‌నే మార్చేసిన వాళ్ల మనసుల్లో స్వచ్ఛత కోసం... తనెక్కడని వెదుకుతుంది?

అంకడూ.. సిద్దడూ.. దుబ్బోడూ.. కుంటోడూ.. ఎర్రోడు.. కర్రోడులాంటి పేర్లు తప్ప.. మామూలుగా ఒక మనిషిని మరో మనిషి పిలిచే తీరే ఇక్కడ లేదు.

తన తండ్రి బాల్యం ఇక్కడేగా గడిచింది! "ఏమండీ.. వెంకటేశ్వర్రావుగారూ!" అని ఇప్పట్లో తమ ఊళ్లో పిలవబడే ఆయన్ని అప్పుడీ గ్రామ ప్రజలు...

'ఒరే ఎంకడా!' అని పిలుచుంటారా?

చంద్ర మంచం మీద లేచి కూర్చుంది. చల్లగాలి వీస్తున్నా ఎందుకో ఆ తెల్లవారు ఝామున ఆమెకు అసౌకర్యంగా ఉంది. రాత్రంతా నిద్రపోని కళ్లు ఎర్రగా పొడిపొడిగా ఇసకేసినట్లు మండుతున్నాయి. ఇంకా విడిపోని చీకట్లలోకి తదేకంగా చూ

స్తోందామె.

ఆ చీకట్లలోనే లేచి హడావుడిగా పనుల్లోకి వెళ్లడానికి ఆదరాబాదరాగా సిద్ధమవుతున్నారు వాడజనం.

పనీపాటా లేకపోయినా అందరితో పాటు లేచి కూర్చుంది. పక్క గుడిసెలో మారెవ్వ, గుడిసె ముందు నున్నగా అలికి ముగ్గుపెట్టిన మట్టి అరుగు మీద కూర్చుని వక్కపలుకు దంచుకుంటోంది పటుకూ పటుకూమని.

మారెవ్వ నిన్న సాయంత్రం ఓ కథ చెప్పింది. అందులో చండాలుడి కాళ్లమీద శంకరాచార్యుడు పడ్డాడట! ఆ పంచముడిలో ఆయన పరమాత్ముడ్ని దర్శించాడట! ఇది అందరిచేతా అంటరాని వాళ్లుగా చూడబడే ఈ మనుషులు ఆత్మతృప్తికోసం అల్లుకున్న కథా? లేక ఒంట్లో రక్తం బదులు మానవత్వం ప్రవహించే మనుషులు అనబడే మనుషులెవరో ఓ వర్గాన్ని ఓదార్చడానికి సృష్టించిన సంఘటనా? లేక నిజంగా జరిగిన యథార్థ గాథా?

"ఏమ్మా నిదరబట్టటంలే? " లక్ష్మీదేవమ్మ అడిగింది నడిమంచంలో నిటారుగా కూర్చుని ఉన్న చంద్రకళని. చూర్లో దోపిన చేంతాడును బయటకు లాగుతున్న పెదనాన్న అన్నాడు, "యాం బట్టుద్దీ నిద్దర? బిడ్డనాల్నాల్లుండి... మంచీ సెబ్బర జూసకపోదమనాస్తే ఈడ లేని పోని తకరాదలాయే!" క్రమక్రమంగా వ్యాపిస్తున్న సూర్యకాంతిలో వేగుచుక్క వెలిసిపోయింది.

చంద్రకళ మంచం మీంచి దిగి ముఖం కడిగి స్నానం చెయ్యడానికి జాలాడి వైపు వెళ్లబోతుంటే మారెవ్వ మనమడు పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు, చిరుగుల నిక్కరెగలాక్కుంటూ..."ఓ యక్కో... నీ కోసరం... ఎవులో వచ్చుండారు"

"ఏరి? " భృకుటి ముడిచి అడిగింది.

"అగో..." వేలుపెట్టి చూపించాడు.

పదిగజాల దూరంలో తమ ఇంటివేపే వస్తున్న ఇద్దరు యువకులు కనబడ్డారు.

అక్కడే నిలబడి వీరయ్య భార్య తిరపతమ్మతో "వదినా... వాళ్లొస్తే కూర్చోబెట్టు... స్నానం చేసొస్తా" అని చెప్పి జాలాల్లోకి దూరింది చంద్రకళ.

★ ★ ★

"తవరి నాయినగోరు మద్దినాచ్చేసి సద్ద బట్టి ఆడికది ఆయిపోయే. అట్టగిన గాకుంటే యవ్వారం శానాదూరం బొయ్యుండేది. మారాజు బగమంతుని మాదిరి వొచ్చి యాడదాడ కటాబిటీ జేసిండు" నాగరాజు అంటున్నాడు.

చక్రధర్... రాజూ... నాగరాజూ ఇంటి మెల్లాలో అంతకుముందు చంద్రకళ పడుకుని లేచి నులక మంచం మీద కూర్చుని ఉన్నారు.

ఆ ఉదయం నాలుగ్గంటలప్పుడు మెలకువొచ్చింది మేడమీద పడుకున్న రాజుకు. ఇక నిద్రపట్టనే లేదు. ఏమిటో ఆలోచనలు.

చాముండి రాత్రి మంచినీళ్లలో పంచదార కలపడం గుర్తొచ్చింది. "ఫన్నీగర్ల్" నవ్వుకున్నాడు. వెనువెంటనే 'చంద్ర' అనే పేరు మెదడులో కదలాడింది. ఎవరా అమ్మాయి? తన్నోసారి చూస్తే బాగుండును. అన్నట్లు ఈ రోజు కచ్చితంగా చక్రధర్‌ని ఇంట్లో తన విషయం చెప్పెయ్యమనాలి. అయినా గప్‌చిప్‌గా వెళ్లిపోయేదానికి చెప్పి గొడవ పడడమెందుకు? ఛ... చెప్పకపోతే అది మోసం కదా! ఆ చంద్ర ఎంత డేరింగ్! కనీసం ఓ ఆడపిల్లకున్న వ్యక్తిత్వం తనకు లేకపోతే ఎలా? చెప్పాలి? అవసరమైతే ఓ లెసన్ తీసుకోవాలి. అంతేగాని దొంగతనంగా ఇక్కడ గడపాల్సిన అవసరం తనకే

ముంది?

"ఏంట్రా, మేలుకొనివున్నావు? తెల్లారడానికి ఇంకా అరగంట టైముంది. పడుకో" అన్నాడు ఐదున్నర ప్రాంతంలో మెలుకువ వచ్చిన చక్రధర్.

"నిద్రపట్టడం లేదురా" రాజు లేచి కూర్చున్నాడు. చక్రధర్ తనూ లేచి కూర్చుని ఓసారి ఆవులించి ఒళ్లు విరుచుకున్నాడు.

"అలా వాకింగ్‌కు వెళదామా? " రాజే అడిగాడు.

"సరే పద"

ఇద్దరూ కలిసి చేల గట్లమీద నడుస్తుంటే... చిరు చీకట్లను చీల్చుకుంటూ... చలిగాలుల్ని వెచ్చబెడుతూ... పరుచుకుంటున్న సూర్యకిరణాల వెలుగులో కనబడింది నిశ్శబ్దంగా నిశ్వసిస్తున్న ఓ కాలిబాట, ఎడంచేతి పక్క. దాన్ని క్రాస్ చేసి ముందుకు వెళుతున్నప్పుడు అన్నాడు చక్రధర్ అసంకల్పితంగా "ఇదుగో... ఈ బాటంట ఓ కిలో మీటర్ వెళితే వస్తుంది హరిజనవాడ"

"నిన్న నువ్వు చెప్పిన చంద్ర అనే అమ్మాయి అక్కడేనా ఉండేది? "

"ఆc ఏం? "

చక్రధర్ ప్రశ్నకు రాజు వెంటనే సమాధానం చెప్పలేదుగాని నడవటం ఆపి నిలబడ్డాడు. కాసేపు ఆలోచిస్తున్నట్టుగా ఉండిపోయి అన్నాడు "రేయ్ చెక్రీ, నాకా అమ్మాయిని ఓసారి చూడాలనుందిరా"

"ఓర్నీ దుంపదెంచ... దానికింత ఆలోచనెందుకు కమాన్... లెటజ్ గో" నవ్వుతూ ఆ కాలిబాటవైపు అడుగులు వేశాడు చక్రధర్.

పొలాల మీంచి తేలివచ్చే పైరగాలి ఒంటిని హాయిగా తడుముతున్నా రాజు మనసు మాత్రం సెగలు పొగలుగా వుంది.

'అన్‌టచబిలిటీ ఈజ్ ఎ క్రైమ్' పిల్లల పాఠ్యగ్రంథాల మీద ముద్రితమైవుండే వాక్యం గుర్తుకొచ్చింది రాజుకు. అంటే... ఈ దళితుల్ని... ఊరికి దూరంగా ఉంచిన... అగ్రవర్ణాల వారంతా నేరస్థులా? ఆ నేరస్థుల్ని ఎవరు శిక్షిస్తారు? దేవుడా? అయినా ఇన్ని కులాల్ని దేవుడు మాత్రం ఎందుకని సృష్టించాలి? అన్నట్టు దేవుడు మొట్టమొదటిగా సృష్టించింది ఒకే ఒక మానవుడ్ని అని కదూ అందరూ అంటారు. కులానికొక మనిషి చొప్పున దేవుడు తయారుచేసినట్టు ఇంతవరకూ ఏ పండితులూ చెప్పినట్టు లేదే! చెప్పినట్టు లేదే అని మళ్ళీ సందేహమెందుకు? చెప్పనేలేదు. తొలిమానవుడు ఒక్కడే ఒక్కడు. అప్పుడతనికి కులంలేదు... మతంలేదు. అసలు పాపం దేవుడికి కూడా వాటి గురించి తెలీనే తెలీదేమో! పంచభూతాల్లోంచి ఆవిర్భవించిన ఆ తొట్టతొలి మానవుడు... తనలోని ఓ భాగాన్ని దేవుడు వేరుచేసి తన కోసం ఓ సహచరిని సృజియిస్తే... ఆమెతో సగాన్ని పంచుకుని కదూ ఈ జనాన్ని తన సంతతితో నింపాడు. మరి ఈ మానవాళి మొత్తం... ఆ ఆదిదంపతుల సంతాన క్రమమైనప్పుడు ఈ తేడాలెందుకు?

నడుస్తున్న చక్రధర్ ఒక్కక్షణం ఆగాడు. అతను ఆగిన చోటినుండి ఆ కాలిబాట రెండుగా చీలింది.

"ఇటు వెళితే... మాలవాడ... అటు మాదిగవాడ" చెప్పాడు..

"ఆ అమ్మాయుండేది..? " రాజు అర్థోక్తిలో ఆగాడు.

"మాదిగవాడలో... ఇటు" చక్రధర్ కుడివైపు చూపిస్తూ అటు నడవటం మొదలుపెట్టాడు. రాజు అతన్ని అనుసరించాడు. కాస్త దూరం వెళ్లాక నలుగురైదుగురు మనుషులు... సత్తు టిఫినీలు పట్టు

కుని కూలికెళుతున్నారేమో... ఎదురయ్యారు. చక్రధర్‌ని చూడగానే టిఫినీలు కిందపెట్టి చేతులెత్తి నమస్కరించి వినయంగా పక్కకు తొలిగి నిలబడ్డారు.

వీళ్లు ఆ గుంపును దాటి ముందుకు పోగానే... వాళ్ళు మళ్ళీ టిఫినీలు అందుకుని సాగిపోయారు. వాళ్లేకాదు... మాది గవాడ దగ్గరయ్యేలోపు ఆడ మగా కూలీలు చాలామందే ఎదురయ్యారు. చక్రధర్‌ని చూడగానే వినయ విధేయతలతో నమస్కరించడం, దారి తొలిగి నిలబడ్డం లాంటి తంతు ప్రతి ఒక్కరూ చేశారు.

ఈ నేపథ్యంలో రాజు గమనించింది ఒక్కటే... వాళ్ల నమస్కారాలూ... చక్రధర్ స్వీకారాలూ. అంతవరకూ బాగానే వుందిగాని వాళ్లని చక్రధర్ పలకరించిన తీరు రాజుకు నచ్చలేదు.

"ఏరా... కిష్టడా... మొన్న మా చేలోకి రమ్మని పిలవనంపితే రాకుండా పెద్దరెడ్డి చేలోకి పోయావంటగా. నీకు కొమ్ములొచ్చినయ్ రేయ్"

"ఒరే ఓబా... నాన్నగారు నిన్నోసారి కలవమని చెప్పారు. ఇంటికెళ్లి కనబడరా"

ఆ ఇద్దరి వయసూ.. దాదాపు చక్రధర్ తండ్రి వయసంత వుంటుంది. మరి ఆ 'ఓబ' అనిపించుకున్న వ్యక్తి వయసు తండ్రి కూడా కాదు.. దాదాపు తాతంత వుంటుంది. అంతంత పెద్దవాళ్లను పట్టుకుని చక్రధర్ 'కిష్టడా.. ఓబా..' అని సంబోధించడం.. ఏమిటోగా అన్పించింది రాజుకు. ఆ ఊర్లోని మరే రైతైనా అలా పిలిస్తే అంత ఎబ్బెట్టుగా ఉండేది కాదేమోగాని.. పోస్టు గ్రాడ్యుయేషన్‌వరకు చదివిన చక్రధర్ అలా పిలుస్తుంటే మాత్రం ఎందుకో అనాగరికంగా తోచింది.

చక్రధర్‌ది యజమాని హోదా... వాళ్లది సేవక స్థానం కాబట్టి... అతడికంటే వాళ్ల వయసు పెద్దదనీ.. గారూ గీరూ అని మన్నించి పిలవమని కాదు... మరీ తానేం యుటోపియాలో జీవిస్తూ విచిత్ర వాదం చెయ్యదలచుకోలేదు. కానీ కనీసం 'కిష్టయ్యా.. ఓబయ్యా' అని వారి వారి

## డజన్ పైగా నవలలు చతురలోనే!



కోలపల్లి ఈశ్వర్

యాభైరెండేళ్లుగా ఉంటున్నది నెల్లూరు, నవాబ్‌పేటలోనే. రాయటం, చదవటం, పసిపిల్లలతో ఆడుకోవటం ఇష్టం. ఇంటర్ చదువుతున్నప్పటి నుంచే రచనా వ్యాసంగం మొదలైంది. ఇప్పటివరకూ వివిధ పత్రికల్లో నేను రాసిన కథల సంఖ్య పదకొండు వందలు దాటింది. 1989 ఆగస్టు 'చతుర'లో నా మొదటి నవల 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే' అచ్చయింది. మళ్లీ 2009 ఆగస్టులో నా 'వేగుచుక్క' చతురలోనే ప్రచురితం కావడం సంతోషదాయకం. ఈ రెండు దశాబ్దాలలో డజనుకు పైగా నవలలు 'చతుర'లో రావడం గర్వకారణం. ఆ విధంగా 'చతుర' రచనాపరంగా నాకు పుట్టిల్లు లాంటిది. దేవాలయంలాంటిది. గ్రామీణ సమాజంలోని కులాల అంతరాలపై రాసిన ఈ నవల తప్పకుండా పాఠకులకు నచ్చుతుందని ఆశిస్తున్నాను. నన్ను ప్రోత్సహిస్తున్న చతుర సంపాదకులకు కృతజ్ఞతలు.

చిరునామా :
డోర్ నెం. 3-1-85,
నవాబుపేట, నెల్లూరు-524002

పేర్లతో వాళ్లని పిలిచినంత మాత్రాన యజమాని హుందాతనం తరిగేదేం లేదు. పైగా పెరుగుతుంది కూడా. పేర్లను సైతం వక్రీకరించి 'గాళ్లూ', 'గీళ్లు' అనే పదాలు తగిలించి ఎదుటిమనిషిని కించపరటంలో మనిషి పొందే పైశాచికానందమేమిటో రాజుకు అంతుబట్టటం లేదు. మామిడి తోపులో మంగ చేతి మంచి నీళ్లు తాగి మనుషులంతా ఒక్కటే అంటూ లెక్చరిచ్చిన నిన్నటి చక్రధర్‌కు.. కిష్టుడా, ఓబుడా అంటూ తోటి మనుషుల్ని అవమానకరంగా పిలిచే నేటి చక్రధర్‌కూ తేడా ఎక్కడో అర్థంకాక అయోమయంగా అతడి కేసి చూశాడు.

"ఏమిట్రా.. అలా చూస్తున్నావు? " రాజు చూపు నిగూఢంగా ఉన్నట్టనిపించి అడిగాడు చక్రధర్.

"ఏం లేదు" పొడిగా అన్నాడు రాజు.

"నో, సమ్‌థింగ్ ఈజ్ దేర్" వదల్లేదు చక్రధర్.

"చెప్పనా? "

"చెప్పవోయ్"

"చెబితే ఏమనుకోవుగా"

"కోను"

"నువ్వు.. ఆ ముసలాళ్లని కిష్టడా... ఓబుడా..అనడం నాకు నచ్చలేదు చక్రీ.."

చక్రధర్ జవాబివ్వలేదు గాని రాజుకేసి క్షణంలో సగంసేపు డీప్‌గా చూశాడు. చూసి నిశ్శబ్దంగా తలదించుకుని మునుపటికన్నా వేగం పెంచి నడవసాగాడు.

"తను అలా అడక్కుండా ఉండాల్సింది. బాధపడ్డాడేమో!" రాజు నొచ్చుకున్నాడు మనసులో. తనూ ఇంకేం మాట్లాడకుండా మౌనంగా నడవసాగాడు.

కొక్కొక్కొకో / అని కోళ్ల అరుపులూ... మేకల అరుపులూ వినబడగానే రాజుకు అర్థమైంది వాడలోకొచ్చేశామని.

వాడలోని పిల్లలు అటు ఇటూవరుసగా ఉన్న గుడిసెల మధ్య కోళ్ల వెనుకా, కుక్కల వెనుకా పరుగెత్తుతూ ఆటలాడుతున్నారు. ఎవరికీ ఒంటిమీద చొక్కాల్లేవు. కొందరు చిరిగిపోయిన లాగూలూ ఎగలాక్కుంటున్నారు. కొందరికి అవికూడా లేవు. కాని అందరి ఒంటిమీద మాత్రం అరంగుళం మేర పేరుకుని ఉంది మట్టి. ముఖంనిండా మురికి మరకలు.. చింపిరి తలలు.. పైన వాలుతున్న ఈగలు..

ఒక్కక్షణం ఒళ్లు జలదరించింది రాజుకు. అక్కడే తచ్చాడుతున్న ఓ గజ్జి కుక్క మీదకు రాళ్లు విసురుతున్న ఓ కుర్రాడ్ని పిలిచి అడిగాడు చక్రధర్ "మీ తాత ఇంట్లో ఉన్నాడా? "

వాడు తల నిలువుగా ఊపాడు ఉన్నాడన్నట్టు. "మీ ఇంటికొస్తున్నామని చెప్పు, పో" వాడు తూనీగలా దౌడు తీశాడు. ఆ సందుకు ఎడం పక్కగా ఉన్న మరో సందులోకి.

ఆ సందుల్లోంచి వస్తున్న ఓ రకమైన వెగటు వాసన భరించలేక కర్చీఫ్ ముక్కుకు అడ్డంగా పెట్టుకున్నాడు రాజు. వాడలో అడుగు పెట్టగానే చక్రధర్ ఆ పని చేసినప్పుడు ముఖం చిట్లించి అతని కేసి చూశాడు గాని నాలుగడుగులు వేశాగ్గాని అర్థంకాలేదు రాజుకు.. కర్చీఫ్ ముక్కుకు అడ్డం పెట్టుకోవడం అన్నది అక్కడ ఎంత అవసరమైన చర్యో.

సందు చివరిదాకా వెళ్లకుండానే.. అన్నిట్లోకి ఆఖరిగా ఉన్న గుడిసెలోంచి బయటికొస్తూ కనబడ్డాడు నాగరాజు. ఆదరాబాదరాగా చక్రధర్‌కి ఎదురొచ్చి చేతులెత్తి దండం పెట్టాడు. వెంటనే అన్నాడు చక్రధర్ "పెద్దవాడివి... నువ్వేంటి నాగయ్యా నాకు నమస్కరించేది!" ఆ మాటలంటూ రాజుకేసి క్రీగంట చూశాడు.

నాగరాజు చప్పున గుండెలు బాదుకున్నాడు. "ఎంత మాటన్నావ్ బాబయ్యా..

తవరి ముంది నానెప్పుడూ దండం బెడతా సామెః "

ఆ మాటలని అతి వినయంగా చేతులు కట్టుకుని ముందుకు దారి తీశాడు. అతని వెనకాలే నడుస్తూ వెళ్లి.. గుడిసె చుట్టూ ఉన్న దడిని దాటి మెల్లాలో అడుగుపెట్టారు. అక్కడున్న ఇళ్లన్నిటిలోకి అది కాస్త శుభ్రంగా ఉంది. ఊడ్చి పేడనీళ్లు చల్లి ఉంది మెల్లా అంతా.

నాగరాజు వాళ్లకి నులకమంచం చూపించి ఓ పక్క ఒదిగి నిలబడ్డాడు.

"నువ్వా కూర్చో నాగయ్యా" చక్రధర్ కాస్త జరిగి స్థలం చూపించాడు తన పక్కనే.

ప్రపంచంలో ఎనిమిదో వింతను చూస్తున్నట్టు చూశాడు చక్రధర్‌కేసి నాగరాజు.

"మా బోంట్లు తవరి సరసన కూసోడవే... యాంది సామె పరాశికాలుః " సిగ్గుగా నవ్వాడు.

"నీ ఇంట్లో నువ్వు నిలబడ్డంయేంటిః ఫరవాలేదు కూర్చో" మళ్లీ చెప్పాడు.

నాగరాజు అతని మాటలు పెడచెవిన బెడుతున్నట్టు నిలుచున్నచోటనే నేలమీద చతికిలబడ్డాడు.

నాగరాజు భార్య లక్ష్మీదేవి బయటకొచ్చి "దండాలు సామె" అంది. అత్తవెనకే తిరపతమ్మ కూడా బయటకొచ్చి దండం పెట్టి లోనకెళ్లిపోయింది. వీరయ్య మాత్రం కనబడలేదు.

"సేలోకి కూలికి రావల్నాః " అడిగాడు చేతులు నులుముకుంటూ నాగరాజు.

"అదేంకాదుగాని... పట్నం నుంచొచ్చిందే... మీ తమ్ముడి కూతురు.. ఆమెతో ఓ మాట మాట్లాడదామని!" ఆగాడు.

"సెంద్రకలమ్మని బిలవ్వే.. బాబేందో యవ్వారం సెబుతాడంట" సంభ్రమంగా చెప్పాడు భార్యతో.

లక్ష్మీదేవి లోపలికెళ్లింది. అప్పటికే స్నానం ముగించి డ్రెస్ చేసుకుంది చంద్రకళ. ఓసారి అద్దంలో ముఖం చూసుకుని... భుజం మీద చున్నీ సవరించుకుని గడపదాటి బయటికొచ్చింది.

సరిగ్గా ఆమె బయటికొస్తున్నప్పుడు... నాగరాజు అంటున్నాడామాట. "తవరి నాయినగోరు మద్దినాచ్చీసి సద్దబట్టి ఆడికది అయిపాయె. అట్టగిన గాకుంటే యవ్వారం శానాదూరం బొయ్యిండెడిది. మారాజు భగవంతుని మాదిరి వొచ్చి యాడదాడ కటాబిటీ జేసినాడు"

నాగరాజుకేసి అసహనంగా చూసింది చంద్రకళ. ఆమెను చూడగానే... నమస్తే అంటూ విష్ చేశారు రాజూ, చక్రధర్‌లు. ప్రతి నమస్కారం చేసింది చంద్రకళ.

ఆ దృశ్యాన్ని చూస్తున్న నాగరాజు ఛాతీ గర్వంగా పొంగింది. తమ వాడకొచ్చి తన బిడ్డకు నమస్కారం చేసేవాళ్లు ఊళ్లోని అగ్రకులస్థుల్లో ఉంటారన్నది అతనికి ఊహాతీతమైన విషయం.

లక్ష్మీదేవమ్మ చూరుకింద గోడవారగా ఎత్తి పెట్టిన మరో నులక మంచాన్ని తెచ్చి చంద్రకళ నిలుచున్నచోట వాల్చింది.

"పెదనాన్నా లే.. లేచి ఇలా కూర్చో" చంద్రకళ కింద కూర్చుని నాగరాజుతో చెప్పింది.

నాగరాజు ఓసారి చక్రధర్‌కేసి చూసి లేచే ప్రయత్నం కూడా చెయ్యకుండా కిమ్మనకుండా ఉండిపోయాడు.

"నాగయ్యా.. ఇది నీ ఇల్లు. లేచి అలా

## కొత్తగాలి...

**కనిపించే మనిషికి**
**సాయం చెయ్**
**కనిపించని దేవుడు**
**నీకు న్యాయం చేస్తాడు**

*- లోగిశ లక్ష్మినాయుడు, సింహాచలం*

కూర్చో" చక్రధర్ చెప్పాడు.

"ఊరుకో సామె... మా తాత్తరం కాడ్నించి తవరి ఇండ్ల కొలువు జేసేటోల్లం. తవరి ముంగల కాలుమీన కాలేసి మంచం మీన కూసోడమే? "

"కాలిమీద కాలు వేసుకో కుండా కూర్చో పెద నాన్నా" కోపంగా చెప్పింది చంద్రకళ.

రాజుకు నవ్వు రాబో యింది గాని కష్టంమీద ఆపుకున్నాడు. మరోసారి చక్రధర్ చెప్పినా నాగ రాజు వినలేదు. పైగా లేచి "ఉప్పుడ్నే వస్తా... తవరు యవారం సేస్కోవుం దండ్రి" అనేసి అక్కడ్నించి బయటికి జారుకున్నాడు. అతను వెళ్లిన వైపే క్షణంలో సగం సేపు సాలోచనగా చూసి వెంటనే అటు తిరిగింది చంద్రకళ.



"చెప్పండి" అంది వాళ్లిద్దరికేసి చూస్తూ.

అప్పుడు చూశాడు రాజు నిశితంగా ఆమెను. డార్క్‌బ్రౌన్ చుడీదార్... లేత గులాబిరంగు దుపట్టా... పట్టుదలను సూచిస్తూ వంపు తిరిగిన దట్టమైన కనుబొ మలు.. చురుగ్గా కదిలే కళ్లు.. ముఖంలో ఏదో వింత ఆకర్షణ.. బహుశా అది మొండితనమేమో!

"నేను పరమేశ్వరశాస్త్రిగారి కొడుకుని... నా పేరు చక్రధర్. ఇతను నా బెస్ట్‌ఫ్రెండ్ రాజు"

'ఏదో ఇందిరాగాంధీ కొడుకుని అన్నట్టు పరమేశ్వరశాస్త్రి కొడుకుని అంటే ఎలా?' మనసులో అనుకుని పైకి మాత్రం "పరమే శ్వరశాస్త్రిగారా? " అంటూ ఆయనెవరన్నట్టు భృకుటి ముడిచింది.

"అదేనండీ... నిన్న ఊళ్లో నీళ్ల దగ్గర గొడవ జరిగినప్పుడు..." అతని మాటలు పూర్తికాకుండానే అడ్డుకుందామె. "ఊళ్లో అంటున్నారు... అది మాత్రమే ఊరా... ఈ వాడ ఊళ్లో భాగం కాదా? "

ఆమె లాజిక్ అర్థమైంది చక్రధర్‌కి. అందుకే వెంటనే "సారీ.. నా ఉద్దేశం అది కాదండీ.." అన్నాడు.

చంద్రకళ సమాధానపడ్డట్టు చూసి అంది "ఇట్సాల్ రైట్.. చెప్పండి" అని మళ్లీ. అంతలోనే తనే మాట్లాడుతూ

## కొత్తగాలి...

**నేషన్‌కంటే**
**డొనేషన్ గ్రేటు**
**అంటుంది..**
**కార్పొరేటు రేటు**

–గరిమెళ్ల నాగేశ్వరరావు,
కొమ్మాది, విశాఖ జిల్లా

"అన్నట్టు... పరమేశ్వరశాస్త్రిగారంటే... నిన్న నేను ఊళ్లో... అదే మీ భాషలో 'ఊళ్లో' నీళ్లు పట్టుకున్నానని ఊరిపెద్దలందరూ కారాలు మిరియాలు నూరుతుంటే... అదేదో జలశుద్ధి కార్యక్రమం చేయిస్తానని వాళ్లని శాంతింపజేశారే.. ఆయనేనా? "

"ఆ... ఆయనేనండీ" తన ఐడెంటిటీని ఆమె ఈజీగా కనుక్కున్నందుకు సంతోషిస్తూ అన్నాడు చక్రధర్.

"జలశుద్ధి కార్యక్రమం అంటే... వాటర్ ప్యూరిఫికేషన్ కదండీ? ఐ మీన్ నేను తాకిన ఆ బావి నీళ్లలో పొటాషియం పర్మాంగనేట్... క్లోరిన్‌లాంటి వేమన్నా కలుపుతారా మీ నాన్నగారు? "

చక్రధర్ ఏం మాట్లాడలేదు మౌనంగా ఆమెకేసి చూశాడు.

"ఫర్ యువర్ కైండ్ ఇన్‌ఫర్మేషన్..." ఆమె కాస్సేపు ఆపి చెప్పింది, "నాకు కుష్టూ... క్షయా.. ఎయిడ్స్ లాంటి అంటు వ్యాధులేమీ లేవే. ఐయామ్ పర్‌ఫెక్ట్‌లీ ఆల్‌రైట్. కనుక నా శరీరం నుంచి బాక్టీరియా, వైరస్‌ల్లాంటి రోగక్రిములు ఆ బావి నీటిలోకి వ్యాపించి ఉండవు. మీకు నమ్మకం లేకపోతే డాక్టర్ సర్టిఫికెట్ సబ్మిట్ చెయ్యమన్నా.. నేను రెడీ. సో... నే చెప్పొచ్చేదేమంటే మీ నాన్నగారికి జలశుద్ధి చేయాల్సిన అవసరం ఎంత మాత్రం లేదని నా మాటగా చెప్పండి"

ఆమె వ్యంగ్య భాష వెనుక దాగున్న వేదన బాగానే అర్థమైంది చక్రధర్‌కి. అందుకే సూటిగా చూడలేక తలదించుకున్నాడు. రాజు ఆమె వంక తదేకంగా చూస్తున్నాడు. కాసేపు మౌనం తరువాత పెదవి విప్పిందామె "సారీ... అసలు మీరొచ్చిన పనేమిటో అడక్కుండా నేనేమిటేమిటో వాగేస్తున్నా"

చక్రధర్, రాజూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. వచ్చిన పని ఏమిటని చెప్పాలో తోచలేదు ఇద్దరికీ. చంద్ర అనే అమ్మాయిని చూద్దాం అంటే చూద్దాం అనుకుని వచ్చారక్కడికి. అయినా... మిమ్మల్ని చూడ్డానికి వచ్చామండీ అని చెప్పటం... పెద్ద బాగున్నట్టు అన్పించలేదు. 'మరింకేం చెప్పాలా' అని ఆలోచిస్తున్న రాజుకు గుడిసె లోపల లక్ష్మిదేవమ్మ "ఈరయ్యా... నాయినా ఈరయ్యా... శాస్తుర్లు గారబ్బాయొచ్చిండు. ఒక్కపాలి లేసి... మొగం జూపిచ్చు.. మల్లేమన్న అనుకుంట్రు" అనడం వినిపించింది. వెంటనే ఏం చెప్పాలో స్థిరమైంది అతనికి. "వాళ్లెవరో ఇక్కడకొచ్చి మీ అన్నయ్యను కొట్టార్టకదా! చూసెల్దామని వచ్చాం" చెప్పాడు రాజు.

ఏం చెప్పాలా అనుకుంటున్న చక్రధర్ ముఖం తేటపడింది.

మాటల్లోనే బయటికి వచ్చాడు వీరయ్య. వస్తూనే నీరసంగా చేతులెత్తి నమస్కరించాడు.

"ఏం వీరయ్యా... పిచ్చిరాజు మనుషులు.." చక్రధర్ అంటుండగానే వీరయ్య కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి.

"నేనేమన్లే సామీ..మా సెల్లాయ్ పట్నం పిల్ల. ఈడ పద్దవతులు దేలీవూ... దాన్నో మాట అనబాకండ అన్నె... యాందిరా నువ్వు మాకు సెప్పేదని... ఈపు సిట్లగొట్టింద్రు.. సూడుండ్రి" వీరయ్య వెనక్కి

తిరిగాడు.

ఆచ్ఛాదన లేని అతని వీపుమీద దెబ్బలు స్పష్టంగా కనబడ్డాయ్. బెల్ట్ తోనో... కొరడాతోనో కొట్టారులా వుంది. గాయాలు పొడవుగా ఇంతలావున ఉబ్బి రక్తం ఓడుతున్నాయ్.

రాజు కళ్లు ఆశ్చర్యంతో విప్పుకున్నాయ్. అతనింత వరకూ ఇలాంటి సంఘటనలు గురించి విని వున్నాడు. మహా అయితే... విలేజ్ బ్యాక్ డ్రాప్‌గా తీసిన సినిమాల్లో చూశాడు. కానీ ఇప్పుడు ప్రత్యక్షంగా ఆ దృశ్యాన్ని చూస్తున్నాడు.

వీరయ్యను ఓదార్చడమెలాగో తెలీక అతనికేసి కళ్లప్పగించి చూస్తున్న చక్రధర్‌తో అంది చంద్రకళ "అవి ఒక మనిషి మరో మనిషిని కొట్టినపుడు తేలిన వాతలు కావు. జాత్యహంకారపు కొరడా ఝళిపింపు దళితుల జీవితం మీద రాల్చిన అగ్నికణికలు. అసహాయులైతే ఆ మంటలకు ఆహుతి అవుతారేమోగాని.. ఆత్మగౌరవం వున్న నాలాంటి మనుషులైతే మాత్రం ఒక్కసారిగా జ్వలించి అవతలి వారి అహాన్ని కాల్చి బూడిద చేస్తారు."

రాజు అప్రయత్నంగా అడిగాడు "మీకు జరిగిన అవమానానికి... మీరు వాళ్లని ఏ విధంగా ఎదుర్కోబోతున్నారు? "

మండుతున్న కొలిమిలా ఉన్న ఆమె హృదయం మీద ఎవరో చప్పున నీళ్లు చిలకరించినట్టయింది. అతనికేసి అయోమయంగా చూసింది. ఇన్‌సల్ట్ జరిగిందని ఇరిటేట్ అవుతూ పవర్‌ఫుల్‌గా మాట్లాడుతోందిగాని... దాన్నెలా తిప్పికొట్టాలా అన్న విషయాన్ని ఇంతవరకూ ఆలోచించలేదామె. అదీగాక ఈ గొడవ జరిగిన దగ్గర్నుండీ నాగరాజు కుటుంబ సభ్యులు చంద్రకళని "ఇసుమంటసోట నువ్విమడలేవు. ఎలిపో తల్లీ. దేవళంలో అమ్మోరి మల్లె సూసుకుంటున్నడు మీ అయ్య నిన్ను. ఈ కంపల్లో కట్టెల్లో నువ్వుండదగవ్. ఎల్లిపోనాయమ్మ" అంటూ బయలదేరదీస్తుంటే.. అసలామెకు కర్తవ్యమే తోచలేదు.

"ఇంకా నేనా విషయం గురించి ఆలోచించలేదు" అంది ఆవేశమంతా అణిగిపోగా.

ఆమెలో అణగారిన ఆవేశం రాజులో పొంగింది.

"భలేవాళ్లే మీరు. అంత అవమానం చేస్తే వూరుకున్నారా మీరు. నో యు మస్ట్ టీచ్ దెమ్ ఎ లెసన్"

ఆమెకేదో మోరల్ సపోర్ట్ దొరికినట్టనిపించింది. మెరిసేకళ్లతో రాజుకేసి చూసింది.

చక్రధర్ ఆ ఇద్దర్నీ ఒక్కక్షణం మార్చి మార్చి చూశాడు. చూశాక చప్పున లేచి నిలబడి..."వస్తామండీ... మరోసారి కలుస్తాం" అన్నాడు.

అతనంత అర్థాంతరంగా ఎందుకు లేచి నిలబడ్డాడో అర్థంకాని రాజు... విధిలేనట్టు తనూ లేచాడు.

వాడదాటి.. పొలాల మధ్య నడుస్తున్నప్పుడు అంతవరకూ ఇద్దరిమధ్యా రాజ్యమేలిన నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నాడు చక్రధర్ "దారే పోయే తద్దినం మనకెందుకురా? ఆమెనెందుకలా రెచ్చగొడుతున్నావ్" తరతరాలుగా కరడుగట్టిపోయిన సంప్రదాయాల్ని... ఆచారాల్ని... నువ్వూ ఆమే కాదు... ఇంకో వందమంది కలిసినా ఏం చెయ్యలేరు.. అనవసర ప్రయాస తప్ప".

"అలాగని.." రాజు కోపంగా ఏదో అనబోయాడు.

"ఆగు నన్ను చెప్పనీ... గ్రామాల్లో తగాదాలు వాళ్లు వీళ్లని అవమానించడం.. వీళ్లు వాళ్లకి బుద్ధి చెప్పడంతో సమసిపోవు. ఇంకా పెద్దవవుతాయ్. ప్రచండమై ఒకళ్లనొకళ్లు నరుక్కు చచ్చే స్థితి కూడా

వస్తుంది కాబట్టి.."

"అన్యాయం జరుగుతున్నా... నోరు మూసుకునే..."

"ఉండమంటున్నా.. మీకీ గొడవలెందుకు చెప్పు. ఇది మీ వూరు కాదు... వీళ్లు మీ మనుషులు కారు. నాల్రోజులుంటారు... ఆనక... వెళ్లిపోతారు. మీకక్కడ ఇలాంటి ఇబ్బందులేం ఉండవ్. మంచి ఉద్యోగాల్లో స్థిరపడి హాయిగా కాలిమీద కాలేసుక్కూర్చుని బతకాల్సిన వాళ్లు. ఆమె నువ్వు కూడా.. సో.. వున్నన్నాళ్లూ ఈ పల్లె ప్రకృతిని ఎంజాయ్ చేసి... గప్ చుప్‌గా వెళ్లిపొండి. నీ శ్రేయోభిలాషిగా ఇది నా సలహా."

"ఎంత బాగా చెప్పావ్‌రా" రాజు లోతుగా చూశాడు చక్రధర్ కళ్లలోకి నడవటం ఆపి. "ఇది నా ఊరు కాదు కాబట్టి... ఎదుటి మనిషి ప్రాణంపోతున్నా పట్టించుకోవద్దంటావ్... ఇక్కడివాళ్లు నా మనుషులు కాదు కాబట్టి... అజ్ఞానంతో కొట్టుకుపోతున్నా కిమ్మనకుండా వూరుకోమంటావ్. అంతేగా నువ్ చెప్పేది? "

"అహా...ఊరుకోవద్దు... ఏ వీరేశలింగం లాగానో ఈ సమాజాన్ని ఉద్ధరించు" చక్రధర్ కోపంగా అని మళ్లీ తనే అన్నాడు బాధగా. "ఒరేయ్ రాజూ! ఆ కాలం మనుషుల్లో మంచితనం అనేది వుండబట్టి... వాళ్లను మార్చడం అన్నది... అప్పటి సోషల్ రిఫార్మర్స్‌కి సాధ్యపడింది. ఇప్పటి వాళ్ళలో ఆ మంచితనం మచ్చుకైనా లేదురా. నువ్వూ నేనూ... ఈనాటి సమాజంలో ఏ మార్పూ తేలేం"

"పలాయన మంత్రం పఠిస్తున్నావా? " రాజు అడిగాడు.

"పఠించక తప్పని పరిస్థితుల్రా ఇవి"

"లేదు చెక్రీ... పరిస్థితులూ, సమస్యలూ అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఒకటే. కాకపోతే పరిస్థితుల్ని ఎదుర్కొని సమస్యల్ని పరిష్కరించే త్యాగమూర్తులు ఆనాడు వున్నారు... ఈనాడు అలాంటి వారు చాలా తక్కువ. అంతే తేడా. ఎటు చూసినా నాకెందుకులే అన్న స్వార్థం. మనం ఏమైపోతామో అన్న భయం.

ఆ స్వార్థాన్నీ భయాన్నీ జయించి ఏ ఒక్కడైనా ముందడుగు వేస్తే... ప్రతి సమస్యకూ కచ్చితంగా పరిష్కారం దొరుకుతుంది. ఆశించిన ఫలితం కన్పిస్తుంది"

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. దార్లో వేపచెట్టు తగిల్తే... చక్రధర్ దాని కొమ్మలోంచి రెండు పుల్లలు విరిచాడు. ఒకటి రాజు కిచ్చాడు. ఇద్దరూ పుల్లల కొసలు నమిలి.. నడుస్తూనే పళ్లు తోమారు. రంగారెడ్డి జొన్న చేలో.... మోటారొదలి ఉన్నారు. నీళ్లు బోదెలోంచి గలగల పారుతున్నయ్. అక్కడాగి ఇద్దరూ ముఖాలు కడిగారు.

ఇంకాస్త దూరం నడిచాక పొలాలు అంతమై వూరు మొదలైంది. చలపతి టీ కొట్టు దగ్గర చెక్కబెంచీల మీద కూర్చుని జనాలు టీ తాగుతున్నారు. కొందరు మాత్రం ఓ వారగా నిలబడి తాగుతున్నారు.

"టీ తాగుదామా? " అడిగాడు చక్రధర్.

"ఆc..."

ఇద్దరూ వెళ్లి... ఖాళీగా వున్న బెంచీ మీద కూర్చున్నారు.

చలపతి రెండు గ్లాసుల్లో టీ తిరగ్గొట్టి చెరోటి అందించాడు.

రాజు తాగుతూ... తనకెదురుగా అల్లంత దూరంలో నిలబడి టీ తాగుతున్న ఇద్దరి మనుషులకేసి చూశాడు. వాళ్లు టీ తాగి అక్కడే బక్కెట్లో వున్న నీళ్లలో గ్లాసులు కడిగి... టీ కొట్టు గోడమీద వారగా వాటిని బోర్లించి వెళ్లిపోయారు.

రాజు టీ తాగడం ముగించి అడిగాడు "గ్లాస్ కడగాలా చెక్రీ."

"ఎందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు చక్రధర్.

"వాళ్లు కడిగారే మరి? " ఇంతకుముందు ఆ ఇద్దరు మనుషులు టీ తాగి గ్లాసులు కడగడం గుర్తుకు తెచ్చుకుని అడిగాడు అయోమయంగా.

"అదా!" రాజుకేసి చూసి చెప్పాలా వద్దా అన్నట్టు ఒక్క క్షణం తటాపటాయించి చెప్పాడు.

"వాళ్లు వాడజనం రాజూ. వాళ్ల గ్లాసులు వేరే వుంటాయ్. అవి చలపతి కూడా కడగడన్నమాట. వాళ్లే కడిగి అక్కడ బోర్లించుకుని వెళ్లాలి."

ఇద్దరూ టీ కొట్టు దగ్గర్నించి లేచి మళ్లీ నడవడం మొదలెట్టారు. పది గజాలు నడిచాక రాజు అన్నాడు "రేయ్ చెక్రీ... మీ వూరి న్యాయం ప్రకారమైతే నేనూ ఆ వాడ జనంతో పాటు నిలబడి టీ తాగాల్సిన వాడ్ని. పాపం... నా ఎంగిలితో ఇప్పుడు మీ ఇల్లేకాదు, వూరంతా కలుషితమైపోయింది."

రాజు మాటలు అంతర్లీనంగా అతని కులమేమిటో చెబుతున్నా చక్రధర్ నోరు విప్పలేదు.

రాజే అన్నాడు. "ఇందాకట్నుండీ... నేనంతగా ఎందుకు ఆవేశపడ్డానో... చంద్రకళకి సపోర్టింగ్‌గా ఎందుకు మాట్లాడానో ఇప్పుడర్థమైందనుకుంటా" చక్రధర్ మౌనంగానే నడుస్తున్నాడు.

"ఇప్పుడు చెప్పు.. నా వాళ్లని మీ వాళ్లు అంతగా అవమానిస్తుంటే... నోరు మూసుకుని ఉండమంటావా? "

అప్పటికీ చక్రధర్ మాట్లాడకపోవడంతో రాజు రెట్టించాడు "మాట్లాడవేం చెక్రీ? అవున్లే మీ జాతికి ప్రతినిధిగా... నువ్వేం చెప్పగలవ్? నాలాంటి వాళ్ల ఆవేశాన్ని అణచడం తప్ప."

అప్పుడు విప్పాడు నోరు చక్రధర్. "నీ జాతి అన్నావ్... అదేంటో నీకు తెలుసా?

**కొత్తగాలి...**

**మిత్రులెవరో తేలాక**
**మిగతావారు?**
**మన తప్పుల్నే చూసే**
**మార్గదర్శులు..**

**–కె.ఆర్.వి.వి రత్నకుమారి, హైదరాబాద్**

నాది మానవజాతి. నీది నా జాతేనేమో అనుకుంటున్నానింతవరకూ.. కాదేమో.. నాకు తెలీదు"

"చెక్రీ..." సంభ్రమంగా చూశాడు రాజు చక్రధర్ వైపు.

"లేకుంటే ఏమిట్రా? ఇందాకట్నుండీ చూస్తున్నా.. విశాల భావాలన్నీ నీ ఒక్కడి సొంతమేనన్నట్టు లెక్చరిస్తున్నావ్. నీ కులం ఏమిటో తెలుసుకోవాలన్న ఆసక్తి నాకు లేదు... ఎందుకంటే కులం భావనను నేను యాక్సెప్ట్ చెయ్యను. నిజానికి నా అంతరాళంలో నీ కులాన్నేదో మా బామ్మ దగ్గర దాచి పెట్టాలనీ.. ఓ త్యాగమూర్తిగా ఫోజు పెట్టాలని నాకు లేదు. కానీ దేనికయినా మంచి సమయం, సందర్భం రావాలి. అండర్‌స్టాండ్! ఇప్పుడైనా నువ్వు సంకుచితంగా.. నీ కులం ఇదీ అని చెప్పావ్గాని.. నాకు మాత్రం.. 'మానవులు' అన్న కులం తప్ప మరోటి తెలీదు. సింహాలు.. ఏనుగులూ.. గుర్రాలూ.. కుక్కలూ.. మనుషులూ.. దట్సాల్.. ఇలాంటివిరా జాతులంటే.. ఇంతకుమించి మరేం లేవ్"

"చెక్రీ" చక్రధర్ చేతిని తన చేతిలోకి తీసుకుని మార్దవంగా నొక్కాడు రాజు. చక్రధర్ స్టేట్‌మెంట్‌కి రాజు గుండెల్లో పొంగిన ఆనందార్ణవం.. ఆ స్పర్శలోంచి విద్యుత్ వేగంతో చక్రధర్‌లోకి పాకింది.

"రేయ్ రాజూ.. ఇందాక దార్లో...

కిష్టడా... ఓబడా... అని వాళ్లని పిలిచా నని నన్ను నిందించావే... అది చిన్నప్పటి నుండీ.. ఈ వాతావరణంలో పెరగటం వల్ల.. వచ్చిన అలవాటేగానీ అవమానించా లన్న తలంపు కాదు. నువ్వు పాయింటవు ట్ చేశాగ్గాని.. నాకది తప్పన్న భావం కల గలేదు. అందుకే చంద్రకళ ఇంటి దగ్గర నా తప్పును సవరించుకున్నా"

రాజుకు చప్పున గుర్తుకొచ్చింది.. చక్ర ధర్ నాగరాజును.. నాగడా అనికాకుండా నాగయ్యా అని పిలవడం... వీరిగాడ్ని... వీరయ్యా అని మన్నించడం. దాంతో పాటూ మరో విషయం స్ఫురించింది.

"చెక్రీ నేనో మాట చెబుతా.. జాగ్రత్తగా విను" రాజు చెప్పాడు. "ఎప్పట్నుంచో అల వాటుపడ్డ పిలుపుని.. ఒక్కక్షణంలో అంత సునాయాసంగా మార్చుకున్నావ్... అది కేవలం నేను వేలెత్తి చూపడం వల్లనే కదూ? మరి గ్రామంలోని మనుషుల తప్పుల్ని కూడా అలా వేలెత్తి చూపిన పుడు... అందరూ కాకున్నా... కొందరైనా మారకపోతారంటావా? ఆత్మవిమర్శ చేసు కోరంటావా? నీలో ఇంత మంచితనం నిక్షి ప్తమై వుందని.. నిన్ను నిందించాకేగా నాకు తెలిసింది.. అలాగే ఇంకా ఎంతమం దిలో అది నిద్రాణస్థితిలో వుందో!... తట్టి లేపడం మన కర్తవ్యం కాదూ? "

చక్రధర్ దృఢంగా అన్నాడు, "కచ్చితంగా మనదే. ఇందాక... నా ఫ్రెండ్‌వన్న స్వార్థంతో... నువ్వు రిస్కుల్లో ఇరుక్కుం టావన్న భయంతో... నిన్ను నిరుత్సాహప రిచాగాని... మరో ఉద్దేశంతో కాదు. గ్రామాన్ని బాగు చెయ్యడమంటే తార్రోడ్లు వెయ్యటం... పాఠశాల భవనాలు కట్టడం, కమ్యూనిటీ హాల్స్ నిర్మించటమే కాదు... మనుషుల మనసుల్ని మరమ్మతు చెయ్యటం కూడానని నాకిప్పుడే తెలిసిం దిరా. నా గ్రామ మానసిక స్వరూపాన్ని బాగుచెయ్యడంలో ఈ గ్రామ పౌరుడిగా నీకన్నా నాకే ఎక్కువ బాధ్యత వుంది. ఐ విల్ డు ఇట్ అండ్ అచీవిట్"

ఆ ఉదయపు నడక అంత స్ఫూర్తిమం తంగా వుంటుందని బయలుదేరేముందు అనుకోని ఆ ఇద్దరూ ఒకరి అంతరంగం ఒకరు తెలుసుకున్నామన్న అంతులేని తృప్తితో ఇంటివైపు గబగబ అడుగులేస్తు న్నారు.

గేటును సమీపిస్తుండగా చెప్పాడు చక్ర ధర్. "రాజూ కొన్ని కొన్ని సాధించాలంటే ఒకటో రెండో అబద్ధాలాడక తప్పదు. కొందరి మనసుల్ని నొప్పించటం కూడా తప్పదు. సో.. ప్రస్తుతానికి... నువ్వు మా వాడివే. అన్న అబద్ధాన్ని మా యింట్లో కొన్నాళ్లు అలాగే బతకనీ. మనం అనుకు న్నది సాధించగలిగితే... ఆ అబద్ధం దానంతటదే నిజమౌతుంది. నువ్వొ క్కడివేమిటి.. అందరూ మావాళ్లూ.. మన వాళ్లే అవుతారు"

★ ★ ★

మార్నింగ్ వాక్ నుండి తిరిగొచ్చాక... శుభ్రంగా స్నానం చేసి లుంగీ కట్టుకుని... భుజాలమీద టవల్ కప్పుకుని సూర్యుడికె దురుగా నిలబడ్డాడు రాజు.

ఏవో మంత్రాలు మెల్లగా ఉచ్చరిస్తూ.. సూర్య నమస్కారాలు చేస్తున్న అతడికేసి అబ్బురంగా చూసింది చక్రధర్ బామ్మ శ్రీనివాసమ్మ.

"ఒరేయ్ చెక్రీ.. ఇలా రా" పిలిచింది మనవడ్ని సంభ్రమంగా.

"ఏమిటి బామ్మా? "

"అటు చూడు.. ఆ పిల్లవాడ్ని. నువ్వు వున్నావ్ ఎందుకు? ఎప్పుడైనా అంతభ క్తిగా... సూర్యభగవానుడి ముందు నిల బడి చేతులు జోడించావ్? "

"అందుకా పిలిచావ్!" ఓసారి నిట్టూర్చి చెప్పాడు. "వాడు చదువుకున్నాడన్న మాటే

గానీ బామ్మా... వొట్టి ఛాందసుడు. నేను పట్నంలో చదువుకున్నప్పుడు చూశాగా వాడి తంతంతా... ఇంట్లో తప్ప... కనీసం బయట హోటళ్లలో కాఫీ కూడా తాగే వాడు కాదు. అందరూ నవ్వుతారని జంకాడు గాని... లేకుంటేనా... కాసిపోసి దోవతికట్టి... ముఖాన విభూది రేఖలూ, మెళ్లో రుద్రాక్ష మాలా... వేసుకు తిరిగేవా డనుకో. అసలు నీకో విషయం తెలుసా... నేను వీడితో స్నేహం చేసిన కొత్తల్లో ఓ చిన్న పిలక... క్రాఫ్ చాటున... ఎవరికళ్లా బడకుండా చాలా లాఘవంగా వేసుకు తిరి గేవాడు. ఓ రోజూ నేనా విషయం కని పెట్టి... వాడికి తెలీకుండా కత్తిరించి పారేశా... వారం రోజులపాటు నాతో పల కలేదు. ఆనక వాడే అడ్జస్టయిపోయాడు."

శ్రీనివాసమ్మ కళ్లింతింత చేసుకుని చక్ర ధర్‌కేసి చూసింది. "నిజంగా... అంత పద్ధతైన పిల్లవాడట్రా"

"ఓసారి కదిలించి చూడు... మన సనా తన సంప్రదాయాల గురించి.. నీకే తెలు స్తుంది.. వాడంటే ఏమిటో? "

సూర్యనమస్కారాలు ముగించి లోనికి వస్తున్న రాజును చేతిలో రుద్రాక్షలు తిప్పు కుంటూ మెరిసేకళ్లతో చూస్తుండిపోయింది శ్రీనివాసమ్మ.

రాజు.. చక్రధర్‌తో పాటూ టిఫిన్‌కి కూర్చుని పెసరట్లు లాగిస్తుంటే జంధ్యం లేని అతన్ని చూస్తూ, "ఇంకా ఉపనయనం చెయ్యలేదా నాయనా? " అంటూ ఆప్యా యంగా అడిగింది.

"లేదండీ.. పెళ్లి కుదిరాక.. ఒకేసారి ఆ తంతు జరిపిస్తారు" సిగ్గుపడ్తూ చెప్పాడు.

గడపకవతల నిలబడి.. అప్పుడప్పుడూ రాజుకేసి దొంగచూపులు చూస్తున్న మన మరాల్ని గమనించి ముసిముసిగా నవ్వు కుంటూ అడిగింది శ్రీనివాసమ్మ "సంబం ధాలు చూస్తున్నారా నాయనా? "

"చూస్తున్నారండీ" చెప్పి మంచినీళ్లు

# కొత్తగాలి...

**మహిళా సాధికారత**
**బ్యూటీ పార్లర్లలో ఇంకా**
**సొగసులద్దుకుంటూనే ఉంది**

*- లలిత, మదీనా గూడ, హైదరాబాద్*

తాగాడు.

"కుదిరేట్టుందా ఏదైనా"

"ఆc... ఓ సంబంధం కుదిరేట్టేవుంది. మాటలన్నీ అయిపోయాయ్. ఇక నేను ఊc అనడమే తరువాయి."

చాముండి చెవులు రిక్కించింది.

"పిల్ల నీకు నచ్చినట్టేనా" ఎందుకో తెలీ దుగాని శ్రీనివాసమ్మలో ఒకింత నిరాశ.

"పిల్ల కుందనపు బొమ్మలా వుంది బామ్మగారూ. కానీ ఒక్కటే చిక్కు."

"ఏమిటయ్యా అది? " ఆశగా అడిగింది.

"వాళ్లు... మడీ తడీ పాటించే మను షల్లా కనబడ్డం లేదు నాకు. అందుకే ఆలోచిస్తున్నా"

"ఇంత బతుకూ బతికి ఇంటెనక చచ్చి నట్టు... అలాంటి వాళ్లపిల్లను చేసుకోడ మెందుకూ? మంచి నియమనిష్ఠలున్న ఇంటి పిల్లనే చేసుకో" శ్రీనివాసమ్మకు రిలీ ఫ్‌గా సంతోషంగా అన్పించింది.

చాముండి... పెసరట్టు పట్టుకొచ్చి.. వద్దంటున్నా మరో రెండేసింది రాజు ప్లేట్లో. మనసెక్కడుందో మరి... పక్కనే వున్న చక్రధర్‌ని 'ఇంకా కావాలా' అని అడ గను కూడా అడగలేదామె.

"ఏం... తల్లీ... మేం కళ్లకు ఆనడం లేదా? " కోపంగా అడిగాడు చక్రధర్.

ఇంకోసారైతే మాటకు మాటా వడ్డించేదే మోగాని ప్రస్తుతం మాత్రం... సిగ్గుప డుతూ వచ్చి చక్రధర్‌కి వడ్డించింది.

శ్రీనివాసమ్మ వడ్డిస్తున్న మనమరాలికేసి తృప్తిగా చూసుకుని అంది రాజుతో "ఏమాటకామాటే చెప్పుకోవాలి బాబూ... మా చాముండేశ్వరి... ఈకాలప్పిల్ల కాదు."

చక్రధర్ వెంటనే తినడం ఆపి అడిగాడు "అదేంటే బామ్మా దాని వయసు పద్దెనిమిదేగా? ఈకాలప్పిల్లకాక.. మీకాలప్పిల్లయితే.. అదీ నీ అంత వుండాలిగా మరి!"

మనవడి జోకు అర్థమై చిరాకు పడింది శ్రీనివాసమ్మ. "పిల్ల వయసు గురించి కాదురా బడుద్ధాయ్ నేచెప్పేంట... దాని పద్ధతీ అదీ చెబుతున్నా"

ఇద్దరూ టిఫిన్ తినడం పూర్తయ్యాక అడిగాడు చక్రధర్ కాఫీలిచ్చి వెళుతున్న చాముండీని, "నాన్నగారేరే? "

"ఆ దరిద్రపుగొట్టుది తాకిందే.. ఆ బావి నీటిని శుద్ధి చెయ్యడానికి వెళ్లార్రా. మీరొచ్చే పదినిముషాల ముందుగా అనుకుంటా మనుషులొచ్చి పిలుచుకెళ్లారు" శ్రీనివాసమ్మ చెప్పింది.

చక్రధర్ రాజూ వరండాలోకెళ్లి కాసేపు మాట్లాడుకున్నారు. తరవాత డ్రెస్ చేసుకుని పూజ జరగబోయే బావి దగ్గరకు బయలుదేరారు.

శ్రీనివాసమ్మ కోడలు వైదేహి అందించిన టిఫిన్ తింటూ అంది "అమ్మాయ్ వైదేహి.. పిల్లవాడు రత్నమల్లే ఉన్నాడే. మన చాముండికి చక్కని ఈడూ జోడు సత్సాంప్రదాయం తెలిసిన వాడూ... ఆ పరమాత్ముడు చల్లగా చూస్తే... అబ్బాయిని మన పిల్లకు చేసుకోవాలనుందే నాకు"

"మీరూ నేను అనుకుంటే సరిపోతుందటండీ? శాఖా అదీ చూసుకోవద్దా... జాతకాలు కలవొద్దా" అత్తగారికి చట్నీ వడ్డిస్తూ అంది వైదేహి.

"అదీ నిజమే అనుకో" ఆలోచనగా అని, మళ్లీ అంది "నేనవన్నీ ఆరా తీస్తాగా. ఆ సర్వేశ్వరుడు పిల్లల జాతకాలు కలుపుతాడనే అన్పిస్తోంది వైదేహి నాకు"

"అయితే సంతోషమేనండీ. ఇంకోటెయ్యమంటారా! మరి కాస్త చట్నీ వేసుకోండి. అవునూ... ఈ చాముండి ఏదీ? "

అంతవరకూ అవతలి గదిలో తచ్చాడుతూ అమ్మా, బామ్మల సంభాషణ వింటున్న చాముండి చప్పున ఇవతలికొచ్చింది.

"ఇదిక్కడే నక్కివుందే వైదేహీ" మురిపెంగా చూసింది శ్రీనివాసమ్మ చాముండి వైపు.

చాముండి సిగ్గుల మొగ్గవుతూ "పో... బామ్మా" అంది.

"నీ పెళ్లి చూసిగాని పోనులే... నువ్వు పొమ్మన్నా సరే"

"నేనసలు పెళ్లే చేసుకోను" బుంగమూతి పెట్టింది.

"అయితే నేను కూడా చావనే చావను" శ్రీనివాసమ్మ నోరంతా తెరిచి నవ్వేసింది.




"మనుపు ఏం చెప్పాడో తెలుసా? " చంద్రకళ వంక సూటిగా చూశాడు రాజు.

బావి దగ్గర ఊరిజనం.. వాడజనం రెండు వర్గాలుగా గుమిగూడి ఉన్నారు. వాడజనం ముందు చంద్రకళ వారి ప్రతినిధిలా నిలబడి ఉంది. ఊరిజనాన్ని చక్రధర్, రాజూ లీడ్ చేస్తున్నట్టుగా నిలబడి

ఉన్నారు.

సగంలో ఆగిపోయింది పూజా కార్య క్రమం. ఆ కార్యక్రమం యథావిధిగా కొన సాగాలని పట్టుబడుతున్నదో వర్గం... "ఇది అన్యాయం... అవమానం..." అని ఉద్రేకపడుతున్నది మరో వర్గం.

"ఎవరతను? " భృకుటి ముడిచింది చంద్రకళ.

"శాస్త్రాలు చదివిన వారికి ఆయనెవరో తెలుస్తుంది. మీలాంటి వాళ్లకెలా తెలుస్తుంది పాపం? "

పెద్దరెడ్డి... పిచ్చిరాజా... చిల్లరకొట్టు గురవయ్య శెట్టీ ఒకరి ముఖాలొకరు చూసుకుని గుంభనంగా నవ్వుకున్నారు.

తన్నుకు రాబోతున్న ఆవేశాన్ని అణచుకుని... సాధ్యమైనంత శాంతంగా అడిగింది చంద్రకళ "ఇప్పటి సమస్యకూ శాస్త్రానికీ ఏమిటి సంబంధం? "

"ఈ సమస్యకు సమాధానం దొరికేది శాస్త్రాల్లోనే మిస్ చంద్రకళా. మనువు ఏమన్నాడో తెలుసుకుంటే... మీరీ జలశుద్ధి కార్యక్రమాన్ని ఆపరు. ఆపి... పరమేశ్వర శాస్త్రిగార్ని అలా అవమానించరు."

"రాజు ఒక రాజ్యానికి ప్రభువైతే... బ్రాహ్మణుడు ఈ సృష్టికంతటికీ ప్రభువు. ఎందుకో తెలుసా... అతడు పరమ పవిత్రమైన దేవదేవుని నోటి భాగం నుండి పుట్టినవాడు గనక. ధర్మానికి మరో అవతారం అతడు. ఈ ప్రపంచం యావత్తూ బ్రాహ్మణుడి ఆస్తి. కేవలం అతని దయా ధర్మాల మీద ఆధారపడి... ఈ సృష్టి మనుగడ సాగిస్తోంది. ఇది నా స్టేట్‌మెంట్ కాదు... పురాణపురుషుడు మనువు స్వయంగా చెప్పిన మాటలు"

"అంతేనా... ఇంకా ఏ పురాణ పురుషుడైనా ఇంకేమైనా చెప్పాడా? " చంద్రకళ స్వరం... బేలన్సింగ్‌గానే ఉంది.

"అకార్డింగ్ టు విష్ణు.. దేవతలూ... బ్రాహ్మణులూ ఇద్దరూ ఒక్కటే. దేవతలు అదృశ్యులూ.. బ్రాహ్మణులు సదృశ్యులూ. అంతే తేడా. ఈ సృష్టిని కాపాడేది బ్రాహ్మణులే. వాళ్లు సంతృప్తిగా వుంటేనే... స్వర్గంలో దేవతలు సుఖంగా వుంటారు. బ్రాహ్మణులకు వాక్శుద్ధి ఉంది. వారి నోటి నుండి వెలువడిన ప్రతిమాటా సత్యమై తీరుతుంది. ఈ భూసురుల్ని సంతోషపరిస్తేనే... దేవతలు సంతోషిస్తారు... కోరిన వరాలిస్తారు... బ్రాహ్మణుల్ని అవమానించిన వారిని... దేవతలు శపిస్తారు"

చంద్రకళే కాదు... అక్కడున్న ప్రతి ఒక్కరూ రాజు చెప్పే మాటల్ని నిశ్శబ్దంగా వింటున్నారు. ఒక్క పరమేశ్వరశాస్త్రి మాత్రం... అసహనంగా రాజుకేసి చూస్తున్నాడు.

నోరు విప్పకుండా తనకేసే చూస్తున్న చంద్రకళతో అన్నాడు రాజు "కనుకనే చెప్పొచ్చేదేమిటంటే..." ఆపి, పరమేశ్వర శాస్త్రికేసి చూశాడు.

"సద్బ్రాహ్మణ్ణి ఆటంకపరచకండి. అనాచారంతో ఇక్కడి మనుషులు మైలపడేలా చేయకండి. దయచేసి పూజ యథావిధిగా జరిగేలా చూడండి"

"లేకుంటే? " అడిగింది చంద్రకళ.

"చెప్పాగా... ధర్మచ్యుతి జరిగితే దేవతలు శపిస్తారు" గుంపులో నిలబడలేక... ఓ పక్కగా గొంతుక్కూర్చుని ఉన్న డెబ్బై ఆరేళ్ల ముసలయ్య పడీ పడీ నవ్వాడు. "యాందిసామె? .. దేవతలు శపిస్తరా? అంతరానితనం కన్నా ఆరిచ్చే శాపం ఇంగేటుందయ్యా? శాపాన్ని జలమతోటే ఎంట బెట్టుకుని బుట్టినం. మల్ల ఆల్లూ తవరూ గల్బి జేసేందేందంటా!"

"తాతా!" ముసలయ్యను వారిస్తున్నట్టు అంది చంద్రకళ.

"అంటరానితనం అనేది దేవుడిచ్చిన శాపం కాదు. అదుగో స్వార్థపరులైన ఆ

## కొత్తగాలి...

**ఋతు పవనాలు**
**ఏడాదికి ఒక్కసారే...**
**ఋణ పవనాలు**
**అన్ని ఋతువుల్లోనూ..**

*-ధరణికోట శివరాంప్రసాద్, హైదరాబాద్*

మానవులు చేసిన పాపం. దేవుడెప్పుడూ తన సృష్టిని తనే కించపరచుకోడు. కొందరు మనుషులు తమ తప్పు తెలుసుకుని పాపాన్ని కడిగేసుకుంటుంటే... మరి కొందరు మధ్య యుగాలనాటి అర్థం లేని ఆచారాలను మళ్లీ పునరుద్ధరిస్తూ ఇంకా పాపం చేస్తున్నారు. కాలం చెల్లిన మనువును మళ్లీ మననం చేసుకుంటున్నారు"

అంతవరకు చంద్రకళా రాజుల వాగ్వివాదానికి, కేవలం శ్రోతల్లా మిగిలిపోయిన పెదరెడ్డీ.. పిచ్చిరాజూ.. ఓ నిమిషం చెవులు కొరుక్కున్నారు. తరవాత పెదరెడ్డి చక్రధర్‌ని దగ్గరగా పిలిచి చెప్పాడు "అబ్బయ్యా.. ఇందాకట్నుండి జూస్తున్నం... ఆ యబ్బయ్య బాపనోల్ల గొప్పలు జెప్పటం... ఈ పిల్లేదో వాగటం... అంత బాగుండది గాని... మా కాపోల్ల గుర్చిగాని... చత్రియుల గుర్సిగాని... అదో... ఆ శెట్టిగార్ల గుర్సి గాని... ఒక్క ముక్కయినా జెప్పడేం దని? "

"మా నాయుడుగార్ల గుర్సో? " వాళ్ల కాస్త వెనగ్గా వున్న ఆదెయ్యనాయుడు గుర్తుచేశాడు తన కులాన్ని.

"మధ్యయుగాల నాటి ఆచారాలు మంట కలిసిపోబట్టే..." అంటూ చంద్రకళకు గట్టిగా సమాధానం ఇవ్వబోతున్న రాజు చెవిలో పెదరెడ్డి అసంతృప్తి గురించి చక్రధర్ వూదాడు.

రాజు క్షణంలో సగంసేపు తనకేసే కుతూహలంగా చూస్తున్న పెదరెడ్డీ తదితరుల్ని చూసి తిరిగీ మొదలెట్టాడు "మధ్యయుగాల నాటి ఆచారాలు మంటగలిసిపోబట్టే మనిషి పతనమైపోతున్నాడు. హద్దులు మీరి ప్రవర్తిస్తున్నాడు. ఒకప్పుడైతే బ్రాహ్మణులు... క్షత్రియులూ... వైశ్యులు... అనబడే మూడు తరగతులు మాత్రమే ఉన్నతస్థాయి కులాలు... నాలుగవ తరగతికి చెందిన శూద్రులు చాలా నీచంగా చూడబడ్డారు. వాళ్లు. అగ్రకులాల వారు నడిచే వీధులలో నడవటానికి అనర్హులు. అందరితో పాటు కలసి చదువుకునే యోగ్యత లేనివాళ్లు. ఇక దేవాలయాల్లోకైతే వారికి ప్రవేశమే లేదు. మొదటి మూడు తరగతులకు చెందిన మనుషులతో కలిసి శూద్రులు పంక్తి భోజనాలు చెయ్యకూడదు. వారితో కలిసి ప్రయాణం చెయ్యకూడదు. పురాణాలు, వేదాలు చదవకూడదు" రాజు చెప్పటం ఆపాడు, ఆయాసం తీర్చుకుంటున్నట్టు.

"అంతేకాదు మిస్టర్... ఇంకో నియమావళి కూడా ఉంది. కులాన్ని బట్టి శిక్ష... కులాన్ని బట్టి న్యాయం... మనిషిమనిషికీ ఒక చట్టం.. బ్రాహ్మణుడో.. క్షత్రియుడో వైశ్యుడో నేరం చేస్తే... శిక్ష నామమాత్రం. అదే శూద్రుడు చేస్తే శిక్ష కఠినాతి కఠినం. కౌటిల్యుడైతే ఏకంగా బ్రాహ్మణ యువతి మీద అత్యాచారం, హత్య చేసిన శూద్రుడ్ని కాల్చి బూడిద చెయ్యాలంటాడు. బ్రాహ్మణ హత్య చేసిన శూద్రుడ్ని కాళ్లూ చేతులు నరికి వెయ్యాలంటాడు. మనిషి అన్న పదానికి నిర్వచనంలాంటి వాడెవడైనా ఉంటే అతని గుండెల్లో సూటిగా గుచ్చుకుని రక్తసిక్తం చేసే అనాగరికత ఉందా స్టేట్‌మెంట్‌లో. ఆయన అలాకాక, బ్రాహ్మణ యువతి అనే బదులు 'యువతి' అనీ, శూద్రుడు బదులు 'నేరస్థుడు' అనీ బ్రాహ్మణ హత్య చేసిన శూద్రుడ్ని అన

కుండా ఒక మనిషిని హత్య చేసిన హంత కుడ్నీ అని ఉంటే ఆ ప్రతిపాదనకు సార్వ జనీనత ఉండేది"

"ఎంచేపూ... ఆ మూడు కులాల్నే పట్టు కోని వేలాడతా ఉండరు. కాపోల్ల గొప్ప గాని.. నాయుడుగార్ల గొప్పగాని... ఇందా మన్న సెవులబడ్డంలేదే" అదెయ్యానాయుడు సణగడం చక్రధర్ చెవుల్లో పడింది.

వెంటనే ఏదో అనబోతున్న రాజును ఆగమని వారించి తన గొంతు విప్పాడు "శూద్రులు... శూద్రులు అంటూ అందర్నీ ఓ గాట కట్టేస్తున్నా.. కాపులు, నాయుళ్లూ వీళ్లంతా అగ్రకులాల కిందకు వస్తారని తెలిసినట్టులేదు మీకు. అసలిప్పటి సామాజిక పరిస్థితుల ప్రకారమైతే ఆ కులాలకు ఎదురే లేదు."

చక్రధర్ నోటి వెంట ఆ మాటలు వెలు వడగానే అప్పుడు వెలిగాయి అక్కడి పెద్దల ముఖాలు దేదీప్యమానంగా. ఎదు రుగా మ్లానమైన ముఖాలతో నిలబడ్డ మాల మాదిగలకేసి నిరసనగా చూశారు. ఛాతీలు రెండంగుళాల మేర పొంగించు కుని చంద్రకళను హేళన చేస్తున్నట్టు ముసిముసిగా నవ్వుకున్నారు.

అనుకోకుండా మెరిసింది చంద్రకళ పెద వులమీద కూడా ఓ చిరునవ్వు "ఇప్పుడ న్నారే ఓ మాట.. సామాజిక పరిస్థితులు అనీ.. చాలా శక్తిమంతమైన మాట అది. ఈ నాటి పరిస్థితులు శూద్రుల్లో ఒక వర్గాన్ని అగ్రస్థానంలో నిలబెట్టాయి. రేపటి సామాజిక పరిస్థితులు కులవ్యవ స్థలో మరింత మార్పు తేవచ్చు. దళితుల తలరాతల్ని తిరగరాయవచ్చు. ఈ కులాన్ని కూడా ఉన్నత స్థానంలో నిలబెట్ట వచ్చు, కాదంటారా? "

"ఏమిటా వ్యర్థ ప్రేలాపన? " రాజు ఆవే శపడ్డాడు.

"శూద్రుల్లో ఆదినుంచీ రెండు వర్గాలు న్నాయి. మీ మాలలు, మాదిగలు రెండో వర్గమైన అతి శూద్రుల కిందకు వస్తారు. లెక్కప్రకారం మీరు పంచములు. మిమ్మల్ని మిగతావాళ్లతో పోల్చుకుని వాళ్లని కించపరిచే ప్రయత్నం చెయ్యకండి. అసలు చరిత్రలో మీ కడజాతి వాళ్ల స్థాన మేమిటో తెలుసుకుని మాట్లాడుతున్నారా మీరు? ఒకప్పుడు పల్లెలనేమిటి... పట్నా లేమిటి... ఎక్కడా మీకు నివాస యోగ్యత లేదు. మీ పంచముల్ని కేవలం ఊరి శివా ర్లలోనే ఉండనిచ్చేవారు. ఏదైనా అవసరా నికి మీ జాతి నగరంలోకి రావలసివస్తే ఒక ప్రత్యేక సమయంలోనే అనుమతించే వారు. ఎప్పుడు పడితే అప్పుడు మీరు నగర ప్రవేశం చెయ్యడానికి అనర్హులు.

ఫరెగ్జాంపుల్ పూనాలో మధ్యాహ్నం మూడు గంటల నుండి మరుసటిరోజు ఉదయం తొమ్మిది వరకూ మీ కడజాతి వాళ్లు నగర ప్రవేశం చెయ్యకుండా సిటీ గేట్సు మూసివేసేవారు. ఎందుకో తెలుసా? ఆ సమయంలో నీడలు పొడవు ఏర్పడతాయి. అలా ఏర్పడిన నీడలను అగ్రవర్ణాలవారు తొక్కవలసి వస్తుందన్న భయంతో. మరో విషయం ఏమిటంటే పంచముల ఇళ్లలో జరిగే శుభాలు కానీ అశుభాలు కానీ పూజారులు నిర్వహించ రాదు అన్నది ఇంకో షరతు. మీ కడ జాతి..."

"ఇక చాలు ఆపండి" ఉద్రేకంతో చంద్ర కళ పెదవులు కంపిస్తున్నాయి. తనను తాను కంట్రోలు చేసుకోవడానికి ఆమెకు కొద్ది క్షణాలు పట్టింది. "మిస్టర్.. మీరే అంటున్నారు 'ఒకప్పుడు' అని. ఇప్పటి పరి స్థితుల్ని నన్ను చెప్పమంటారా? నా స్నేహితురాలు శమంతారెడ్డి ప్రేమగా నా ఎంగిలి తింటుంది. మరో స్నేహితురాలు వినీతశర్మ తల్లి... నన్ను బిడ్డలా చూసు కుంటోంది. నాకు భోజనం పెట్టి నేను

తిన్న ప్లేటు ఆమె కడుగుతుంది. మీరూ హించినట్టు మీ అగ్రకులాల వాళ్లందరి ఆలోచనా ధోరణి మీలా లేదు. సిటీల్లో, టౌన్లలో దాదాపుగా వెలివేయబడింది ఈ సోకాల్డ్ కులవ్యవస్థ. స్వచ్ఛతకూ... అమా యకతకూ మారు పేరని అందరిచేత కొని యాడబడుతున్న మనదేశపు పల్లెటూళ్లు మాత్రం నగరాల నుంచి పారిపోయి వచ్చి కులవ్యవస్థకు పీఠం వేస్తున్నాయి. కానీ ఇక్కడకూడా... దానికి నిలువ నీడ లేకుండా పోయే రోజులు త్వరలోనే వస్తాయి"

"అది మీ దురాశ" చెప్పాడు రాజు.

"ఒక్కనాటికీ కాదు. మన రాజ్యాంగం సెక్యులరిజమ్ మీద బేస్ అయివుందని మరిచిపోకండి. ఫరెగ్జాంపుల్ ఇప్పుడు మీరు పేలిందంతా రికార్డ్ చేసి మీ మీద కేసు పెడితే... కటకటాలు లెక్కబెడుతూ కాలం గడపాల్సి వస్తుంది. ఇండియన్ కాన్‌స్టిట్యూషన్‌లోని పదిహేనవ సెక్షన్ ప్రకారం... ఒక వ్యక్తి మరో వ్యక్తిని కులం పేరుతో గాని... మతం పేరుతోగాని... జన్మస్థలాన్ని ఉదహరిస్తూ గాని... లింగ వివక్షతోగాని దూషిస్తే ఆ వ్యక్తి భారతీయ శిక్షాస్మృతి ప్రకారం శిక్షార్హుడన్న ప్రైమరీ రూల్ మీకు తెలియదనుకోను"

మీసాలు దువ్వుకుంటున్న పెద్దరెడ్డికి చిర్రెత్తుకొచ్చింది. చంద్రకళ మాటలకు భుజంమీది కండువా ఓసారి విదిలించి వేసుకుని అన్నాడు "ఇందాకట్నుంచి చూస్తున్నా... ఆహఁ ఏందని నీ యవ్వారం? ఆ యబ్బాయ్య 'పద్ధతంటే ఇదమ్మా' అని నెత్తీనోరు కొట్టుకుంటుంటా వుంటే... కేసులూ గీసులంటూ వదరు తుండావ్. ఆడదానివీ... అందునా పొరు గూరి మనిసివీ అని పోనిస్తుంటే..."

పెదరెడ్డి మాటల్ని మధ్యలో అడ్డు కుంటూ అంది చంద్రకళ "ఇప్పుడే చెప్పాను. లింగ వివక్షత గాని.... జన్మ స్థలం పేరిటగానీ ఎదుటి మనిషిని నిందిం చడం నేరం అని".

"ఓయబ్బో నేరం గీరమని పెద్ద పెద్ద మాటలొస్తన్నయ్ నోట! అయన్నీ మీ పట్నాల్లో చెల్లుతయ్యేమోగాని ఈడ జెల్లవ్. యాడ్నించి వచ్చినవో ఆడికి గుట్టుగా ఎలిపో. మా వూరి మాలోల్లని... మాదిగో ల్లనీ మా మీనకు ఎగదొయ్యటం నీకు, నీ ఒంటికి మంచిది గాదు. ఆశారమంటే ఆశా రమే. ఇదిట్టా సాగాల్సిందే" పిచ్చిరాజు గాలి దుమారంలా రేగిపోయాడు.

"సాగనియ్యం" ఆ మాటలన్నది చంద్ర కళ కాదు. ఆమె వెనక నిలబడ్డ వాడ జనం.

"మీ సేలల్లో నారేతకూ... కోతలకూ బనికొచ్చే ఈ సేతులు మీ బాయి ముట్ట నీకి బనికిరావా?

మీ పశుల్ని మేపకొచ్చేది మేము.. మీ సెప్పులు గుట్టేది మేము. ఆకరాకి.... మీరు జస్తే గుంటల్దవ్వేది మేము. అసు మంటోలం... దప్పికై గుక్కెడ్నీల్లు దాగితే సెబ్బర్రెందా? అయ్యా సాములూ... తమ రంతా పటోత్తరంగా జూసుకునే ఆ బాయిలో... కప్పలూ.. ఎర్రలూ, జల గలూ వుంటయ్. కాకులూ పిసికలూ రెట్ట లెస్తయ్. ఆటన్నిటికన్నా ఈనమా మేం?"

జనంలో ఎవరో గొంతు చించుకున్నారు.

"గాంధీగారి అయాం నుండీ జూస్తున్నా... అప్పటికీ... ఉప్పుడికీ... మా బతుకులేం మారలా. ఒకపక్క అరిజ నులుగ అంటూనే.. ఉంకోపక్క అంటరా నోడివి అవతలకి బోరా అంటున్నరు. యాడ నిద్దరబోతన్నడో ఆ అరి... జరిగే అన్నాయం జూస్తన్నడో లేడో!" ముస లయ్య ఆవేశంగా మొదలుబెట్టి... ఆవేద నతో ముగించాడు.

"ఒరేయ్ ముసిలా! పుట్టిన కాడ్నించీ

మా ఉప్పూ, పులుసూ దిని బతికి... మాకే ఎదురు జెపుతాండావ్? " గురవయ్య శ్రేష్ఠి నిష్ఠూరంగా అన్నాడు.

చక్రధర్ కల్పించుకున్నాడు "ఇన్ని మాట లనవసరం. ఎవరి ఆచారం వాళ్లదని ఇందాకే పిచ్చిరాజుగారు సెలవిచ్చారు. దాని ప్రకారం ఇక్కడ పూజ జరుగుతుంది. ఇది ఎవ్వరినీ అవమానించడానిక్కాదు. మా ఆచారాన్ని మేం గౌరవించుకోవడానికి మాత్రమే".

"ఇతరులను అవమానించడమే మీ ఆచారమైతే అలాగే కానివ్వండి. కానీ ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. ఇక ఈ అంటరాని మనుషుల స్వేదంతో తడిసిన ధాన్యం మీ గాదెల్లో నిండదు. మీ కాన్న నయమనిపించే... మీ పశువుల కడుపుల్ని నింపడానికి ఈ మనుషుల చేతులు ఉప యోగపడవ్. మీ శవాలకు మీరే గుంటలు తవ్వుకోండి. మిమ్మల్ని మీరే పాతి పెట్టు కోండి" ఆమె గిరుక్కున వెనుదిరిగింది. ఆమెతో పాటే వాడజనం అడుగులు పడ్డాయ్.

ఇంత జరుగుతున్నా... పెదవి విప్పని పరమేశ్వర శాస్త్రి.... చంద్రకళ వెళుతున్న వైపే... కాసేపు తదేకంగా చూసి... పూజ కార్యక్రమంలో మునిగిపోయాడు.

★ ★ ★

"నాన్నగారు భోం చెయ్యరట. నిన్ను తినమన్నారు" చెప్పింది చాముండి వైదేహితో.

"ఎందుకటా? " అక్కడే వున్న శ్రీనివా సమ్మ అడిగింది.

బావి దగ్గర గొడవ సద్దుమణిగి పూజా అదీ ముగించి వచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. 'ముందు పిల్లలకు పెట్టు. నేను తరువాత తింటాను' అన్నా రని, వైదేహి అలాగే చేసింది. ఇప్పుడందరి భోజనాలు అయ్యాయి. 'ఇంతలో నాన్న గారు భోం చెయ్యరట' అంటూ వచ్చింది చాముండి.

సాధారణంగా పరమేశ్వరశాస్త్రి భోజనప్రి యుడు. ఒక్క శనివారం రాత్రిపూట మిన హాయించి ఆయనెప్పుడూ అభోజనంగా ఉండడు. మిగతా రోజుల్లో ఎప్పుడైనా అలా వున్నాడూ అంటే ఏదో సుస్తీ చేసిం దన్న మాటే... ఆ పూజా కార్యక్రమం ముగించి ఇంటికొచ్చినప్పటి నుండి ఆయ నెందుకో కాస్త ముభావంగా వున్నాడు. రాగానే బావి దగ్గరకెళ్ళి ఆదరా బాదరా... రెండు బక్కెట్ల నీళ్ళు ఒంటిమీద దిమ్మరిం చుకుని... తువ్వాలుతో ఒళ్ళంతా శుభ్రంగా తుడుచుకుని వరండాలో వాలు కుర్చీలో పడుకున్నాడు. ఆ పడుకున్న మనిషి పడుకున్నట్టే ఇప్పుడు భోజనం

## పేరుందా అని చూస్తున్నా!

ఒకనాడు సాయంత్రంపూట రాజుగారి వెంట వాహ్యాళికి మామిడి తోటకి వెళ్లాడు గాలిబ్. చెట్లనిండా పండ్లను చూస్తుంటే నోరూరిపోతోంది. కానీ రాజుగారిని ఎలా అడగాలా? అని మథన పడుతూ తదేక దీక్షతో ఆ చెట్ల వంకే చూస్తు న్నాడు గాలిబ్. 'అంత దీక్షగా ఆ చెట్లవైపు ఎందుకు చూస్తున్నారు? ' అడిగాడు రాజు. 'ఆ పండ్లమీద నాపేరెక్కడన్నా రాసుందేమోనని' అన్నాడు గాలిబ్. రాజు ఆశ్చర్యపోతుంటే 'అవును ప్రభూ.. తినే ప్రతిగింజమీదా దేవుడు మనపేరు రాస్తాడని అంటారు గదా అలాగే వీటిమీద కూడా..' రాజుకు విషయం అర్థమైంది. వెంటనే మంచి మంచి పండ్లు కోయించి గాలిబ్ ఇంటికి పంపించాడు రాజు.



## కొత్తగాలి...

**గడ్డి తింటూ పాలిస్తే...**
**పశువు**
**పాలిస్తూ..గడ్డితింటే...**
**ప్రభువు!!**

—వై.కె.మూర్తి,
విజయవాడ

వద్దంటున్నాడు.

వైదేహి వంటింట్లోంచి వరండాలో కొచ్చింది.

మాగన్నుగా పడుకుని వున్న శాస్త్రి... ఆమె పాదాల అలికిడికి చివుక్కున కళ్లు విప్పాడు.

"భోజనం వద్దన్నారట!"

"ఆc" వేలి కొసలతో కణతలు నొక్కు కుంటూ చెప్పాడు.

"ఎందుకని? ఉదయం కూడా ఏమీ తినకుండా వెళ్ళారుగా"

"అబ్బబ్బ.. ఆకల్లేదు... నన్ను విసిగిం చక నువ్వెళ్లి భోంచేయ్" ఆయన మళ్లీ కళ్లు మూసుకున్నాడు.

అభిమానంగా అడుగుతుంటే ఆయనలా విసుక్కోవటం కళ్లలో నీళ్లు తెప్పించింది వైదేహికి. దాంతోపాటు రోషమూ వచ్చింది. "ఆc... ఆc... భోంచేస్తా... ఎందుకు భోం చెయ్యను... మీరలా పస్తు పడుకుని వుంటే... నేనిదివరకు ఎన్నిసార్లు సుష్టుగా తిన్లేదూ.."

శాస్త్రి కళ్లు తెరిచి ఆమెకేసి చూశాడు.

"సరే పద" లేచాడాయన.

వైదేహి కొంగుతో కళ్లు తుడుచుకుంది. పీటవేసి వడ్డించింది. భార్య నిష్ఠూరమా డిందని కూర్చున్నాడుగాని ఆయనకు తిండి సయించలేదు. ఏదో తిన్నాననిపించి లేచాడు.

మళ్లీ వచ్చి వాలుకుర్చీలో నడుం వాల్చాడు. చేతిని మడిచి తలగడలా పెట్టు కుని... ఇంటి ముందున్న ఆవరణలో గాలి మెల్లగా తలలూగిస్తున్న మొక్కలకేసి చూస్తున్నాడు.

ఆ మధ్యాహ్నపు ఎండ అతి పలుచని బంగారపు తెరలా ధగధగలాడుతోంది చెట్లమీద. మందార పొద పక్కనే పసుపు, ఎరుపు రంగుల్లో విరగబూసిన గులాబిమొ క్కలు... వాటి పక్కనే పందిరికి అల్లు కున్న విరజాజి తీగలు... వాటికి ఓ రెండు అడుగుల దూరంలో వరసగా పెరి గిన బాల్సమ్ ప్లాంట్స్... ఇంకాస్త దూరంలో జినియాలు... మరోవైపు నంది వర్ధనాలు.. గ్లాడియోలాలు... ఫెన్సిం గంతా అల్లుకున్న బోగన్‌విల్లా తీగలు... అవునూ.. మొక్కలకు జాతి వివక్షతే ఉండదా?

మరి మొక్కలు ఏజాతికాజాతి వేరువే రుగా పెరగటం లేదే.. నందివర్ధనం పక్కన చేమంతి పూస్తోంది. మల్లెపొద సమీపంలో కస్తూరి వికసిస్తోంది. వాటి మధ్య జాతివైరం లేనేలేదు. మొక్కలకు మాట రాదు. ఆలోచనా శక్తి అంత కంటె లేదు. అయినా అవి ఒక్కటిగా జీవిస్తు న్నాయి. మరి మెదడూ... మనసూ అన్నీ వున్న మానవుడు... శాస్త్రంలో తర్కంలో నానాటికీ ముందంజ వేస్తున్న నాగరికుడైన మానవుడు.. జాతి వైరంతో ఎందుకనీ.. తిరిగి అనాగరికుడై పోతున్నాడు.

రాజు ఏమన్నాడు? బ్రాహ్మణుల్ని దేవ తలన్నాడు. ఓ బ్రాహ్మణుడిగా తను ఉప్పొంగి పోవలసిన క్షణాలవి. కానీ తన కలా అన్పించేలేదే అప్పుడు! అగ్రకులాల గొప్పదనాన్ని అతడు అభివర్ణించేకొద్దీ తన హృదయాంతరాళంలో ఇదీ అని చెప్పలేని అసంతృప్తి. గర్వంగా అన్పించడానికి బదులు సిగ్గుగా అన్పించింది, ఎందుకని? ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాడు

అలా ఎంతసేపున్నాడో.. కళ్లు తెరిచే సరికి సూర్యుడు పడమటి తీరంలోకి కుంగిపోతున్నాడు. వరండాలో ఓ మూలగా నవారు మంచంలో ఉన్న ముసలమ్మ సంస్కృత శ్లోకాలు సన్నగా సణుక్కుంటోంది.

అవి తెగిపోయిన వీణ తీగలు విడిచే నిశ్శబ్దపు నిట్టూర్పుల్లా వున్నాయి.

చాముండి నడిగి ఓ గ్లాసు మంచి నీళ్లు తాగాడు. అవి తాగుతుండగానే ఆమె ఓ కప్పు కాఫీ తెచ్చి తండ్రికిచ్చింది.

పంచదార నీళ్లలా తియ్యగా వున్నాయవి. "అమ్మడూ కాఫీలో పంచదార ఎక్కువైందే"

"అవునాన్నా.. అమ్మపొరపాటుగా వేసేసినట్టుంది"

నాలుగు గుక్కలు తాగి వెగటనిపించడంతో కింద పెట్టేశాడు.

'అతి సర్వత్ర వర్జయేత్' అన్న విషయం చప్పున గుర్తుకొచ్చింది. అది కాఫీలో పంచదార కానీ.. మజ్జిగలో ఉప్పు కానీ.. పొగడ్తగానీ.. తెగడ్తకానీ.. ఏదైనా 'అతి' అయిందంటే వెగటే.

అప్పుడు స్ఫురించిందాయనకు

రాజు తమ కులాన్ని.. ఉన్నత శిఖరాల మీద నిలబెడుతూ మాట్లాడుతున్నప్పుడు.. తనకెందుకు ఆత్మన్యూనతగా అన్పించింది.

"మీరు దైవ సమానులండీ" అని ఎదుటి వ్యక్తి జేతులు జోడిస్తే పొందే ఆనందం.

"రేయ్ నేను దేవుడ్నిగా.. నమస్కరించుకో" అని అడిగి నీరాజనాలందుకోవటంలో పొందగలగటం అసాధ్యం"

తనలోని స్తబ్దతకు కారణం తెలిశాక మనసు కాస్త ప్రశాంతంగా అన్పించింది.

చాముండి స్ప్రింక్లర్ చేత బట్టుకుని మొక్కలకు అభ్యంగన స్నానం చేయిస్తోంది.

పరిశుభ్రంగా తడితడిగా తళతళలాడుతున్న పచ్చటి ఆకుల మీంచి తేలివస్తున్న సందెగాలి ఆయన ఒంటిని కన్నతల్లిలా నిమురుతోంది.

★ ★ ★

"కూర్చోండి" మర్యాద పూర్వకంగా చెప్పాడు మోహన్‌రెడ్డి. చంద్రకళ కూర్చుంటూ అతనికేసి నిశితంగా చూసింది. ముప్పయ్యో.. ముప్పైలోపో వుంటుంది. వయసు చూడగానే చెప్పొచ్చు మంచి సంస్కారవంతుడని. ఊరికి ప్రెసిడెంట్‌నన్న భేషజం అతని ముఖంలో ఏకోశానా కనబడ్డం లేదు. చిత్తశుద్ధితో పని చేసుకునే ఓ ఉద్యోగిలా వున్నాడు.

విలేజ్ బ్యాక్‌గ్రౌండ్‌గా వున్న తెలుగు సినిమాలో నూతన్‌ప్రసాద్‌నీ.. ఇప్పుడు కోట శ్రీనివాసరావును ఊరి ప్రెసిడెంట్‌గా విలనీ టైప్ రోల్స్‌లో చూసీ చూసీ విసుగెత్తిపోయిన కళ్లకి ఇతనో రిలీఫ్.. అనుకుంది చంద్రకళ. మళ్లీ అంతలోనే.. ఆకారాన్ని బట్టి ఓ నిర్ణయానికి రాకూడదులే.. నోరు విప్పితేగా.. అసలు మనిషి అర్థమయ్యేది అనుకుంది.

"ఊరి ప్రెసిడెంట్‌గా నేను చెయ్యలేని పని మీరు చేశారు.. కంగ్రాచ్యులేషన్స్" చెప్పాడతను.

"మోహన్‌రెడ్డికి.. కాస్త దూరంలో కూర్చుని వున్న ఆ ఊరి వీఏవో గోపాల్రావ్ చంద్రకళ కేసి చూశాడు. ప్రెసిడెంట్‌గారి కాంప్లిమెంట్‌కి... ఆమె రియాక్షన్ని అబ్జర్వ్ చేస్తున్నట్టు.

చంద్రకళ ముఖంలో ఆనందం కన్నా ఆశ్చర్యం కన్పించిందతనికి. ముడివడిన ఆమె కనుబొమలు చూడగానే తెలిసింది గోపాల్రావుకు తనను ఎందుకు ప్రెసిడెంట్ అభినందిస్తున్నాడో ఆమెకు అర్థంకాలేదని.

"అదేనమ్మా.. హరిజనవాడలో.. రెండు వర్గాల మధ్య.. మాల మాదిగల మధ్య నువ్వు సాధించిన సఖ్యత గురించి ఆయన ప్రస్తావించేది"

ఆ మాట చెప్పి మళ్లీ వెంటనే నొచ్చుకుంటూ అన్నాడు గోపాల్రావ్ "సారీ.. మాల మాదిగ అన్నాను"

"దాన్దేముందండీ?" చంద్రకళ ఆశ్చర్యంగా చూసింది. "మీరేదో తిట్టు మాటన్నట్టు బాధపడుతున్నారు? రెడ్డీ.. నాయుడూ.. బ్రాహ్మణ అన్నట్టే.. మాలా.. మాదిగా.. అనేవి కులాల పేర్లు అంతేగా"

అలా అన్నదేగాని ఆమెకు తెలుసు అతనెందుకు నొచ్చుకున్నాడో! అగ్రకులాల వాళ్లు ఉపయోగించే తిట్ల లిస్టులో.. ఆ పదాలుంటాయని ఆమెకు ఒకరు చెప్పనక్కర్లేదు. వాళ్ల సొంత మనుషుల్ని దూషించేటప్పుడు కూడా 'పోరా మాల మాదిగ నాకొడకా' అనో.. 'నీకన్నీ మాల మాదిగ బుద్ధులు' అనో 'పోవే మాల మాష్టీడి దానా' అనో తిట్టడం తను చాలా సార్లు విన్నది.

మోహన్‌రెడ్డి అన్నాడు, "నిజంగా వాళ్లను ఒక్కతాటి మీద నిలబెట్టిన ఘనత మీదే"

"ఇందులో ప్రత్యేకించి నా ఘనతేం లేదండీ. అందర్నీ ఓచోట చేర్చి మనమంతా ఒక్కటని నచ్చ చెప్పాను. తారతమ్యాల నీడల్లోని లొసుగుల్ని వివరించాను. దానివల్ల ఎవరు లబ్ధి పొందుతారో తెలియజేశాను. అర్థం చేసుకున్నారు. కలిసిపోయారు. దీన్నిబట్టి నాకు తెలిసిందొక్కటే! అగ్రవర్ణాల వారు.. మాల మాదిగల్ని అంటరాని వాళ్లంటూ దూరంగా విసిరికొట్టారు. మళ్లీ వాళ్లని మీ స్వప్రయోజనాలకోసం రెండు వర్గాలుగా వేరుచేశారు. మాల పల్లెనీ... మాదిగపల్లెనీ. హరిజనుల్ని నివాస పరంగా కూడా విడదీశారు. మాదిగల కంటే మాలలు అధికులంటూ ఓ ఫాల్స్ ప్రిస్టేజ్‌ని వాళ్లలో క్రియేట్ చేసి వైషమ్యాన్ని రగిలించి రాజకీయం నడుపుతున్నారు. ఇన్నాళ్లూ చెప్పేవాళ్లు లేక అజ్ఞానంలో బతికారు. ప్రస్తుతం.. సమైక్యంగా జీవించాలని నిర్ణయించుకున్నారు"

"చాలా మంచి నిర్ణయం. కానీ... వాళ్లు మాత్రమే కాదు... ఈ పల్లెలోని అన్ని కులాలూ వారిలా ఒక్కటై సమైక్యంగా బతికేరోజు వస్తుందంటారా?"

చంద్రకళ విస్మయంగా చూసింది అతనికేసి. ఒక అగ్రకులస్థుడిగా... పంచాయితీ ప్రెసిడెంట్‌గా అతనలా అనడం విస్మయాన్ని కలిగించిందామెకు.

"మంచినీళ్ల బావి దగ్గర జరిగిన జలశుద్ధి కార్యక్రమం సభ్య సమాజం తలవంచుకునే చర్య" మళ్లీ అన్నాడతను.

కళ్లు విప్పార్చుకుని చూస్తోందామె అతని వైపు.

"అగ్రకులస్థుల అహంభావానికి బాగా బుద్ధి చెప్పారండి మీరు. మొత్తానికి తరతరాల్నుంచీ నిద్రాణంగా పడివున్న వాడ జనాన్ని జాగృతం చేశారు. ఓ రకంగా ఊరు బాగుపడినట్టే"

"అప్పుడే ఎక్కడండీ రెడ్డిగారూ! ఇప్పుడు కళ్లు తెరిచారు. ఇక దోగాడాలి. తప్పటడుగులెయ్యాలి. నడక నేర్వాలి. పరుగు తియ్యాలి. అప్పుడు గాని ఊరు బాగుపడింది అన్నమాట వాడకూడదు" గోపాల్రావ్ మాటల్లో నిజాయితీ వుందో... నిష్ఠూరం ఉందో అర్థం కాలేదామెకు.

"ఇంతకీ మిమ్మల్ని పిలిచిన పని చెప్పనేలేదు" అంటూ వీఏవో వంక చూశాడు. "మీరు చెప్పండి" అన్నాడు వీఏఓతో.

"మన వూళ్లోని బంజరు భూముల్ని గురించి ఓ మాట చెబుదామని పిలిచామమ్మాయ్. ఇప్పుడెలాగూ మాల మాదిగలు..." నాలుక్కర్చుకుని అన్నాడు. "అదే హరిజనులు రైతుల చేలల్లో కూలీనాలీ చెయ్యడానికి స్వస్తి చెబుతున్నారు కాబట్టి..."

అతని మాటల్ని అడ్డుకుందామె "నీళ్ల

ముట్టుకుంటేనే మైల పడిపోతామని భావించే వారి పొలాల్లో అడుగుపెట్టి... వారి తిండి గింజలు తాకి మైలపరచడం ఎలాగండీ? అందుకే... ఆ నిర్ణయం తీసుకున్నాం మేము..."

"మొత్తానికి... వాళ్ల గడ్డి వాళ్ల చేతే తినిపిస్తున్నారు" గోపాల్రావ్ నవ్వాడు.

"అదే... ఇక కూలివెళ్లే ఆలోచన లేదు కాబట్టి... బంజరు భూముల్ని సాగు చెయ్యిద్దాం వాళ్లచేత. మిగులు మరియు అసైన్‌మెంట్ భూముల అభివృద్ధి పథకం కింద ఈ ఊరి హరిజనులకు పట్టాలు మంజూరు చెయ్యిస్తాం. త్వరలో వ్యవసాయ కూలీలకు చిన్ననీటి వనరుల ఏర్పాటు పథకం కింద ఒక్కొక్కరికి పన్నెండువేల రూపాయల లోను ఇస్తారు షెడ్యూల్డ్ కులాల సేవా సహకారం సంస్థ వాళ్లు. అవి మన వూరి హరిజనులకు వచ్చేలా ప్రెసిడెంట్‌గారు ఏర్పాట్లు చేస్తారు. వాటితో ఫిల్టర్ పాయింట్లూ... బోర్ బావులూ వెయ్యించుకోవచ్చు"

చంద్రకళ నిజానికి ఉబ్బితబ్బిబ్బయిపోతోంది. అయితే మనసులో వీళ్లింత శ్రద్ధ తీసుకుంటున్నారంటే దీనికి రాబోయే ఎలక్షన్లకీ... ఏమైనా సంబంధం వుందా అన్న అనుమానం కూడా పొడసూపకపోలేదు కానీ ఒక్కటే అనుకుందామె.

వాళ్ల ఆలోచన విధానంలో స్వార్థ చింతన వుంటే వుందిగాక... ప్రస్తుతం అందిస్తున్న చేయూత మాత్రం చాలా విలువైంది.

"మీరేం ఆలోచిస్తున్నారో నాకు తెలుసు" మోహన్‌రెడ్డి చిన్నగా నవ్వాడు.

"ఏమాలోచిస్తున్నాను? "

"ఇది ఓట్ల కోసం నేను ప్లే చేస్తున్న చీప్ ట్రిక్ అని" ఆమె ఖంగు తిన్నట్టు చూసింది.

"యామైరైట్? " అడిగాడు.

"బట్ మిస్ చంద్రకళా! నేనిది నిస్వార్థంగా చేస్తున్నాను. రామకృష్ణ పరమహంసని చూసి వివేకానందుడు ఇన్‌స్పైర్ అయినట్టుగా... మీ తిరుగుబాటును చూసి నేను స్పందించాను. కేవలం... మనిషిగా... మనసున్న మనిషిగా..."

అతని మాటలు అసత్యం అనుకుంటే... తనను తనే అవమానించుకున్నట్టు అన్పించిందామెకు. ఇదీ అని చెప్పలేని ఒక గౌరవభావం మనసును ముప్పిరిగొనగా చప్పున చేతులు జోడించింది. "చాలా థేంక్సండీ. కచ్చితంగా ఒకనాటికి గ్రామ పంచాయతీలకే ఆదర్శమవుతారు మీరు"

"అంత పెద్ద మాటలొద్దులెండి. కులవ్యవస్థపై నమ్మకం లేనివాణ్ని నేను. మీ తిరుగుబాటు ఒక ఉద్యమం కావాలంటే మీకు ముందుగా కావలసింది ఆర్థిక స్థోమత. అది కల్పిస్తే నా బాధ్యత కొంతవరకూ నెరవేర్చినట్టే. మిగిలిన పోరాటం మీది"

ఆమె ఓ క్షణం ఆలోచనలో పడి తరు

## ఎవరి భయం వారిది

మిత్రుడొకాయన గాలిబ్ ఇంటికి వచ్చి చాలా రాత్రి దాకా మాట్లాడుకుంటూ కూర్చున్నాడు. వెళ్లేప్పుడు దీపం తీసుకుని వాకిట్లో దాకా వచ్చి చెప్పులు చూపించాడు గాలిబ్. 'నా చెప్పులు నేను తొడుక్కోలేనా? దీపం ఎందుకూ?' అన్నాడతను. 'అది నిజమే. నీ చెప్పులు తొడుక్కోలేవనీ కాదు. నా చెప్పులెక్కడ వేసుకుపోతావోనని దీపం తెచ్చా' అన్నాడు గాలిబ్ సరదాగా.



## కొత్తగాలి...

**వీధిగుమ్మం**
**చూరు పట్టుకు**
**వేళ్లాడుతూ మావారు!**
**ఎదురుగా లేడీస్ హాస్టల్ మరి!**

–ప్రసాద్, నవులూరు,
శ్రీకాకుళం

వాత చెప్పింది. "జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ప్రాజెక్ట్ డైరెక్టర్‌గారు నాకు బాగా తెలుసు. ఆయన కూతురు నా బెస్ట్ ఫ్రెండ్. ఇక్కడి పరిస్థితి వివరిస్తూ నిన్ననే ఆమెకో లెటర్ రాశాను. ఈ పల్లె గురించి కాస్త రెకమండ్ చేయమని"

"మంచిదే... మన ప్రయత్నానికి మరి కాస్త పట్టు దొరికినట్టవుతుంది. తరువాత ఎల్లుండి ప్రభుత్వ కార్యక్రమం ఆరంభించ డానికి కలెక్టర్‌గారు ఇక్కడికి వస్తున్నారు. ఆయనతో మాట్లాడి... హరిజనవాడలో అంగన్‌వాడి సెంటర్ మంజూరు చెయ్యించుకుందాం" మోహన్‌రెడ్డి చెప్పాడు.

ఇంకాసేపు మాట్లాడాక చంద్రకళ ఇంటికి బయలుదేరింది.

ఆ మోరల్ సపోర్ట్ ఆమె వూహించని విషయం. తనేదో ఆవేశంలో ఆవేదనలో చేసిన తిరుగుబాటుకి... ఇటువంటి ఆలోచనా... ఒక ప్రణాళికా తోడవుతుందని ఆమెకు తెలీదు. అందుకే గాల్లో తేలుతున్నట్టు నడుస్తోంది.

వాడ మొగసాల్లోనే ఎదురయ్యారు.. ఆమె కోసం ఆత్రంగా చూస్తున్న నాగరాజూ.. వీరయ్యా..ప్రెసిడెంటు పిల్లనెందుకు పిలిచాడో... జరిగిందానికి ఏం కేకలేశాడో.. అని వణికిపోతున్నారు. వెళ్లేప్పుడు తోడొస్తామంటే చంద్రకళే వద్దంది. అందుకే.. అక్కడ కాపేసివున్నారు.



దార్లో నడుస్తూ జరిగింది చెప్పిందామె.

"మనకియన్నీ వద్దు సెంద్రమ్మా. ఈ పెద్దోల్ల మాటలంత గొప్పగా ఆరి మనసు లుండవ్. ఈ యవారాలన్నీ ఒగ్గేసి నువ్వెలిపో"

చంద్రకళ నాగరాజు మాటలు పట్టించుకోలేదు. ఆ సాయంత్రం తీరుబడిగా కూర్చుని ఉత్తరం రాసింది తండ్రికి.

ప్రియాతి ప్రియమైన నాన్నకి,

నాకిక్కడ చాలా బాగుంది. ఇంకొన్నాళ్లు ఉండదలుచుకున్నాను. పెదనాన్న.. అన్నయ్య నన్ను కంటికి రెప్పలా చూసుకుంటున్నారు. వూరు చాలా బాగుంది గాని ఇక్కడ కులవ్యవస్థే మరీ కుళ్లుకంపు కొడుతోంది. కాస్త సాంబ్రాణి పొగ వేద్దామని ప్రయత్నిస్తున్నా. నా ప్రయత్నానికి సాక్షాత్తూ ప్రెసిడెంట్‌గారే చేయూతనిస్తున్నారు. ఎప్పుడూ నువ్వు అంటుంటావ్ చూడు.. 'ఎడ్యుకేషన్ ఫర్ లైఫ్' అని. దాన్ని మోటివ్‌గా తీసుకుంటున్నా. సామాజిక పరమైన కొన్ని మౌలిక మార్పుల్ని..."

"నా మాటినుకో తల్లీ" ఉత్తరం రాయడం ఆపి నాగరాజు కేసి చూసింది.

"పట్నంలో మారానిలా ఉజ్జోగం చేసుకుంటా కాలిమీన కాలేసుకుని బెతకాల్సిన పిల్లవి. నీకీ తిప్పలేంటికి జెప్పు? మన ఎదవలు ఇయ్యాలా రేపు నీ మాటిని... రైతుల సేలల్లో కూలినాలి మాన్తరేమో గాని.. నాల్గు దినాలు బోయినంక కడుపులు సురుక్కుమంటే.. ఇంగ నీమాటిన్రు. ఎప్పట్లా బొయి... ఆల్ల కాల్లకు మొక్కి ఆల్ల మోసేతి నీళ్లు తాగుతరు..."

"పెదనాన్నా" విసుగ్గా అడ్డుకుంది. "అలా అయినరోజు నేనే వెళ్లిపోతాను. సరేనా? అంతవరకూ మాత్రం నన్ను ఆటంకపరిచినా... ఇక్కడి విషయాలు నాన్నకు తెలియజేసినా... నేను నీ కూతుర్ని కానట్టే లెక్క. నన్ను చంపేసి

నంత ఒట్టు"

మళ్ళీ ఉత్తరం రాయటంలో మునిగిపోయిందామె.




ఘల్లు ఘల్లుమన్న పాంజేబుల సవ్వడి... గుప్పుమంటున్న విరజాజుల సువాసన...

రాజు కర్థమైంది, వచ్చేది చాముండేశ్వరని. ఆమె ఎప్పట్లా ఓ మెట్టుదిగువ నిలబడి పిలిచింది "అన్నయ్యా"

అంతకు అయిదు నిముషాల క్రితమే ఇప్పుడే వస్తానంటూ చక్రధర్ డాబా దిగి వెళ్లాడు. రాజు ఒక్కడే రెండు చేతులూ తలకింద పెట్టుకుని వెల్లకిలా పడుకుని ఆకాశంలో చందమామకేసి చూస్తున్నాడు.

"అన్నయ్యా" మళ్లీ పిలిచిందామె.

ఇక తప్పదన్నట్టు లేచాడు రాజు. మెట్ల దగ్గరకి వచ్చాడు.

"చెక్రీ... కిందకొచ్చాడు"

"తెలుసు" చెప్పిందామె.

రాజు ఆశ్చర్యంగా చూశాడామెకేసి. మెట్ల పక్కగా ఉన్న కొబ్బరి చెట్టు మట్టల మీదపడిన వెన్నెల రేఖలు చాముండి శిగపాయల మీదకు వెండి దారాల్లా జారుతున్నాయ్. ఆ కాంతిలో గాలికెరటాలకు కదలాడే ముంగురులు జిగజిగమంటున్నయ్.

"అన్నయ్య కిందకి రావడం చూసే... నేనిక్కడికి వచ్చాను" మాటే కర్తవైనట్టు తనవంకే చూస్తున్న రాజుతో అందామె.

"ఎందుకు? " అప్రయత్నంగా అడిగాడు. తర్వాత అనుకున్నాడు ఎందుకడిగానా అని.

"ఎందుకంటే.. రేపట్నుండీ మంచినీళ్లలో పంచదార కలపాలా.. కారప్పొడి కలపాలా అనే విషయం అడిగి తెల్సుకుందామని!"

"రెండూ వద్దు. పంచదార కలిపితే డయాబెటిస్... కారం కలిపితే బ్లడ్ప్రెషర్... ఎందుకా తలనొప్పి? మామూలు మంచినీళ్లే ఇవ్వండి చాలు"

"ఇవ్వను" బుల్లెట్లా దూసుకొచ్చిందా మాట ఆమె నోటివెంట "మీరు ఎస్సంటే పంచదార. నో అంటే కారప్పొడి... అంతేగాని ఇక్కడ నీకు మామూలు నీళ్ల మాత్రం దొరకవ్ గాక దొరకవ్"

"ఎస్సేమిటీ? నో ఏమిటి? " అయోమయంగా అడిగాడు.

ఆమె చివుక్కున తలెత్తింది. అలా ఎత్తుతున్నప్పుడు ఆమె మెడవంపులో పడి ఒక చంద్రకిరణం తళుక్కుమంది.

"ఫెంటాస్టిక్" చెప్పాడతను.

"ఏమిటి? "

"వె... వెన్నెల"

"అస్సలు సరసం తెలీదు" చెప్పిందామె.

"ఎవరికి? "

"చంద్రుడికి"

"అతను నిశ్శబ్దంగా ఆమెకేసి చూసి మళ్లీ అడిగాడు. ఇందాకేదో ఎస్సూ.. నో.. అన్నారు? "

"మరీ ఏమీ ఎరగనట్టు మాట్లాడకండి. ఉదయం మా బామ్మ మీతో మాట్లాడలేదూ? "

"ఓ౦.. ఆ విషయమా? " అప్పుడే గుర్తు తెచ్చుకున్నట్టు అన్నాడు. "జాతకాలవీ కుదరాలికదండీ. మనం మనం అవుననుకుంటే సరిపోతుందా? ఆ బ్రహ్మ అనుకోవాలి మరి మనిద్దరికీ ముడిపెట్టాలని!"



ఇంత మాత్రానికే మనం ఇదేదో దైవ ఘటన అనుకోవడం పొరబాటు"

''కానీ...''

చాముండి తలెత్తి అతనికేసి చూసింది.

"నేనలాగే అనుకుంటున్నా"

ఈసారి చంద్రకిరణం ఆమె కళ్లలో పడి... ప్రతి ఫలించింది. ఆ వెలుగులో... ఆమె కనుకొలుకుల్లోంచి రెండు కన్నీటి ముత్యాలు ఛమక్ వంటరావౌంసన్నా ...చెక్కిళ్ల మీదుగా కిందకు జారిపోయాయి.

"ఛ... కన్నీళ్లెందుకు?"

"ఎందుకంటే... నేను... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నా కాబట్టి. మీరు లేకుండా బతకలేను కాబట్టి... మీతో నా పెళ్లి జరక్కపోతే... నేను చస్తాను కాబట్టి..."

"ప్రేమా?" అతను తెల్లబోయినట్టు చూశాడు. "నేను మీ ఇంటికొచ్చి... పట్టుమని వారం రోజులు కాలేదు. అంతలోనే ఎలా ప్రేమించారండీ?"

"మనసులో ప్రేమ పుట్టడానికి ఒక్క క్షణం చాలు" చెప్పిందామె.

"నిజమే అనుకోండి. కానీ నాదొక్కటే భయం ఖర్మకాలి మన జాతకాలు..."

"కుదురుతాయ్... మీరన్నారే బ్రహ్మ... తప్పకుండా కలుపుతాడు. నాకా నమ్మకం ఉంది. నేను పూజించే దేవుడు నాకు

"కచ్చితంగా అనుకుంటాడు. అసలాయన అనుకోబట్టే..." ఆగిందామె.

"అనుకోబట్టే?" రెట్టించాడు.

చాముండి ఓసారి అతని కళ్లలోకి చూసి రెప్పలు దించుకుంది. "అనుకోబట్టే మిమ్మల్ని నాకు పరిచయం చేశాడు"

"పరిచయాలదేముందండీ... లక్షా తొంభైమంది పరిచయమవుతుంటారు.

అన్యాయం చెయ్యడు"

"ఒకవేళ కుదరకపోతే? "

"కుదురుతాయీ... కుదురుతాయీ... కుదురుతాయి" ఆమె కాస్త గట్టిగా అన్నది.

"చెక్రీ వస్తున్నట్టున్నాడు" చెప్పాడతను.

"చెప్పండి... నీళ్లలో..."

"పంచదారే కలపండి"

"ని... నిజంగా!" ఆమె చక్రధర్ వస్తున్నాడేమోనని వెనక్కి వెనక్కి చూస్తోంది.

"చెక్రి... ఇంకా వస్తున్నట్టు లేదులెండి. గమ్మత్తుకన్నాను. నిజంగానే చెప్తున్నా పంచదారే కలపండి."

ఆమె చెంపలమీద తెలి వెన్నెల సిగ్గుతో ఎర్రబడింది.

"మీరలా అంటారని నాకు తెలుసు. అందుకే... ముందుగానే పంచదార కలిపి తెచ్చాను. అన్నయ్య నిజంగానే వస్తున్నట్టున్నాడు. మీరెళ్లి పడుకోండి. కూజా వాడి చేతికిస్తాను."

"పెళ్లినాటికి షుగర్ పేషెంట్ నయితే మాత్రం ఆ పాపం మీదే. నేవెళుతున్నా"

రాజు వెళ్లిపోయి గప్‌చుప్‌గా చాపమీద పడుకున్నాడు.

"ఏం చేస్తున్నావే ఇక్కడ చీకట్లో?" చక్రధర్ చకచక మెట్లెక్కి వచ్చాడు.

"అరగంట నుంచీ చూస్తున్నా నీ కోసం నువ్వేం చేస్తున్నావో కింద?"

చక్రధర్ చేతికి కూజా ఇచ్చి చాముండి రెండుమెట్లు దిగింది.

"వాడి చేతికిచ్చి వెళ్లొచ్చుగా. ఇంట్లో మనిషిలా ఉన్నాడే! మరీ అంత సిగ్గేమిటి? అయినా బ్రహ్మరాక్షసివి... ఈ నంగి వేషాలేమిటి? "

"నోరు మూసుకుని వెళ్లి ఓ గ్లాసు నీళ్లు తాగు" చెప్పి వెళ్లిపోయింది చాముండి.

రాజు మెల్లగా నవ్వుకున్నాడు.

తనకు తెలుసు.. ఓ మగాడి ముందు ఓ స్త్రీ సిగ్గు ప్రదర్శించిందీ అంటే... ఆమెలో అతగాడు ప్రకంపనాల్ని సృష్టించినట్టే అర్థం.

'నువ్వు నాకు నచ్చావ్' అని చెప్పడానికి ఉపయోగించే భావస్ఫోరకమైన సంజ్ఞే సిగ్గు.

"ఒరేయ్ వెర్రినాగన్నా.. నీ చెల్లాయి సిగ్గులకర్థం నీ ముఖానికేం తెలుస్తుందిగాని.. ఆమె చెప్పినట్టు ఓ గ్లాసు నీళ్లు తాగి నోరు మూసుకుని పడుకో"

అలాగని తనంటే.. చక్రధర్ ముఖం ఎలా అవుతుందో ఊహించుకుంటూ పైనే పక్కున నవ్వేశాడు రాజు.

★ ★ ★

"యమ్మా సెంద్రమ్మ! నానో వూసు చెబుత. యామనుకోబాక. ఆల్లు మనల అంటగూడదన్నేరని... రోసపడి నువ్వు ఆల్లని మనం అంటగూడదూ... ఆల్లసేలల్లో పన్జెయ్య గూడదూ అంటివి. అంత అనకా బాగానే వుండేదిగాని... ఎల్లకాలం ఇట్టాగ ఎల్లమారి పోద్దటవా. తిండికి లేక సచ్చేటోల్లం మనమూ, తిన్నదరక్క దిరిగేటోల్లు ఆల్లయిపోయిరి. అట్టాంటోల్లతో మా అసుమంటి మట్టి బిసుక్కునేటోల్లకి ఏంటికంటా పంతం జెప్పు? "

చంద్రకళ చివ్వున తలెత్తింది. ఆమె పెదవులు ఏదో చెప్పాలన్నట్టు కదిలాయి గాని మాటలు వెలికిరాలేదు.

తనలోని పట్టుదలను సవాలు చేస్తున్న ఆ ప్రశ్నకు తన దగ్గర సమాధానం ఉందా?

"ఆ గవురుమెంటోడు పైసలిస్సేదీ నిజవేc... ఈ బీడు భూములు బోరు బాయిలేసేడిదీ నిజమేc... ఈడ మనం దుక్కీ దున్నీ... ఇత్తనాలు జల్లీ... అయ్ మొలిసి పండీ మన కడుపులు నిండెడిది నిజవే... ఏంటికమ్మా.... కూటిగుడ్డకు కొరగాని ఈ తకరాదలు? మీ సదూకున్నోల్లు ఏటో సెబుతరు. అయ్యన్నీ ఇను

కుంటా కూకుంటే మా పిల్లోల్లు గంజి దొరక్క నీలుక్కోని సత్తరు. ఆనాడాల్ల పేనాలు నువ్వూ నేను మల్లదెస్తమా? "

పోనీ... ఈ ప్రశ్నకైనా జవాబుందా తన దగ్గర?

"ఆల్లకు పనిగావాలె. మాకు తిండిగింజలు గావాలె"

ఇంటర్ డిపెండెన్స్!

వీళ్ల సర్వీసు వాళ్ళకవసరం. వాళ్ళ సహాయ సహకారాలు వీళ్లకవసరం. వీళ్లూ వాళ్లనేమిటి? మానవజాతి యావత్తూ ఒకరి మీద ఒకరు ఆధారపడే బతికేస్తున్నారు. స్నేహాన్ని, బంధుత్వాన్ని కలుపుకోవడానికీ అడ్డొచ్చే కులాలు ఒకరి శ్రమను దోచుకోడంలో మాత్రం అడ్డురావు.

వర్టికల్ యూనిట్ వెల్లివిరుస్తుందిక్కడ. నువ్వు లేకుండా నేను మనలేను. అన్న సత్యం ఆవిష్కరించబడుతుంది.

"మారాజుల్తో బెట్టుకున్నెమా మస్సై పోతం. మనమెంతా... మన బతుకెంతా? ఆల్ల మోసేతి నీల్లు దాగి ఆల్ల కాల్లకాడ పడుండేవోల్లం".

ఈ ప్రశ్నకు జవాబు తన దగ్గరుందిగాని విని అర్థం చేసుకునే స్పిరిట్ వాళ్లకు లేదేమో! నాన్సెన్స్... ఒకరి మోచేతి నీళ్ళు ఇంకొకరు తాగడమేమిటి?

ఒకరు పని చేస్తున్నారు. ఇంకొకరు ప్రతిఫలాన్ని ఇస్తున్నారు.

జస్ట్.... అదో మ్యూచ్యువల్ హెల్ప్ అంతేగాని మోచేతులేమిటో... నీల్లేమిటో? డర్టీ యూసేజ్.

"ఇదోరా..నువ్ పాపం జేసినవ్.. అంతి కని.. తక్కువ జాతిలో బుట్టు.. అంటా మనల బుట్టిచ్చినోడు ఆ భగమంతుడు. దానికి ఈ దొరల్ని అనీ ఏం సుకం? "

ఐ పిటీ యు.. ఎంత పిచ్చిలో బతికేస్తున్నారు! కులాల్నీ మతాల్నీ దేవుడికంటిస్తున్నారా? అన్యాయం, ఫర్ యువర్ కైండ్ ఇన్‌ఫర్మేషన్.. ఈ కుల వ్యవస్థకు సృష్టికర్త మానవుడే. అతగాడి మెదడులోని లోపభూయిష్టమైన కొన్ని కణాలలో రేగిన మురికి ఆలోచనల మలిన సారమే ఈ కేస్టిజమ్ అని చెప్పాలని.. కాదు అరవాలనుంది తనకు. కానీ ఈ సిద్ధాంతం.. వాళ్ళకర్థం కాదు.. అర్థం కాకా.. అర్థం చేసుకోలేకా కాదు. కేవలం అర్థం చేసుకునేందుకు ప్రయత్నించకపోవడం. ప్రయత్నించాలంటే ఓపికుండాలి. ఓపికుండాలంటే ఆహారం కావాలి. ఆహారం దొరకాలంటే ఆర్థిక స్థోమత ఉండాలి. ఆ స్థోమత వీళ్లకు లేదు. అందుకే పనిచేస్తారు. పరాధీనులవుతారు... ఆత్మగౌరవాన్ని కుంచెడు గింజల కోసం తాకట్టు పెడతారు... అవమానం మనసునూ, ఆకలి కడుపునూ దహించివేస్తుంటే.. మొదటిదాన్ని ఆర్పటం చేతగాదు కాబట్టి రెండోదాన్ని ఓ మూకుడు గంజి నీళ్లతోనో... ఓ ముద్ద నూకల సంకటితోనో ఆర్పుకుంటారు.

ఆనక పడిన కష్టం మరిచిపోవటానికి కంటినిండా నిద్ర పట్టిస్తారు.

ఆ నిద్రలో ఓ కల... ఆ కలలో... ఇంతవరకూ అనుభవించని... ఇంకెప్పటికీ అనుభవించలేని ఒక సుఖానుభూతి... ఆ అనుభూతికి సాకారం... జాతి, మత, కుల, వర్గరహిత సమాజం.

అక్కడ ఇంటర్ డిపెండెన్స్ వుంటుంది గాని దాని స్వరూపం... పరస్పర సహకారం. శ్రమకు తగ్గ ప్రతిఫలం లభిస్తుంది. ఎక్స్‌ప్లాయిటేషన్ కనబడదు.

బానిస భావం లేదు.. యజమాని అన్న అహంభావం లేదు. మనుషుల మధ్య అంతరాల్లేవ్ అభిమానాలు తప్ప... ద్వేషం లేదు రాగం తప్ప...

"సెంద్రమ్మా... ముసలయ్య... ఊళ్ళోని బాయిలో బడి సచ్చిపోయినాడంట."

యుటోపియాలోంచి చంద్రకళ మనసు

జర్రున వెనక్కి జారింది. ఆ వేగానికి గుండె దడదడ కొట్టుకోవటం మొదలైంది.

నిన్న సాయంత్రం నిర్వీర్యులై తనను నిలవేసి అంటరానివాళ్లమన్న బాధకన్నా.. మాకు ఆకలి బాధే ఎక్కువని.. ఘంటాప థంగా చెబుతున్న వాడ జనాన్ని...

"సిగ్గూ లజ్జా లేదురా మీకు... పోంఢ్రి... ఆల సేలల్లో దిగబడి వంచి న్నడుం ఎత్తకుండా పన్జెయ్యండ్రి... ఆల్లు 'యాక్‌థూ' అని మొకాన వూచ్చే వూపిచ్చు కోండ్రి చేయ్... ఛేయని కుక్కల మోస్తిర అదిలిస్తా... ఎంగిలి పిడసలు పడేత్తే ఆవు రావురని దినుకోండ్రి...

థూ.. ఎదవ నాకొడకల్లారా! మానం బోయినాక పానమేంటికిరా? అడక్కదినే నాయాలకైనా అపిమానం, గవరం వుండాల.

ఏం.. తిండి లేకబోతే సస్తమా? సస్తే చావుండ్రి. కక్కిన కూటికి ఆసపడబా కండ్రి. కుక్కలు బెతికినటు బెతక బాకండ్రి.

ఆ మాతల్లి.. సెంద్రమ్మ.. అమ్మోరిలా వచ్చి కల్లు తెరిపిచ్చింది. ఇంగ మల్ల మూసుకోబాకండి. మన సెమట సుక్కల్నే ఆరగిస్తా.. మనల అంటరానోల్లంటా ఉండారు ఆ సాములు. ఆల్ల పంచలమ్మిడి పడిగాపులు బడగాకండ్రి.. సెంద్రమ్మ తల్లి సెప్పినట్టు ఇనుకోండ్రి. మనం గాకపో యినా మన పిలగాండ్ల అయామన్నా బాగుపడతది. ఆల్లన్నా మారాజుల్లా బెతు కుతురు."

నిన్న సంధ్యవేళ ఇలాగే కదూ అన్నాడు ముసలయ్య.

నిస్తేజమవుతున్న వాడజనంలో ఆ మాటలు కాస్త ఉత్తేజాన్ని కలిగించడం... తను గమనించింది.

'కూలికెళ్లకపోతే మాకు తిండిగింజలెలా' అని వాడజనం తనను నిలేసినప్పుడు.. ఏం సమాధానమివ్వాలో తెలీక తను సత

## కొత్తగాలి...

**అంతా తానే అన్నప్పుడు**
**ద్రౌపదికి**
**చీర విప్పడమెందుకు?**
**ఇవ్వడమెందుకు?**
**కోతికొమ్మచ్చి కాకపోతే?!**

*– లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం*

మతమౌతున్నవేళ.. ఏ తటపటాయింపూ లేక 'ఇదిరా మీ మార్గం' అని తెగేసి చెప్పిన ముసలయ్య తెల్లారి పాటికి చనిపో యాడంటే నమ్మశక్యం కావడంలేదామెకు.

ఇది హత్యా? ఆ వృద్ధుడ్ని హత్యచేసే అవసరం ఎవరికుంటుంది?

పోనీ.. ఆత్మహత్యా?

అతనికా పరిస్థితి ఎందుకు వస్తుంది?

మరి పొరపాటా?

అసలు పొరపాటు జరగటానికి వీల్లేదే! రాత్రివేళ వూరు మాటుమణిగి నిద్రిస్తున్న ప్పుడు ముసలయ్య వూళ్లోకెందుకెళ్లాడు? వెళ్లినవాడు బావిలో ఎందుకు పడ్డాడు? కాలుజారి పడ్డానికి అది నేలబావీ కాదు... కనబడకపోవడానికి ముసలయ్య చూపుకు ఢోకాలేదు.

మరెందుకిలా జరిగింది?

వాడజనం గుంపులు గుంపులుగా ఊరి వైపు పరిగెత్తినట్టే వెళుతున్నారు.

★ ★ ★

ముసలయ్య శవాన్ని బావిగట్టు మీద పడుకోబెట్టారు రాత్రి ఏ వేళప్పుడు పడ్డాడో.. ఎన్ని నీళ్లు తాగాడోగాని శవం బాగా ఉబ్బిపోయి వుంది.

ఊరూ వాడా అంతా ఏకమైనట్టు దడి గట్టి నిలబడ్డారు శవం చుట్టూ.

బావిలో దిగి ముసలయ్య శవాన్ని బయటికి తీసిన వీరయ్య.. గుంపుకు

**కొత్తగాలి...**

**పాండవులైనా, కౌరవులైనా**
**ఆడదాని విషయంలో మగాళ్లే!**
**ఒకరు జూదంలో పణంగా పెడితే**
**వేరొకరు చీరలూడదీశారు!!**

*– ప్రభాకర్ తల్లాప్రగడ, హైదరాబాద్*

దూరంగా ఓ రాతిమీద కూర్చుని ఒళ్లూ తలా ఆరబెట్టుకుంటున్నాడు.

"ఓరీడి దుంపదెంచ... సచ్చేటోడు ఇంకే డన్నా బడి సవ్వక పెద్దకులపోల్ల మంచి నీల్ల బాయిల బడిండే" ఒకరన్నారు.

"ఇంకేం బాయీ... ఇంకేం నీల్లూ!" ఇంకొకరు నిట్టూర్చారు.

ఎస్.ఐ.. వాడజనాన్ని ఉద్దేశించి అడిగాడు.

"ఏంరా.. రాత్రేమైనా గొడవలు జరిగినయ్యా? ఎవురు.. ఎవరీ ముసలోడ్ని చంపింది? "

"అదేంది సారూ.. మా ముసిలయ్య తాతను మేము జంపుకుంటమా? ఆ ముసిలోని మీన మాకేంకచ్చ? "

అలా చెప్పినవాడ్ని డొక్కలో లాఠీతో పొడిచి అడిగాడు ఎస్.ఐ. మళ్లీ, "పోనీ... ఈ ముసిలోడేమైనా ఊరిజనంతో గొడవపడినాడా? "

"లేసామె" వాడు తల గోక్కున్నాడు.

"గొడవ జరిగినాదంటున్నాడే పెద రెడ్డి? "

"అవున్సార్ జరిగింది" అంది చంద్రకళ.

ఎస్.ఐ. చంద్రకళని పైనుంచి కింది దాకా ఓ సారి చూశాడు. చూసి అడిగాడు "ఆ గొడవక్కారణం నువ్వేనంటగా"

"అవును"

"ఇంతకీ ఏం జరిగినాది? "

"గొడవ జరిగిందని చెప్పిన పెద్దరెడ్డి గారు.. ఆ గొడవేమిటో చెప్పలేదా సర్? "

"అది నీకు అవసరం లేదు. నువ్ చెప్పేది నువ్ చెప్పు"

"సరే వినండి. ఈ బావిలోంచి నేను ఓ బిందె నీళ్లు తోడుకెళ్లాను. బావి మైలపడిపోయిందని ఊరు ఊరంతా బాధపడిపోయారు. మమ్మల్ని అవమానకరంగా మాట్లాడారు. అదేమని అడిగితే... మా వాడలోకొచ్చి మా మనుషుల్ని కొట్టారు. ఇది అనాగరికం... అని చెబుతున్నా వినకుండా... బావికి పూజలు పునస్కారాలూ చేయించాలన్నారు. మేమూ ఈ సభ్యసమాజంలో మనుషులమేననీ...నాకు తోచినరీతిలో వాదించాను. వాళ్లు వినిపించుకోలేదు. జలశుద్ధి కార్యక్రమమట... నిర్వహించారు. మాకూ ఆత్మగౌరవం ఉంటుంది కదండీ.. అందుకే మమ్మల్ని అంటరానివాళ్లన్న వీళ్లని మేమూ అంటకూడదని నిర్ణయించుకున్నాం. వాళ్లకు చెందిన చేలల్లో కూలీనాలీ మానేశారు మావాళ్లు. ఇంతే జరిగింది".

ఎస్.ఐ ఏదో స్ఫురించినవాడిలా చూశాడామె వైపు. "అర్థమైందిలే యవహారం. మనసులో బెట్టుకుని దెబ్బకు దెబ్బా తీసినారు. ఈ ముసలోడ్ని దెచ్చి నీళ్లల్లో ఏసి.. 'మీ యవ్వ ఇంగేంజేస్తర్రా... ముట్టుకుంటేనే మైలబడినాదంటిరి. ఇప్పుడా బాయిలో మా కులపోడు చచ్చినాడు. ఏం జేస్తరూ' అని సవాలేస్తున్నారు. ఆహా... ఏం స్ట్రాటజీ!"

"మిస్టర్... ఇన్‌స్పెక్టర్" చంద్రకళ కళ్లు ఎరుపురంగులోకి తిరిగాయి. "మానవత్వం లేని మృగాల్ని టీజ్ చెయ్యడానికి.. మా మనిషినే చంపుకునేంత నీచులం కాదు మేము.. కేసును పక్కదారి పట్టించడానికి ప్రయత్నించకండి. అమాయకుల మీద అభాండాలు వేసి మీ అగ్రకులాల వాళ్ల కొమ్ముకాయకండి..."

ఎస్.ఐ. అక్కడున్న ఊరి పెద్దలకేసి

చూసి గుంభనంగా నవ్వాడు.

"సెంద్రమ్మా... ఎస్సయ్య మనోళ్ల ఇలాకే. ఆయినా మనలాగా అరిజనుడే"

నోరు తెరిచేసింది చంద్రకళ.

మరి ఆయనెందుకలా అగ్రకులాల వారి రెప్రజెంటేటివులా మాట్లాడుతున్నాడు?

"ఏం రాజకీయం... ఏం రాజకీయం! రథసారథి నువ్వేనా ఏంది? "

ముఖం చిట్లించి చూసింది అతనికేసి చంద్రకళ. ఆమె ఏమనేదో గాని వెంటనే అతనే అడిగాడు, "ఈ ముసిలోడికెవరూ లేరా? "

"ఎందుకు లేరు? "

"పిల్లల్లేరు గాని... భార్య ఉంది!"

"అవునూ ఓబులవ్వేది? "

ముసలయ్య చావు వార్త వినగానే... వాడవాడంతా పరిగెత్తుకొచ్చింది... మరి అతని ప్రాణానికి ప్రాణమైన భార్య రాలేదెందుకని? రాలేని మనిషి కూడా కాదే! ఇప్పటికీ కూలీనాలీ చేసి మొగుడ్ని కూర్చో బెట్టి సాకేటంత హుషారుందామెలో.

"అన్నయ్యా.. మనవాడకెళ్లి.. అవ్వెం దుకు రాలేదో చూసిరా"

ఆమె నోట్లో మాట నోట్లో ఉండగానే పరుగెత్తిపోయాడు వీరయ్య.

అతని పరుగు ముసలయ్య గుడిసె ముందు ఆగింది. తడిక తలుపు నెట్టబోతు న్నప్పుడు కనబడింది... దాని చిలుకు నుంచి వేళ్లాడుతున్న తాళం బుర్ర.

"అవ్వేడకు బోయిందబ్బా! కొంపదీసి... ఆ బాయికాడ గుంపులోనే ఉండాదా యాంది"

వెనక్కి తిరిగి రెండడుగులేశాక వినబ డింది గుడిసెలోపల ఎవరో సన్నగా మూలుగుతున్న ధ్వని.

"ఎవరబ్బా లోన? ఓబులవ్వగాదు గదా!" అనుకుంటూ... తాళంబుర్ర పట్టు కుని ఒక్క గుంజు గుంజాడు. చిలుక ఊడి చేతికొచ్చింది. తలుపు నెట్టి లోపలికి తొంగి చూశాడు.

> ## కొత్తగాలి...
>
> **రావణుడైతేనేం**
> **రాముడైతేనేం**
> **ఒకడు చెరబట్టాడు**
> **మరొకడు అగ్గి పెట్టాడు**
>
> *–ఉమాబాల, దోమలగూడ, హైదరాబాద్*

అప్పుడప్పుడే ఉదయిస్తున్న సూర్యకిర ణాలు గుడిసె చూరులోంచి లోపలికి పడు తున్నాయి. ఆ వెలుగులో కన్పించిన దృశ్యాన్ని అతను బ్రమ్నపడినట్టు చూశాడు.

పడుకున్న నులక మంచానికే చేంతాడుతో కాళ్లూ చేతులూ కదలకుండా అంటగట్టి, ఓబులవ్వ నోట్లో కుక్కిన తుండుగుడ్డ.. ఆమె బాగా పెనుగులాడ్డం వల్లనేమో సగం వరకూ బయటపడి, చెవి పక్కగా వేలాడుతోంది. మిగతా సగం నోట్లోనే ఉండిపోవడంతో మూలుగు తప్ప మాట్లాడే వీలు లేకుంది.

వీరయ్య ముందు చేసిన పని ఆమె నోట్లోంచి తుండుగుడ్డ లాగెయ్యడం "ఇదే మిటి అవ్వా... ఎవర్జేసిండ్రీ పని? " అడుగు తూనే ఆమె కాళ్లకూ చేతులకూ కట్టిన తాళ్లను విప్పదీస్తున్నాడు వీరయ్య.

ఓబులవ్వ ఏం చెప్పకుండా భోరున ఏడ్చేసింది. వీరయ్య తాడు రాపిడికి వరు సుకున్న ఆమె మణికట్లనూ... కాలి గిల కల్నీ కాసేపు సవరదీశాడు.

"సెప్పవ్వా... ఏడవమాకు"

వీరయ్యక్కూడా ఏడుపు తన్నుకొస్తోంది ఓబులవ్వను చూస్తుంటే! ఓబులమ్మకింత వయసొచ్చినా మొగుడంటే భలే మురిపం. పిల్లాపీచు లేకపోవడం వల్లనేమో... ఆమె గుండెల్లో ప్రేమంతా పెనిమిటి మీదకు మళ్లించుకుంది. పెళ్లాల్ని కూర్చోబెట్టి సాకే

మొగుళ్లుంటారుగాని... మొగుణ్ని కూర్చో బెట్టి సాకే పెళ్లాం ఓబులవ్వ. దానిక్కారణం కూడా ఉంది. ఐదారేళ్లక్రితం ముసలయ్యకు గుండెపోటు వచ్చింది. అప్పట్నుంచి మరీ అపురూపంగా చూసుకుంటుంది ముసలయ్యను. "నే బోతున్నగా కూలికి. ఇద్దరం సంపాదిచ్చి ఎవురికి బెట్టాలేంది? నువ్ కట్టబడకబోతే... కొంపలేం మునిగిపోవులే నువ్వట్టగూకోయే" అంటూ అతను పనికిపోకుండా అడ్డుపడేది.

ఉన్నంతలోనే కమ్మకమ్మగా వండి... పసిబిడ్డకు తినిపించినట్టు తినిపించుకునేది. ప్రతిరోజూ తలకి చముర్రాసి నున్నగా దువ్వి... చుట్టల కట్ట చేతికిచ్చేది... గుడిసెముందున్న మట్టి అరుగు మీద కూర్చుని... వచ్చిపోయే వాళ్లతో... ముసలయ్య మాట్లాడుతుంటే... కళ్లనిండుగా చూసుకునేది.

"యాందవ్వో... గుండినొప్పి మడిసికి సుట్ట పీకలిస్తుండవ్. తొరగా సవ్వనీకా?" అని వాడలో వాళ్లెవరైనా పరాచికాలాడితే ఆమె కళ్లలో నీలినీడలు ముసురుకునేవి.

"యాంజెయ్ మంటావ్రా అబ్బయ్యా? సుట్టపీక దొరక్కపోతే... గమ్మునుండే గటమేనా మీ తాత? నన్ను పన్లోకి వంగనిచ్చి గప్పిచిప్పిగా శెనిక్కట్టిరవనో.. సొప్పుకో, తలకో బొయ్యి, సంపాదిచ్చి మరీ కొంటద్రా... మీ తాత. అందికే... కూలికి బోకుండా ఆపడానికే... ఇసమని తెల్సినా... ఈ సేత్తోనే ఇస్తన్నా సుట్టలు" అంటూ కళ్లు తుడుచుకుంటుంది.

ముసలయ్య ఒళ్లు వెచ్చబడితే తను పథ్యం ఉంటుంది. అతనికి కడుపు నొప్పొస్తే తను గిలగిల్లాడుతుంది.

అతని పట్ల ఓబులవ్వ కనబరుస్తున్న ప్రేమ చూసి ముసలయ్య ఈడువాళ్లు... "యారా శోభనం పెళ్లికొడకా" అంటూ కూకూని పరాచికాలాడ్డం కూడా కద్దు.

అటువంటి ప్రాణసఖుడు మరణిస్తే... ఓబులవ్వ భోరున ఏడువక ఏం మాట్లాడుతుంది? వీరయ్య ప్రశ్నలకు ఏ సమాధానమిస్తుంది!

"యవ్వా ఏడవమాకే... అసలేం జరిగినాదో సెప్పు" అంటున్న వీరయ్యకు చప్పున స్ఫురించింది. అసలింతకీ ముసలయ్య చనిపోయినట్లు ఓబులవ్వకు తెలుసా?

ముసలయ్య మరణించాడనగానే వాడవాడంతా వూరివైపు తరలి వెళ్లింది. తాళం పెట్టున్న ముసలయ్య గుడిసెని ఎవరూ పట్టించుకోలేదు. అసలందులో ఓబులవ్వ వుంటుందనీ ఎవరూ ఊహించలేదు.

"తాత సచ్చిపోయినట్టు... అవ్వకు సెప్పొద్దులే"

వీరయ్య అలా అనుకుంటుండగానే... ముఖం చేతుల్లో కప్పుకుని బావురుమంటున్న ఓబులవ్వ దుఃఖం నుంచి తేరుకుని వీరయ్యకేసి చూసి అంది, "లెగరా... నన్ను తాతకాడికి దీసక పో"

వీరయ్య ఓబులవ్వకేసి తదేకంగా చూశాడు.

"సంగద్దెలిసే వుంటుందేమో! అయినా జనాలంతా ఆగమాగం జేస్తా లగెత్తుంటే అవ్వకి ఇనబడకుండా వుంటదా నా ఎర్రిగాని" అనుకున్నాడు.

అతని అంతరంగం అర్థమైన దాన్లా అన్నది. ఓబులవ్వ "మీ తాత సచ్చిపోయిందురా! ఈ సంగతి నాకు.. అద్దరేత్రి కాడ్నే.. మీ అందరికాడికి ముంగలే దెల్సు"

తెల్లవారుఝామున బావిలో నీళ్లు తోడుకోబోతూ... చేదకు తగులుకొని... పంచె గుడ్డ రావడంతో... శవాన్ని గమనించి... గగ్గోలు పెట్టారు వూళ్లో ఎవరో...

అప్పుడుగాని ఇక్కడ పొక్కలేదా విషయం.

"మరి ఓబులవ్వకు ఇంతకు ముంగలే

ఎట్టా దెల్సు? "

వీరయ్య మనసులోని ప్రశ్నకు బాహాటంగా జవాబు చెప్పింది ఓబులవ్వ. "మీ తాత సవ్వడానికి బోతా నాకు జెప్పే బొయిండు"

★ ★ ★

"అవ్.. కావాలన్జెప్పే.. ఈ బాయిలో బడి సచ్చిండు నా పెనిమిటి. మా కుల ప్పిల్ల ముట్టినాదని నీల్లు శుద్ధి సెయ్యి చ్చిను.. ఇప్పుడేటి జేస్తరో సూద్దారని ఈ పన్జేసిండు.

మనల ఆగమానం జేసినోల్ల మోసేతి నీల్లు మనకొద్దురా అని ఆ సెంద్రమ్మ నెత్తీ నోరు గొట్టుకుంటావుంటే... ఇనిపిచ్చుకోకుండా.. మల్ల ఆల్ల ఎంగిల్లు నాకుతాం అంటా మా వాడ జనం కూలీనాలీకి సిగ్గి డిసి తయారయిపోతంటే... ఓరి సన్నాసుల్లారా ఆకలి కాడికి ఆపిమానం దొడ్డదిరా.. తిండి లేకపోతే నాలాగా సవ్వండ్రిగాని ఆల్లకాల్లకు మొక్కొద్దురా అని సెప్పడానికి ఈ పన్జేసిండు.

పానం కన్నా మానమరేదలె ఎక్కువరా.. అయ్యిడిసి పెట్టుకునే కాడికి ఇట్టా సవ్వడం నయింరా అని సెప్పడానికి ఈ పన్జేసిండు..

యాడ బుట్టిందో.. యాడ బెరిగిందో ఆ సెంద్రమ్మ తల్లి.. మన్తోపాటూ ఈ కంపులో వుంటా.. మన కోసరం... మన గవురం గాపాడ్డం కోసరం.. పాటుబడతన్నాందుకన్నా.. ఆ యమ్మకు సేదోడు వాదోడుగా నిలబడండ్రా.. అని సెప్పడానికీ పన్జేసిండు.."

ఓబులవ్వ కళ్లలో నీళ్లులేవు. ముఖం నెగడులా వుంది. ములసయ్య శవం మీద పడి ఏడవటం లేదామె. అతడి తల దగ్గర మఠం వేసుకుని కూర్చుని పెద్దగొంతుతో మాట్లాడుతోంది.

"ఆపు" చెప్పాడు ఎస్ఐ ఓబులవ్వతో.

తరవాత అతని కళ్లు సడన్‌గా వీరయ్య మీద పడ్డాయి. లాఠీని చూపి గుంపులో వున్న అతన్ని దగ్గరకు రమ్మని పిలిచాడు.

వీరయ్య వినయంగా చేతులు కట్టుకుని.. ఎస్ఐ ముందుకు వెళ్లాడు.

ఎస్ఐ వీరయ్యకేసి మెచ్చుకోలుగా చూసి గమ్మత్తుగా కన్ను మలిపాడు "ముసిల్దాన్ని బాగా మేకప్పు చేసినవే. నువ్వు చెప్పినయ్యి చెప్పినట్టే అప్పజెప్పిందా? ఇంగేమన్నా తేడా వచ్చినాదా? "

"యాంది సామె? " అయోమయంగా తల గోక్కున్నాడు వీరయ్య.

"అదేరా! రేత్రి ఆ ముసిలోడ్ని దెచ్చి ఈడబాయిలో గుదిగట్టేస్తివి. ఆడ ముసిల్దాన్ని... అదే నిజాన్ని... బయటికి రానీకుండా మంచానికి అంటగట్టేస్తివి. నీయవ్వ... చివరికి నేను ఈ ముసిలోనికె వురన్నా వున్నారా అనే తలికి... ఇంగ దప్పుదుగాబట్టి పరిగెత్తుకోవెళ్లి దానికట్లాడ దీసి... చిలక పలుకులు నేర్పి ఇట్లా దీసుకొస్తివి. మొత్తానికి యమా బుర్రరా నీది"

"మిస్టర్... ఇన్‌స్పెక్టర్" చంద్రకళ స్వరం ఆమెకి తెలీకుండానే తీవ్రస్థాయిలో ధ్వనించింది, "అమాయకుడనా... కన్ఫ్యూజ్ చేస్తున్నారు? "

"పాపం... నువ్వు కన్‌ఫూజవుతున్నావ్ లాగుంది... వాడేం గావటం లేదు. నేనడిగేది అక్షరంముక్క పొల్లుబోకుండా అర్ధమైందాడికి"

"నాకూ అర్థమవుతోందండీ. మీరు

---

**కొత్తగాలి...**

**సైన్సు ఎంతగా**
**ఎదిగిందంటే**
**స్వైన్ ఫ్లూ వచ్చినంతవరకూ..**

-సంధ్యశ్రీ చంద్రిక,
జట్నీ, ఒరిస్సా

అసలు విషయాన్ని ఎలా మిస్‌లీడ్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారో..."

"ఆగక్కడ" చంద్రకళ మాటల్ని మధ్యలోనే ఖండిస్తూ అన్నాడు. "నువ్వన్నట్టే నీ అన్న అమాయకుడనుకుంటా... ఆ ముసిలోడిది ఆత్మహత్యే అనుకుంటా... మరా ముసిల్దాన్ని... మంచానిగ్గట్టేసి నోడెవు రంట? దానికదే గట్టేసుకుందా లేపోతే ఆ ముసిలోడే గట్టేసి ఒసే పెళ్లామా... నువ్విడే బడుండు... నేనెల్లి ఆత్మహత్య చేసుకుంటా అనుంటాడా?" ఇన్‌స్పెక్టర్ వస్తున్న నవ్వును ఆపుకోడానికి ప్రయత్నించాడు గాని అతని వల్ల కాలేదు.

"ఆ యవ్వారం నన్నడుగు నేజెబ్తా... కల్లా కపటం ఎరగని ఆ మాతల్లిని నిలేస్తే యాంజెప్పుద్ది?"

ఓబులవ్వ... ముసలయ్య శవం దగ్గర్నుంచి లేచి ఇన్‌స్పెక్టర్‌కి అభిముఖంగా వచ్చి నిలబడింది.

"నా పెనివిటే... నన్ను మంచానికి బిగ్గట్టి... నోట్లో గుడ్డపాతలు గుక్కి తలుపుకు సిలుకుబెట్టి తాలమేసి... ఈడకొచ్చి సచ్చిండు."

ఇన్‌స్పెక్టర్ వెంటనే కల్పించుకుని అన్నాడు "ఇందాక జెప్పిన కతేగా"

"నన్ను పూరాగా జెప్పనీ" ఎందుకో ఓబులవ్వ తూలి ముందుకు పడబోయింది. చప్పున చేతిని ఆసరాయిచ్చి నిలబెట్టింది చంద్రకళ.

మళ్లీ మొదలెట్టిందామె "నిన్న మాయిటాల కూడుదిని పండుకున్నెం. ఒక రేత్రికాడ... నా పెనివిటి ననుదట్టి లేపి కూసో బెట్టిండు. కూసోబెట్టి..."

చంద్రకళ చేతుల్లోంచి ఆమె నేలమీదకు జారిపోయి బాధగా కడుపు పట్టుకుంది.

ఆమె నుదుటి మీద... దట్టంగా అలుముకున్న స్వేద బిందువుల్ని గబగబ కొంగుతో అద్దింది. ఆ పరిస్థితి చూసి ముందుకు రాబోతున్న వాడ జనాన్ని... ఎస్ఐ... వారించాడు.

"ఏమైందవ్వా?" ఆదుర్దాగా అడిగింది చంద్రకళ.

ఏమీ కాలేదన్నట్టు సైగ చేసింది ఓబులవ్వ. ఆపైన అతికష్టం మీద మాటలు కూడదీసుకుంటూ చెప్పసాగింది "ఒక రేత్రి కాడ నన్ను లేపి కూసోబెట్టి- అసే ఓబులమ్మా... మనోల్లు ఉడుకుమీన రొన్నాల్లు సెంద్రమ్మ ఎనకసేరి ఊc... ఆc... అన్నెరుగాని... నాయాల్లు... ఇయ్యాలా రేపూ ఆళ్ల యవ్వారం జూస్తంటీ నీరుగారి పొయ్యేట్టుగున్నారు. ఏదన్నాసేసి... ఈ నెగడారకుండా జూస్తేగాని నా మడుసు శాంతిచ్చదే- అని, గాందీగోరి కాలంలో... ఎంత మంది పానాలిస్తే మనికీ సొతంతరమొచ్చిందో తెల్సా? అని...అనీసి, వారికి నేన్జచ్చి ఈల్లకు తోవ జూపిస్తా అనె. నా కాల్లూ సేతులూ వొనికిపాయె. ఏందయ్యా నువ్‌జెప్పేది అని ఏడిస్తి.. 'యాంలేదే... మనమ్మి దాకినాదని బాయిని సుద్ది బెట్టింద్రుగా.. నేనిప్పుడా బాయిలోకి దుంకి సచ్చిననుకో.. ఎట్టుంటదంటవ్? అటాల్లకీ బుద్ధి జెప్పినట్టుంటదీ.. ఇటు మనోల్లకీ పౌరుసం బోసినట్టుంటదీ.. ఏమంటవ్?' అనె... ముసిలోడ్ని బట్టుకుని 'ఎవురెట్టబోత మనకేంటికయ్యా ఇట్టాటి మంతనాలు సెయ్యకు' అంటిని, మాటినకుండా లేస్తావుంటే కాల్లకడ్డం బడితిని. 'సెప్పినాగదే.. నాయట్టాటి పానాలు కొన్నన్నాబోతేగాని మనోల్లకు మంచి జరగబోదని, నా మాటిని అడ్డు లేయే.. ఈ పొద్దుగాకున్నా... ఇంకో పొద్దయినా గుండి జొబ్బుతోటి సవ్వాల్సిందే... అప్పుడు సచ్చే బదులు ఇప్పుడు సచ్చిన్ననుకో అందిరికీ మేలు జరుగుద్దే' అనె. ఇనకుండా ఇంకా అడ్డం బడుతున్న నన్ను మంచానికేసి అంటగట్టి... నోట్లో గుడ్డలు గుక్కేసి కంట

# గొప్పోళ్ల గోత్రాలు



థెక్లా ఒన్‌స్టాట్ అనే 82 ఏళ్ళ హంగరీ రాకుమారినించి హాలీవుడ్ నటీ నటులు మైఖేల్ డగ్లస్, జెర్రీవాయిస్, షైర్లీ టెంపుల్, జాక్ నికల్సన్, రచయిత ఆర్థర్ హెయిలీ తదితరులకు ఉత్తరాలు వచ్చాయి. తన జీవితంలోకి ఎంతో ఆనందం తెచ్చిన ఆ కళాకారులకి తను పదిలక్షల డాలర్లు ఇవ్వదలచానని, దయచేసి అంగీకరించి ఆ డబ్బునెలా ఇవ్వాలో తెలియచేయమని ఆ ఉత్తరాల్లో ఆమె రాసింది.

షైర్లీ టెంపుల్ జెనీవాలోని స్విస్ బేంక్ అకౌంట్ నంబర్ రాస్తూ, ఏ కరెన్సీలోనైనా ఆ అకౌంట్‌కి బదిలీ చేయమని రాసింది. మైఖేల్ డగ్లస్ తనకు ఆ లెటర్ రావడం సంతోషంగా ఉందని, తన అకౌంటెంట్ రాబెడివాస్ ద్వారా ఆ డబ్బు బదిలీ చేయండని జవాబు రాసాడు.

ప్రైవేట్ ప్లేన్ పంపుతానని, స్విట్జర్లాండ్‌లో కలుసుకుందామని, తన ఫేవరెట్ డ్రింక్స్ ఏమిటో తెలుపాలని ఆ రాకుమారీ జెర్రీ లూయిస్‌కు రాసింది. అతడు ఆ సమాచారం తెలియజేశాడు.

జాక్ నికల్సన్ ఆవిడ ఫోన్ నంబర్ పంపమని, తానే స్వయంగా మాట్లాడతానని జవాబిచ్చాడు. రచయిత ఆర్థర్ హెయిలీ మాత్రం తనకున్న డబ్బుకన్నా ఎక్కువ అవసరం లేదని జవాబు రాశాడు.




నిజానికి ప్రిన్సెస్ థెక్లా అంటూ ఎవరూ లేరు. ఓ జర్నలిస్ట్ ప్రాక్టికల్ జోక్ చేశాడు. అంత డబ్బున్న వాళ్ళకి ఇంకా వచ్చే డబ్బంటే ఆశ ఉంటుందా? లేదా? అని పరీక్షించడానికి ఈ దయగల ప్రిన్సెస్‌ను సృష్టించి ఈ లెటర్స్ పంపాడు.

ఇప్పుడు ఆ మొత్తం ఉత్తరాల అనుభవాలతో 'హౌ టు ఫూల్ ది రిచ్ అండ్ ఫేమస్' పేరిట అతడు పుస్తకంగా తెస్తున్నాడు. ఈ పుస్తకం ప్రచురింపబడేదాకా ఈ జోకర్ పేరు రహస్యమే!

---

నీరు వెట్టుకుంటా ముసిలోడు ఎల్లిపోయిండు. ఎల్లిపోయి ఈడ దేలిండు"

ఈ మాటలన్నీ చాలా కష్టం మీద చెబుతోంది ఓబులవ్వ. చెబుతూ చెబుతూ లుంగలు చుట్టుకుపోయింది.

చంద్రకళకేదో అర్థమవుతోంది. ఆమెకే కాదు అక్కడున్న అందరికీ తెలుస్తోంది, ఓబులవ్వ మరణానికి దగ్గరవుతోందని.

"అన్నయ్యా... డాక్టర్.. డాక్టర్ కావాలి" చంద్రకళ కంగారుగా అంది.

ఓబులవ్వ వద్దన్నట్టు చెయ్యాడించింది. మూసుకుపోతున్న కనురెప్పల్ని బలవంతంగా ఎత్తి తన చుట్టూ మూగిన తన జనానికేసి చూసింది.

"మాన మరేదలు నిలుపుకోడం కోసరం పానాలొగ్గేయ్యండ్రిగాని... యిలువలేని పానాల కోసరం మానం మరేదా వదిలెయ్ బాకండిరా"

ఓబులవ్వ గొంతు బలహీనంగా వున్నా ఆమె మాటలు జనంలో బలంగానే నాటుకున్నయ్.

కళ్లు మూసుకుని, తన ఒళ్లోకి వరిగిపోయిన ఓబులవ్వను తదేకంగా చూసింది చంద్రకళ. ఆమె కనుకొలుకుల్లోంచి జారిన కన్నీటి బొట్లు రెండు టప్‌మని రాలిపడ్డాయ్ ఓబులవ్వ ముఖం మీద.

చివుక్కున కళ్లు తెరిచింది ఓబులవ్వ. అతి కష్టం మీద మాటలు కూడదీసుకుని అంది "మీ తాతకి పోస్టుసారి గుండె పోటొచ్చినప్పుడే.. సిద్దంజేసి పెట్టుకున్నె.. గన్నేరు పప్పులు. ఏ అపరేత్రికాడో.. ముసలోడికేమన్నా అయితే.. ఎంటనే మింగి సద్దామని అట్ట దాపెట్టుకున్నయ్.. ఇట్ట బనికొచ్చినయ్"

మళ్లీ మూతలు పడ్డాయ్ ఓబులవ్వ కళ్లు. వీరయ్యకు చప్పున స్ఫురించింది. తను ఓబులవ్వ కట్లూడదీసి బయటకొస్తున్నప్పుడు... మూలనున్న కుండలోంచి

## కొత్తగాలి...

**ప్రేమ**
**అప్పుడు అపురూపం**
**ప్రేమ**
**ఇప్పుడు ఆసిడ్ రూపం**

– శైలూషి, శ్రీకాకుళం

అవ్వేదో గుడ్డమూట తీసి విప్పి నోట్లో వేసుకుని నీళ్లు తాగడం.

"యాందవ్వా అది" అంటే... "పటికలే నాయినా... దప్పిగ్గుండాది... ఓ పలుకు బుగ్గనేసుకున్నే" అంది.

అంటే... అది పటిక కాదు గన్నేరు పప్పన్నమాట!

★ ★ ★

"కూటిగ్గతిలేని వాళ్లు.. మన పంచల మ్మిట బడి మనం ఇదిలిచ్చిన ఎంగిలి దినే వాళ్లు... ఇంతకాడికి బరితెగిస్తరా! మన మిందకే ఉద్దెమాలు లేవదీస్తరా! ఇంకేం మాట్టాడకు పెశిరెంటూ.. ఈ సారికి ఇదిట్టా జరగాల్చిందే!" తేల్చి చెప్పాడు పెద రెడ్డి.

ముసలయ్య బావిలోపడి మరణించడా నికి గల కారణాన్ని చెప్పి ఓబులవ్వ చని పోయాక.. అప్పటికప్పుడే అక్కడ పరిస్థితి ఉద్రిక్తమైపోయింది.

కళ్లముందే రెండు నిండు ప్రాణాలు పోవడం చూసి వాడజనం గుండెలు మండిపోతే... పెద్ద ఉద్యమకారుడిలా ముసలయ్య వూరి బావిలో దూకి ఆత్మ హత్య చేసుకుని... ఇప్పుడీ నీళ్ల పరిస్థితి ఏంటని సవాలు చెయ్యడంతో వూరి జనం ఆవేశం అవధులు దాటింది.

అగ్రకులాల యువకులు వాడ జనాన్ని కులం పేరుతో దూషిస్తూ... కర్రలతో దాడి చేశారు. ఆ దాడిని ఎదుర్కోవడానికి వాడజనం... చేతికందిన రాళ్లూ రప్పలూ ఉపయోగించారు. ఎస్ఐని గానీ... అతని వెంట ఉన్న కాన్‌స్టేబుల్ని గానీ అక్కడె వరూ ఖాతరు చేయలేదు. చంద్రకళ వాడ జనాన్ని వారిస్తూ గొంతు చించుకున్నా వినిపించుకోలేదెవరు... చివరికి ప్రెసి డెంట్ మోహన్‌రెడ్డి స్వయంగా వచ్చి సర్దు బాటు చేసేవరకూ వెనక్కి తగ్గలేదెవరూ.

ఆ గొడవంతా సద్దుమణిగాక... పంచా యితీ ఆఫీసులో చేరారు పెదరెడ్డి, పిచ్చిరా జు, పరమేశ్వర శాస్త్రి తదితర పెద్దలంతా. అందరితోపాటూ రాజూ చక్రధర్‌లు కూడా.

బావిని మైలపరిచి ఊరు ఊరినే అవ మానించినందుకుగాను... వాడజనాన్ని వెలివెయ్యాలి. వాళ్లుగాని... వాళ్ల పశు వులు గానీ... ఊళ్లోకి... అగ్రవర్ణాల వారి పొలాల్లోకి రావడానికి వీల్లేదని దండోరా వేయించాలి. పచారీ వస్తువులు గాని, పచ్చిమంచినీళ్లు గాని వాళ్లకు దొరక్కుండా చేయాలి. బయట ఊళ్లకు వెళ్లడానికి వాళ్లు రోడ్డెక్కి నడవటానిక్కూడా వీలుపడనీ కూడదు. ఇదీ వారి కోరిక.

"మరీ అమానుషం" సణిగాడు మోహన్ రెడ్డి.

"ఇంతే మోహన్‌రెడ్డీ.. నీయట్టాటి.. కుర్రకారికి పెశిరెంట్ పదవులూ... పార్ల మెంట్ సీటూ ఇస్తే.. పద్ధతిట్టాగే ఉంటది మరి" పిచ్చిరాజు ఎకసెక్కంగా అని, మళ్లీ అన్నాడు "ఇది.. నీ కుటుంబ సమస్యా.. నా కుటుంబ సమస్యా కాదు. గ్రేమ సమస్య. గ్రేమంలోని ప్రెతోని సమస్య. రేపట్నుంచీ.. ఆ పంచముల ముంగల ఈ మట్టిన బుట్టినోడు తలెత్తుకొని తిరగాలను కుంటే నువ్విట్టా టముకు ఎయ్యిచ్చా ల్సిందే."

మోహన్‌రెడ్డి.. పిచ్చిరాజుకేసి నిశితంగా చూశాడు. అతనికి పిచ్చిరాజు కనబడ

లేదు.. అతని వెనకున్న.. గొల్లవాడ ప్రజలూ.. చాకలి వీధి మనుషులూ కన్పించారు. ఆ తరవాత రాబోయే ఎలక్షన్లు గుర్తొచ్చాయి. ఆనక అతని కళ్లు అపోజిషన్ పార్టీలోని పెదరెడ్డి మీద నిలిచాయి.

"తొందరగా ఆలోసిచ్చి చెప్పు రెడ్డీ. లేదో పంచాయిత్తో సమ్మందం లేకుండా ఆ పని నేను సెయ్యాల్సివస్తది"

మోహన్‌రెడ్డి సున్నిత హృదయుడని తెలిసే కావాలని సుత్తిదెబ్బలు వేస్తున్నాడు పెదరెడ్డి.

ఓ అయిదు నిముషాల పాటు... ఆదెయ్యనాయుడు... గురవయ్యశెట్టీ... అవధాన్లు.. ఇంకా ఎవరెవరో... పెదరెడ్డిని సమర్థిస్తూ మాట్లాడారు. అందరినీ మాట్లాడనిచ్చి చివరిగా లేచాడు రాజు.

"ఈ విషయంలో ప్రెసిడెంట్‌గారు ఇంత సుదీర్ఘాలోచన చెయ్యడం అనవసరం. అగ్ర వర్ణాల వారికి ఇంత అవమానం జరిగాక... ఇంకా ఆ దళితుల్ని వెనకేసుకు రావడంలో అర్థంలేదు. కేవలం ఓట్ల పరమార్థం తప్ప"

మోహన్‌రెడ్డి భృకుటి ముడిచి చూశాడు రాజుకేసి.. కాసేపటికి అతని భృకుటి ముడి వీడిపోయింది. ముఖం ప్రశాంతంగా మారింది.

"సరే మీ యిష్టం కానీ ఒక్క షరతు.." అతను ఆగి రాజు వంక చూశాడు.

"నాకు తెలుసు మీ షరతేమిటో" అన్నాడు రాజు.

"ఇందులో పంచాయితీకి, దాని ప్రెసిడెంట్‌కీ.. ఎటువంటి ప్రయోజనం ఉండకూడదు. ఎందుకంటే... ఇది విలేజ్ పంచాయితీ గాని కేస్ట్ పంచాయితీ కాదు. అప్పుడెపుడో స్వతంత్రం రాకముందు ఉండే కుల పంచాయితీ ధర్మాన్ని ఇప్పుడు, ఇప్పటి గ్రామ పంచాయితీలు పునరుద్ధరిస్తే.. కోర్టులూ చట్టాలూ ఒప్పుకోవని మాకు తెలుసు" రాజు మోహన్‌రెడ్డితో

## కొత్తగాలి...

**ఆకాశంలో నక్షత్రాలు**
**మేల్కొనే ఉన్నాయి**
**బార్డర్లో జవాన్**
**డ్యూటీ చేస్తున్నాడనీ!**

– పెరుకరాజు,
నర్సింగాపూర్, కరీంనగర్ జిల్లా

అలా చెప్పడాన్ని అందరూ ఆసక్తిగా విన్నారు. తరవాత రాజు మిగతావారి వైపు చూస్తూ చెప్పాడు, "కాబట్టి వాడ జనాన్ని వెలివేయడాన్ని మీరు అనధికారికంగా అమలు చెయ్యండి. ప్రెసిడెంట్ గారి వైపునుంచి మనకి ఎటువంటి అబ్జెక్షన్ ఉండదు. ఇట్లా చెయ్యడం వల్ల ముందు ముందు వాడవాసులు మనల్నెప్పుడైనా కేసులో ఇరికించాలన్నా వీలు పడదు".

"పొరుగూరి పిల్లగాడివైనా.. మా గ్రేమానికి దేవుళ్లా వచ్చావయ్యా.. ఏం తెలివి... ఏం తెలివి?" మెచ్చుకున్నాడు అవధాన్లు.

"అయితే కానియ్యండ్రి మరి. ఆ సిమ్మాసెలం గాడ్ని బిల్చి టముకెయ్యచ్చుండ్రి"

"ఆడూ మాలోడేగా? ఏస్తడంటావా?"

"ఒక సీసా పట్టిచ్చినమంటే ఆడి తల్లో పేనేస్తది"

"కానీండ్రయితే గబాన"

ఆనందార్ణవం ముఖాన పొంగులు వారుతుండగా ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు ఒకరితో ఒకరక్కడ.

ఇంతమంది ఇన్ని మాట్లాడుతున్నా పెదవి విప్పనిది ఒకే ఒక్క పరమేశ్వర శాస్త్రి.

ఆ సందడి చూస్తూ అక్కడ ఇమడలేని వాడిలాగా చివుక్కున లేచి మౌనంగా ఇంటివైపు అడుగులేస్తున్నాడాయన.




అగ్రవర్ణాల వారు అనధికారికంగా విధించిన కర్ఫ్యూవల్ల వాడజనం అష్టది గ్బంధనం చెయ్యబడ్డారు.

మంచినీళ్లు తెచ్చుకోవడానికి గాని... చిల్లర సరుకులు కొనడానికి గాని... చివరికి దేనికీ వాళ్లకి అనుమతి లేదు.

కులమతాల కతీతమైన పశువులకు సైతం మేత లేదు.

అగ్రకులాల యువకులంతా చేతికర్రలు పుచ్చుకుని... వాడజనం రోడ్డు మీదకు రాకుండా కాపు కాస్తున్నారు.

ఇవేవీ పట్టని శ్రీనివాసమ్మ చాముండితో అంటోంది సంతోషంగా "అదృష్టవంతురాలివే చాముండీ.. బంగారం లాంటి మొగుడు దొరకబోతున్నాడు. మీ యిద్దరి జాతకాలు భేషుగ్గా కలిశాయనుకో" చాముండేశ్వరి గుండె వేగంగా కొట్టుకుంది. కనురెప్పలు రెపరెప లాడిస్తూ ఎర్రబడ్డ బుగ్గల్ని పవిటకొంగుతో కప్పుకుని "ఫో.. బామ్మా" అంది.

"ఎక్కడికే నే పోతాను? ఆ మూడు ముళ్లు పడితే నువ్వే పోతావ్ అత్తారింటికి" బామ్మ చాముండి తలమీద మొట్టింది.

"అమ్మాయ్ వైదేహీ.. పిల్లాడసలే మంచి ముత్యం. చేయిజారిపోకుండా చూసుకోండి. రేపే వెళ్లి.. అబ్బాయి తల్లిదండ్రుల్ని కదిలిస్తే మంచిదనిపిస్తోంది."

అత్తగారి వైపు నిదానంగా చూస్తూ అంది వైదేహి "ఏమోనండీ.. మీ అబ్బాయిగారి వైఖరి నాకర్థం కావటం లేదు. మీరు వాళ్లిద్దరి జాతకాలూ చూపించినప్పుడు.. కలిశాయని సంతోషంగానే చెప్పారా! మళ్లీ నేను కదిలిస్తే.. అంతెత్తున ఎగిరారు. ఊళ్లో పరిస్థితి అలా వుంటే.. మీ ఆడంగులకి పెళ్లి ముచ్చట్లా అని మండిపడ్డారు".

సిగ్గుతో ఎర్రబారిన ముఖంలో నీలినీడలు ముసురుకోగా.. చాముండి బేలగా బామ్మకేసి చూసింది.

"నువ్ బాధపడకే చాముండీ. మీ నాన్నకు నేను నాలుగు పెడతాగా. అయినా వూళ్లో పరిస్థితి ఎంతలోకి చక్కబడుతుంది. రెండ్రోజులు కూడా నీళ్లూ లేక మాడితే.... వాళ్లే దిగివస్తారు."

"ష్ గట్టిగా అరవకండి. ఆ వాడజనాన్ని వెలివేసిన దగ్గర్నుంచీ.. ఆయనేమిటో మూడీగా వున్నారు. ఏం మాట్లాడినా ఒకటే కస్సు బుస్సునూ"

"అది నిజమే వైదేహీ! ఉదయం నుండీ నేనూ గమనిస్తున్నా వాడి వాలకం. ఈ మాలమాదిగలు చేసే రచ్చలూ రావిళ్లూ చూస్తూ వాడు మనసు కష్టపెట్టుకుంటున్నాడల్లే వుంది. అసలే వాడి మనసు సున్నితం. ఇట్లా మనిషి కులధర్మాన్ని మర్చిపోయి భ్రష్టుపట్టి పోతుంటే.. వాడికి లోపల్లోపల దిగులు"

తన పెళ్లి సంభాషణ ఇలా దారిమళ్లడం నచ్చలేదు చాముండికి. అందుకే మాట మార్చడానికన్నట్లు అంది "బామ్మా జాతకాలు కలవకుంటే మీరు పెళ్లికి ఒప్పుకునే వాళ్లు కాదుగదూ!"

ఆ ప్రశ్నే పాపభూయిష్టమైనదన్నట్టు చెంపలు వాయించుకుంది బామ్మ. "అదేమిటే పిల్లా అట్లా అడుగుతావ్! జాతకాలు కుదరని వాళ్లకి పెళ్లేమిటి? అప్రాచ్యపు మాటలూ నువ్వూనూ!"

"నేను మాత్రం చేసుకునేదాన్నే కలవక పోయినా" బామ్మను ఉడికిస్తూ అంది.

"తప్పురా చాముండీ! అట్లా అనకూడదు"

"అంటే కళ్ళు పోతాయా బామ్మా?"

"కళ్లు పోవడం, కాళ్ళు విరగడం లాంటి చిన్న చిన్న శిక్ష లెయ్యడు దేవుడు, కులాన్ని, కులధర్మాన్ని భ్రష్టుపట్టించిన వాళ్ళకి."

"ఆహాం... ఏకంగా ప్రాణం తీస్తాడా?"

"అంతమాత్రమైతే ఇంకేమీ తల్లీ? మళ్లీ వచ్చే జన్మలో ఏ కులం తక్కువ వాళ్ల కడుపునో పుట్టిస్తాడు. భగవద్గీతలో ఆ సర్వాంతర్యామి ఓ చోట అంటాడు.. ఎవరి కుల ధర్మాన్ని వాళ్లు నెరవేర్చాలి. అట్లా చేస్తే.. నీచకులంలో పుట్టినవాడు.. పైజన్మలో ఉన్నత కులంలో పుడతాడు. కులధర్మం తప్పారనుకో ఉన్నత కులస్థులు కూడా నీచ కులంలో జన్మిస్తారు. అంతేకాదు అటువంటివారి ఆత్మ భగవత్ సాన్నిధ్యాన్ని పొందకుండా నశించిపోతుంది."

చాముండేశ్వరి భయంగా గుండెల మీద చేతులుంచుకుంది. "బాప్... రే!" ఆశ్చర్యాన్ని ఆ మాట ద్వారా వ్యక్తపరిచాక మళ్ళీ, "నేను తమాషాకన్నాలే బామ్మా. జాతకాలు కలిశాయన్న ఆనందంతో.. ఊరికే తిక్కవాగుడు వాగాను. ఒకవేళ కలవకపోయుంటే.. కచ్చితంగా నేనతన్ని చేసుకోడానికి ఇష్టపడేదాన్ని కాను. నాన్నగారి ఆచార వ్యవహారాలూ.. మనయింటి కట్టుబాట్లూ తెలియనిదాన్ని కానుగా".

"నాకు మాత్రం తెలియదటే నువ్వెంత సంప్రదాయమైన పిల్లవో! నీ కొంటె కోణంగి మాటలు నేనమ్ముతానా?"

బామ్మ చాముండి బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంది.

చాముండి వెంటనే తనూ బామ్మ చెంపలు పుణికి ముద్దెట్టుకుని అంది "మా బంగారు బామ్మ".

ఆ ఇద్దరి సంభాషణను ముచ్చటగా

## మద్యం వర్సెస్ భగవంతుడు

విపరీతంగా మద్యం తాగే గాలిబ్ అలవాటును మిత్రుడొకడు ఆక్షేపించేవాడు. 'గాలిబ్! మద్యపానం పాపం కదూ? మద్యం పుచ్చుకునేవాడి ప్రార్థనను భగవంతుడు అంగీకరించడు' అన్నాడు. అది విని గాలిబ్ నవ్వి అన్నాడు, 'తాగడానికి మద్యం దొరికాక ఇంకా భగవంతుణ్ణి ప్రార్థించటం దేనికి?'



వింటున్న వైదేహి గడపమీంచి చప్పున లేస్తూ అంది, "నాన్నగారొస్తున్నారు"

చాముండి అక్కడ్నించి వెళ్ళిపోయింది. ఆ పిల్ల మనసు మేఘాల్లో తేలిపోతోంది. ఆమెకు ఎప్పుడెప్పుడు రాజు చెవిన ఈ వార్త వేద్దామా అనివుందిగాని.. రాజు ప్రస్తుతం ఇంట్లో లేడు. ఉదయమనగా చక్రధర్‌తో కలిసి ఏదో వూరికని చెప్పి వెళ్లాడు. మధ్యాహ్న భోజనవేళ అయింది కాబట్టి ఏ పనిమీద వెళ్ళినా వచ్చెయ్యాలి అనుకుంది.

తండ్రి అన్నం తింటూ వైదేహితో ఏదో మాట్లాడుతున్నాడు. ఆ మాటల్లో రాజు పేరు వినబడ్డంతో చెవులు రిక్కించింది చాముండి.

"రాజు విషయంలో మీ అభిప్రాయం ఏమిటండీ? పిల్ల కూడా అబ్బాయిని ఇష్ట పడుతోంది. భగవంతుని దయవల్ల జాత

కాలు కూడా కలిశాయ్" వైదేహి మెల్లగా కదిపింది.. అన్నంలో నెయ్యి వడ్డిస్తూ.

జాతకాలు కలిస్తే సరా ఆ కుర్రాడి గురించి మనకేం తెలుసని? " పరమేశ్వర శాస్త్రి అన్నం కలుపుతూ అన్నాడు.

కోడల్ని విషయం ప్రస్తావించమని ప్రోత్సహించి కొడుకు నోట్లోంచి వచ్చే సమాధానం కోసం అక్కడే పొంచివున్న శ్రీనివాసమ్మ కల్పించుకుంది. "ఏమిట్రా ఇంకా చూసేది? అన్నం ఉడికిందో లేదో తెలుసుకోవడానికి ఒక్క మెతుకు పట్టుకు చూస్తే చాలదూ! గాయత్రీ మంత్రం చెప్పరా అబ్బాయ్ అన్నాను. గడగడ అప్ప చెప్పేశాడు. మంత్రపుష్పం.. శ్రీసూక్తం అనర్గళంగా వల్లిస్తాడు. ఇక ఉపనిషత్క థలూ.. పురాణేతిహాసాలంటావా... పుక్కిట పట్టేశాడు... ఇటువంటి కుర్రాడు మనకు తారసపడ్డం మనం అదృష్టం అనుకో."

"ఇన్ని విషయాలు నువ్వెప్పుడు సేకరిం చావమ్మా" పరమేశ్వరశాస్త్రి పెదవులమీద హాసరేఖ కదలాడింది.

భోజనానికి వచ్చినప్పటి నుండి భృకుటి ముడుచుకునే కూర్చుని ఉన్న భర్త ముఖం ప్రసన్నంగా మారటం చూస్తుంటే వైదేహికి సంతోషం వేసింది.

శ్రీనివాసమ్మ కాస్త సిగ్గుగా... కాస్త గొప్పగా పరమేశ్వరశాస్త్రి వంక చూస్తూ చెప్పింది. "ఆ కుర్రాడిని చూసిన మొదటి సారే... నాకెందుకో.. ఇతగాడు మన చాముండికి కాబోయే మొగుడేమో అన్పిం చింది. అందుకే సమయం దొరికినప్పు డల్లా అదీ ఇదీ మాట్లాడుతూ అబ్బాయి మేధస్సుని అంచనా వేస్తున్నా. అంత తెలి వితేటలున్నా.. ఆహా... ఏం వినయం... ఏం వినయం! మొన్న నాయనా నీ జాతకం తే అన్నా.. ఉదయాన్నే ఫస్టు బస్‌లో ఊరికెళ్ళి పట్టుకొచ్చేశాడుగాని ఎందుకమ్మా మీకది అనడగలేదు. ఈ కాలంలో ఇట్టాంటి.."

ఆమె మాటల్ని మధ్యలో కట్ చేస్తూ అడిగాడాయన "కుటుంబ విషయాలు అడిగి తెలుసుకున్నావా? "

శ్రీనివాసమ్మ ఆ ప్రశ్నకు మాత్రం మిన్న కుండిపోయింది. అబ్బాయిలోని వినయ విధేయతల్ని... పాండిత్య కౌశలాన్నీ... నిష్ఠాగరిష్ఠతనీ సమతూకం వెయ్యటంలో సమయమంతా గడిపిందేగాని... ఇల్లూ వాకిలి గురించి, బంధుమిత్రుల గురించి పెద్దగా ఆరా తియ్యలేదు. ఓసారడిగినా అతనేం చెప్పలేదు. సరేలే. జాతకాలు కలిస్తే అప్పుడా విషయం చూసుకోవచ్చు అనుకుందామె.

"అది కాదయ్యా పరమేశ్వరా... ఆ వివ రాలు అడిగే బదులు కళ్ళతో చూసి రావడం మంచిది. ఓసారెళ్లి విషయం కదిపి... ఇల్లూ వాకిలీ చూసొస్తే సరి".

పరమేశ్వరశాస్త్రి... మజ్జిగన్నం తిని చెయ్యి కడుక్కున్నాడు. వైదేహి అందించిన టవల్‌తో చెయ్యి తుడుచుకుంటూ కాసేపు ఏదో ఆలోచిస్తున్నట్టు ఉండిపోయాడు.

చాముండికి మహా ఆత్రంగా వుంది. తండ్రి నోటంట రాబోయే మాటకోసం ఒళ్లంతా చెవులు చేసుకుని చూస్తోంది.

వైదేహి శ్రీనివాసమ్మల పరిస్థితి కూడా ఇంచుమించు అలాగే ఉంది.

"సరే, ఈ వాడ సమస్య సద్దుమణి గాక...చెక్రిని తీసుకెళ్ళి రాజు నాన్నగారితో మాట్లాడొస్తాలే" చెప్పాడాయన.

అంతవరకు నిశ్శబ్దంగా పొంచి వింటున్న చాముండి హృదయంలో ఒక్క సారిగా ఎగిసింది ఆనందార్ణవం. ఆ సంద డికి తట్టుకోలేక.. ఒక్కసారిగా పరుగెత్తిం ది లోపలి గదుల్లోకి.

దాంతో ఆమె ఉనికిని బహిర్గతం చేస్తూ ఘల్లుఘల్లుమన్నాయి వెండి పాంజేబులు.

శ్రీనివాసమ్మా, వైదేహి ఒక్కక్షణం ఒకరి ముఖాలొకరు చూసుకొని ముసిముసిగా నవ్వుకున్నారు.

మధ్యాహ్నం కాదు గదా.. సాయంత్రమ వుతున్నా అయిపు లేరు రాజా చక్రధర్‌లు.

చాముండి గేటు దగ్గర నిలబడి.. కాసేపు వీధి చివరిదాకా చూపు సారి స్తుంది. మరికాసేపు పూల మొక్కల మధ్య అటూ ఇటూ తిరుగుతుంది. వెళ్ళి వరం డాలో మోకాళ్ల చుట్టూ చేతులు చుట్టి కూర్చుని... సంధ్యాకాశంలో, అప్పుడప్పుడే లేత ఎరుపులోకి మారుతున్న నీలాన్ని నిర్నిమేషంగా చూస్తుంది. ఇంట్లోకి పరుగె త్తికెళ్లి అద్దంలో చూసుకుంటుంది. ఇందా కటి సంధ్య ఎరుపులు తన చెక్కిళ్ల మీద రాపాడ్డం చూసి ఉలిక్కి పడుతుంది.

"అశ్వదాయి చగోదాయి ధనదాయి మహాధనే! ధనం మేజుష దేవీం సర్వకా మార్థ సిద్ధయే" అంటూ శ్రీ సూక్తం వల్లి స్తున్న బామ్మ మనమరాలి ఉలికిపాటును చూసి తనలో తను సన్నగా నవ్వుకుం టుంది. బావిలో చేదవేసి.... నీళ్లు తోడ కుండా... అలాగే... చేంతాడు పట్టుకుని ఆలోచిస్తూ నిలుచున్న కూతుర్ని చూస్తూ వైదేహి బుగ్గలు నొక్కుకుంటుంది. ఇన్ని జరుగుతున్నా ఇంకా రాజు మాత్రం రాలేదు. రాత్రి ఏడయింది. ఎనిమిదైంది. పది కావస్తుండగా... చాముండేశ్వరి ఎదు రుచూపులు చుక్కలయ్యాక... అప్పుడొ చ్చారు రాజూ చక్రధర్‌లు.

రాజు స్నానం చేస్తున్నంతసేపూ బాత్ రూమ్ చుట్టూ కాలుగాలిన పిల్లిలా తిరి గింది.

చక్రధర్ తననే గమనిస్తున్నట్టనిపించ డంతో భోంచేసేటప్పుడు చెప్పొచ్చులే అను కుంది.

"వడ్డిస్తూ అమ్మ అక్కడే వుంటుం దిగా... ప్చ్.. కుదరదు" అనుకుంది.

ఆమె అంతరంగం తెలుసుకున్నదానిలా

> ## కొత్తగాలి...
>
> **అందమైన**
> **'సాఫ్ట్‌వేర్' కల**
> **'ఆర్థికమాంద్యం' కోరల్లో**
> **చిక్కుకుంది**
>
> **–సుందరి, మద్దిలపాలెం, విశాఖ జిల్లా**

వైదేహి కూతుర్ని కేకేసి చెప్పింది. "నాకు నిద్రొస్తోంది గాని... కాస్త వడ్డించవే"

"నాకూ నిద్రొస్తోందే!" అయాచితంగా లభించిన ఛాన్స్‌కి ఉబ్బితబ్బిబ్బవుతూ సంతోషాన్ని దాచుకునే ప్రయత్నంలో భాగంగా అలా అంది.

"సరేలే మీ బామ్మని కేకేస్తా"

వొద్దొద్దు.. నేపెట్టేస్తా" పై ప్రాణాలు పైనే పోతున్నట్టుగా ఆత్రంగా అనేసింది.

వైదేహి వస్తున్న నవ్వును చీరె చెరు గుచాటున దాచుకుంటూ వెళ్లిపోయింది.

ఉత్సాహంగా మంచి నీళ్ల గ్లాసు, ప్లేటూ పెట్టి అన్నం వడ్డించబోతున్నపుడు వచ్చాడు రాజు. సిగ్గూ ఆనందం మిళిత మైన చూపులతో.. అతన్ని ఎదుర్కోబో తున్న చాముండి.. అతని వెనకే వస్తున్న చక్రధర్‌ని చూడగానే నాలుక్కరుచుకుంది.

రాజు ఆలోచనల్లోపడి... అతనికొక్కడికే భోజనం అనుకుంది గాని... చక్రధర్ విష యమే గుర్తులేదామెకు. హడావుడిగా మరో పీటవాల్చి ప్లేటూ గ్లాసు పెట్టింది.

ఇద్దరూ కూర్చున్నాక వడ్డించింది.

"అమ్మనో.. బామ్మనో వడ్డించుకోమ నుంటే సరిపోయేది. పానకంలో పుడకలా వీడొకడు" విసుగ్గా అనుకుంది.

"ఏమిటీ, నావైపలా ఉరిమి చూస్తు న్నావ్?" చక్రధర్ అనుమానంగా అడి గాడు.

మనసులోని నిరాశనీ... కోపాన్నీ...

ఆమెకు తెలీకుండానే ఆమె కళ్లు ప్రదర్శిస్తు న్నాయి.

"ఛ.. అదేం లేదు. నిద్రొస్తుంటే... బల వంతంగా ఆపుకోవటంతో నా కళ్లలా అన్పించి వుంటాయ్" సర్దిచెప్పింది.

మొత్తానికి భోజనాల సమయంలో చెప్పటం కుదరలేదు. అయినా నిరాశ పడ లేదామె.

పైకెళ్లి పడుకున్నాక... మంచి నీళ్ల కూజా ఇస్తుందిగా, అప్పుడు చెప్పాలి తను అనుకుంది.

కానీ.. భోంచేశాక.. ఆమె అనుకున్నట్టూ ఆ యిద్దరూ పైకెళ్ళి పడుకోలేదు.

తినగానే.. చెప్పులేసుకుని ఎక్కడికో బయలుదేరారు.

"అమ్మా నాన్నా నిద్రపోతున్నారు గాని.. లేస్తే చెప్పు, పనిమీద వెళ్లామని" వెళుతూ వెళుతూ వెనక్కొచ్చి చెప్పాడు చక్రధర్.

"ప్చ్.. కనీసం.. ఆ వెనక్కొచ్చి చెప్పిన మనిషి రాజైతే ఎంత బాగుండును!" నిట్టూ ర్చిందామె.

లోపలికెళ్లి లైటార్పి పడుకుంటుంటే అప్పటివరకూ చాముండి అగచాట్లు గమ నిస్తూ నిద్ర నటిస్తున్న బామ్మ లేచి కూర్చుని పక్క మంచం మీద నడుంవాల్చ బోతున్న చాముండి చేతిమీద గిల్లి అంది. "అప్పుడే చెప్పేస్తే మజా ఏముంటుందే పిల్లా? ఈ రాత్రంతా కలలు కనెయ్. రేపు తీరిగ్గా.. చెబుదుగాని"

★ ★ ★

"పెదరెడ్డి ఇయ్యంకుడి మనమరాలంట. పల్లెటూళ్లు సూద్దారని వొచ్చింది."

"ఆ బులుగు పంట్లాం పిల్లేనా ఎట్టి?"

"ఆ పిల్లగాదెహెా... ఆయమ్మికి కుడి తట్టుండాది జూడు... ఎంటికలిరబోసు కొని... నల్లకళ్లద్దాలేసుకొని... ఆ పిల్ల"

"అట్నా! అవ్‌గాని... ఆల్లంతా ఎవురిపి లకాయలు? ఎవురు బట్నా... చిల్మా ఏట్టరు లెక్కనుండరు!"

"చిల్మావోల్లుగాదూ.. సింతకాయిగాదులే. అసలికి అల్లందరూ ఓ కులపోల్లుగాదంట. అంతాగల్పి రెడ్డింటబడి తిన్నెరంట తిండి."

ఆ మాటవిని చివుక్కున ఇటు తిరిగింది శమంతారెడ్డి.

నిన్నరాత్రి పదిగంటలప్పుడు పదిమంది ఫ్రెండ్స్‌తో ఊళ్లో దిగిందామె.

అనుకోకుండా వచ్చిన శమంతను చూసి ఆశ్చర్యం... అనందం ముప్పిరిగొనగా సాదరంగా ఆహ్వానించాడు పెదరెడ్డి.

తన కూతురి పెళ్లిలో నాలుగైదేళ్ల క్రితం చూశాడా అమ్మాయిని. అల్లుడికి మేనకోడ లని చెప్పారు. మామయ్య పెళ్లికి పంది రంతా తానే అయినట్టూ హడావుడీ చేస్తూ చలాకీగా తిరిగిన శమంత పెదరెడ్డికి బాగా నచ్చింది. పెదరెడ్డికే కాదు ఇంట్లో అందరికీ... ఆ పిల్లంటే ఒకలాంటి ఇష్టం కలిగింది. పట్నంలో అత్తారింట్లో సెటిలైన కూతురికి ఉత్తరం రాసినప్పుడల్లా... ఆయన... శమంతను మరీ మరీ అడిగి నట్టు రాసేవాడు ఆ పిల్ల ఆ ఇంట్లో ఉండ దని తెలిసినా. ఆ అమ్మాయి నాన్నకు వేరే ఎక్కడో ఉద్యోగం. ఎప్పుడైనా మేనమామ ఇంటికి వస్తూపోతూ వుండేది. వచ్చినప్పు డల్లా...శమంతకు తన తండ్రి రాసిన ఉత్త రాలను పెదరెడ్డి కూతురు చూపించేది. "మా నాన్నకు నువ్వంటే బోలెడంత ఇష్టం. ఈసారి సెలవులకు నాతోపాటూ మా ఊరికి రా" అనేది. "పల్లెటూళ్లంటే... నాకు డామ్ బోర్.. నేన్రాను బాబూ" అని తప్పించుకునేది.. నిజంగానే కంట్రీసైడ్ అంటే విముఖత ఉన్న శమంత.

అటువంటి శమంత.. వున్నట్టుండి అంతమంది స్నేహితుల్నేసుకుని ప్రత్యక్షమ య్యేసరికి మురిసిపోయాడు పెదరెడ్డి.

ఇష్టమైన పిల్లా.. అందునా వియ్యంకుల వారి మనిషయినందున.. శమంతకు,

ఆమె స్నేహితులకూ అంతరాత్రి వేళప్పుడు కూడా.. రాచమర్యాదలే జరిగాయి.

శమంత అడుగుపెట్టగానే.. ఆ ఇల్లు పట్టపగల్లా తయారైంది. వద్దువద్దం టూన్నా.. ఆకల్లేదంటున్నా వినకుండా పంచభక్ష్య భోజనాలు.. అప్పటిక ప్పుడు రెడీ చేసి.. పెళ్లి భోజనాల్లా వడ్డించారు.

డాబా మీద తెల్లటి పక్కలు పరిచి అమ్మాయిల్ని పడుకోమ న్నారు.

అయితే ఆ అమ్మాయిలు ఆకా శంలో చందమామనీ, చిరుగాలికి కదలాడే కొబ్బరాకుల్నీ చూస్తూ మైమరచిపోయి హాయిగా నిద్రపో లేదు. ఆ రాత్రంతా ఏదో చర్చించు కుంటూ, వాదించుకుంటూ, సమా ధానపడుతూ, ఆలోచిస్తూ గడిపే శారు.

తెల్లారక ముందే మేడ దిగేసి స్నానలవీ కానిచ్చి సుష్టుగా టిఫిన్ తిని.... కాఫీలు సిప్ చేస్తూ కూర్చున్న వాళ్లకేసి ఆప్యాయంగా చూస్తూ శమంత నుద్దేశించి అడి గాడు పెదరెడ్డి. "ఏమ్మా! నీ ఫ్రెండ్సుకి మన తోటలూ దొడ్లూ చూపిచ్చు. జీతగాడ్ని తోడంపిస్తా... మా పల్లెటూళ్లంటే నీకు సెడ్డ సిరా కంటగా! ఇప్పుడోపాలి ఎల్లిసూడు... తెలుస్తయ్ పల్లి సొగసులు"

శమంతారెడ్డి... పెదరెడ్డి కళ్లలోకి లోతుగా చూసి చెప్పింది "మేమిక్కడి కొ చ్చింది మీ పల్లె అందాల్ని చూడటానికి కాదు తాతయ్యా... ఇక్కడి వికారాల్ని చూడటా నికి"

"ఇకారాలా? అయ్యేంటియమ్మా?" పెదరెడ్డి అయోమ యంగా చూశాడు.

"బడుగువర్గాల్ని మీరు దోచుకునే తీరు తెన్నులూ.. వాళ్ల చెమటతో తడిసిన తిండి తింటూ.. వాళ్ల శ్రమతో వెలిసిన ఇళ్ళలో



తలదాచుకుంటూ మీరు అంటరాని వాళ్లంటూ.. ఆ అమాయకుల్ని వెలివేసే విధానాలు ప్రత్యక్షంగా చూడాలని వచ్చాం"

"నువ్ జెప్పేది...."

"మీకు అర్థం కాదు. వదిలెయ్యండి. ప్రస్తుతం మేమొచ్చింది మీ యింట్లో భోంచేస్తూ.. ఇక్కడి అందాల్ని ఎంజాయ్ చేస్తూ గడపటానికి మాత్రం కాదు. మీచేత వెలివేయబడ్డ మాల మాదిగల్ని పరామర్శించడానికీ.. చేతనైన సాయం చెయ్యడానికి. ఆ జనంలో చిక్కుబడిపోయిన మా ప్రియమిత్రురాలు చంద్రకళకు నైతికంగా చేయూతనివ్వడానికి. అన్నట్టు... నా ఫ్రెండ్స్‌ని మీకు పరిచయం చేయ్యలేదు కదూ! ఈ అమ్మాయ్ పేరు వినీతాశర్మ బ్రాహ్మిన్" ఆగింది శమంత.

"నమస్తే" పెదరెడ్డికి నమస్కారం చేసింది బ్లూకలర్ జీన్స్ ప్యాంట్‌లోకి వైట్ షర్ట్ టక్ చేసుకుని వున్న వినీతాశర్మ.

"ఈమె మంజులా చౌదరి. కమ్మాస్"

"నమస్తే"

"ఆమె లిజీఫ్లోరా... హరిజన్"

"నమస్తే"

"ఆ అమ్మాయ్ ప్రేమకుమారి... వైశ్యాస్"

"ఈ అమ్మాయ్ రజిత. కులం రజక అనుకుంటా. అదుగో తను శైలజ.. స్వర్ణకారులు. తనేమో.. రాధిక... నాయీ బ్రాహ్మిన్. ఇదుగో ఈమె సాధన... క్షత్రియులమ్మాయ్.. ఉమామహేశ్వరి... గిరిజనులు వాళ్లు... ఎరుకల వాళ్లనుకుంటా... ఇక వీళ్లు...

"పెదరెడ్డి ముఖం మ్లానమవడం గమనించి ఒక్కక్షణం ఆగింది శమంత. ఆయన ముఖమే కాదు... ఆయన కుటుంబ సభ్యుల ముఖాలు కూడా మ్లానమవడం ఆమె చూపుదాటి పోలేదు.

"అదేంటి తాతయ్యా... అదోలా వున్నారు? " వస్తున్న నవ్వును కష్టం మీద ఆపుకుంటూ అమాయకంగా అడిగింది.

ఇన్ని రకాల కులాల వాళ్లు.. ఒకే పంక్తిలో తన నట్టింట్లో కూర్చుని... తన భార్య.. దగ్గరుండి కొసరి కొసరి వడ్డిస్తుంటే... భోజనాలు చెయ్యడం... భోజనానంతరం ఎంగిలాకుల్ని... తమ కుటుంబ సభ్యులే తీసెయ్యడం... ఆయనకు మింగుడు పడడం లేదని ఆమెకు బాగానే అర్థమవుతోంది.

ఉదయం లేస్తే గొల్లోళ్లు.. మంగలోళ్లు.. మాదిగోళ్లు.. కోమటోళ్లు.. బాపనోళ్లు.. అంటూ కులాల పేరుతోనే మనుషుల గుంపుల్ని సంబోధించే ఆ మనిషికి... అన్ని కులాలూ కలగలిసిపోయిన ఆ గుంపు కళ్లెదురుగా నిలబడ్డం స్వప్న సదృశంగా వాస్తవికతకు దూరంగా వుంది.

"నాన్నా.. ఇక్కడ మన పల్లెలోలాగా కాదు. మీ అల్లుడింటికి... రకరకాల కులపోళ్లు వస్తుంటారు. అందరూ ఆయన్తో పాటే కూర్చుని అప్పుడప్పుడూ బల్ల భోజనాలు చేస్తుంటారు. ఒకరి కులం ఒకరు అడగరు. నేనోసారి ఆయన స్నేహితుడి భార్యను కులం అడిగితే ఆమె అవమానం చేశానంటూ బాధపడింది. వాళ్ళెళ్లాక.. మీ అల్లుడుగారు నా మీద ఇంతెత్తున ఎగిరిపడ్డారు. మొదట్లో నాకు ఏమిటోగా ఉండేది గాని.. పోనుపోను.. ఈ పద్ధతే బాగున్నట్టు అన్పిస్తోంది నాన్నా? మాలమాదిగలని అంటామేగాని..పట్నాల్లో వాళ్లు ఎంతెంత ఉద్యోగాలు చేస్తున్నారని?

అసలు వాళ్ళు... ఇళ్లూ వాకిళ్ళు ముందు మనవెందుకూ పనికిరావనుకో. ప్చ్.. మన పల్లెటూళ్ళలోనే... వాళ్ళని నీచంగా చూస్తున్నాం. ఇక్కడి వాతావరణం చూశాక... అదెంత తప్పో తెలుస్తోంది."

కూతురు పట్నం నుంచి పుట్టింటికొచ్చినప్పుడల్లా అనే మాటలు చప్పున గుర్తొ

చ్చాయి పెదరెడ్డికి. వాటితో పాటూ... వెంటనే తన కూతురికి తనిచ్చే సమాధానం కూడా గుర్తుకొచ్చింది. ఇప్పుడా సమాధానాన్నే శమంతకు ఇచ్చాడాయన.

"కలికాలం. పెపంచం నాశినం అయ్యే దినాలొచ్చినయ్. కులం గోత్తరం ఇడిసిపెట్టేసి మణిసి బ్రస్టుపట్టి పోతావుండాడు"

"దీన్ని భ్రష్టు పట్టిపోవడం అనకూడదు.. బాగుపడడం అనాలి".

పెదరెడ్డికి చిర్రెత్తుకొచ్చింది "దేవళంలాంటి ఇంట్లో నానా కులపోల్లను కూసుండబెట్టి మేపి మైలపర్సిందిగాక ఏందమ్మో... ఇంగా పేల్తుండవ్".

ఆయనకి అంతక్రితం వరకూ శమంత మీద ఉన్న ఇష్టం అయిష్టంగా మారింది.

"పొరబడుతున్నావ్ తాతయ్యా... నువ్వంటున్నావే నానా కులపోళ్లూ అని... వాళ్లంతా కలిసి ఒక పంక్తిలో కూర్చుని మీ నట్టింట భోజనం చేశాకే మూఢ విశ్వాసాల్ని బోధించే దయ్యాల బడిలాంటి నీ యిల్లు దేవాలయంగా మారింది".

ఆ మాటలన్నాక ఆమె ఇక అక్కడ నిలబడలేదు. ఆమెతోపాటే బయటికొచ్చారు ఆమె స్నేహితులు.

వాళ్ళు వీధంటపడి నడుస్తుంటే... వినబడ్డ మాటలవి "చిల్మా వోల్లూగాదూ... సింతకాయీ గాదులే. అసలికి ఆల్లంతా ఓ కులపోల్లుగాదంట. అంతా గల్చి రెడ్డింటబడి దిన్నెరంట తిండి"

శమంత సర్రున వచ్చిన కోపాన్ని ఎలాగో తమాయించుకుంది. ముఖం ప్రసన్నంగా ఉంచుకోవడానికి శతవిధాలా ప్రయత్నిస్తూ.. ఆ మాటన్న మనిషివైపుగా నడిచింది "ఏం కులం?"

"కుమ్మరోల్లం" చెప్పాడతను.

"ఏం పని చేస్తావ్"?

"కుమ్మరోల్లేటి జేస్తారేటి? కుండల్జేస్తాం" శమంతను పిచ్చిదాన్ని చూసినట్టు చూశాడు.

## కొత్తగాలి...

**జీవితం**
**ఏదో ఒకటి కాదు**
**చాలా...**

– వి.శివప్రసాద్,
అనకాపల్లి

"మీ నాయనేం చేసేవాడు?" అడిగింది శమంత.

"కుండలే"

"మీ తాత?"

"కుండలే"

మీ ముత్తాత?"

"కుండలే"

నీ కొడుకు?"

"ఆడికి మాత్తరం... ఈ కుండలేపొరం పట్టించలా. రోజులు మార్తాండయిగదా! అయిద్దాకా సదివిండాడు. ఆళ్ల కాళ్లూ ఈళ్ల కాళ్లూ బట్టుకొని గవర్నమెంటుజ్జోగం ఎయ్యిచ్చినా. సీపరు పని. పెండ్లాం బిడ్డల్తో పట్నంలో కాపురం వుంటాడు."

"నీ మనవడికెన్నేళ్లుంటాయ్?"

"పదారు పదేడుంటాయ్. ఆడి తరవాద్దానికి పదేండ్లు. మూడోవాడికి ఆరేండ్లు. ఆందర్నీ సదివిచ్చుకుంటాండాడు. బిడ్డలు పెద్ద పెద్ద ఉజ్జోగస్తుల్ని జెయ్యాలని. బో ఆశ వోడికి" అలా చెప్తుంటే ఆ మనిషి కళ్లలో ఏదో మెరుపు.

"తప్పు కదూ?" అడిగింది శమంత.

"యాందమ్మా?" అయోమయంగా చూశాడా మనిషి.

"కులధర్మం ప్రకారం కుండలు చెయ్యక పోవడం తప్పుకదా అంటున్నా. బ్రాహ్మణుడు అర్చకత్వం నెరపాలి.. వైశ్యుడు వర్తకం చెయ్యాలి.. కుమ్మరి కుండలు చెయ్యాలి.. చాకలి బట్టలుతకాలి..

మంగలి క్షురకర్మే చెయ్యాలి.. అలా ఒక్కో కులానికీ ఒక్కో వృత్తిని.. మన కుల సంప్రదాయం నిర్ణయించింది గదా! సంప్రదాయాన్ని తోసిరాజని ఎవరిష్టప్రకారం వాళ్లు వృత్తులు మార్చుకుంటూ పోతే.. కులం కట్టుబాట్లని మీరు ఎక్కడ పాటించినట్టు? కుల ధర్మాన్ని ఎక్కడ ఉద్ధరిస్తున్నట్టు? "

"అదేందమ్మో అట్టా చెప్తుండవ్... నాకు మల్లే నా బిడ్డల్తరం గూడ... మట్టి పిసుక్కొని బతికెయ్యాల్నంటవా? "

"తప్పదు.... కులం కావాలంటే ఆ పని చెయ్యాల్సిందే. చెయ్యటం లేదు అంటే... మీకు కులం లేనట్టే" వినీతా శర్మ అందుకుని చెప్పింది.

"అదేందది! తూరుపింటి సుబ్బయ్య గొల్లోళ్లమడిసి కొడుకుని డాక్టేరు సదివిచ్చాండు. సిల్లరకొట్టు గురవయ్య సెట్టి గోరబ్బాయ్య అదేందో ఊల్లో... బేంకీపని జేస్తాండే! ఆ మూలింటి సిన్నయ్య కొడుకు టీచరుజ్జోగం చేస్తాండె! మరీల్లంతా కులం లేనోల్లేనంటరా? "

"అంటే.. కులం లేనివాళ్లే."

"సదవేస్తే వుండమతి బొయినాదని బోజెప్తుండరు గదమ్మా. నాకు దెలీకడుగుతా... మీరంతా మీ కులప్పన్లు జేస్తుంద్రా? సుబ్బరంగా సదూకోడంలే? కాలం మారిపోనాది. ఇప్పట్లో అందరూ ఆయిగా సదూక్కొని మంచి మంచి వుజ్జోగాలు చేసుకుంటండారు. మీకు తెల్దేమో!"

"అదేనయ్యా.. మేము చెప్పొచ్చేది... కాలం మారింది కాబట్టే కులం చెల్లిపోయింది. అప్పుడెప్పుడో చేసే వృత్తిని బట్టి కులాన్ని నిర్ణయించారు. ప్రస్తుతం ఎవరిష్టం వచ్చిన వృత్తిలోకి వాళ్లు స్వేచ్ఛగా దిగుతున్నారు కాబట్టి... ఎవర్నీ ఫలాని కులం అని చెప్పడానికి లేదు. అందుకే... కులం లేదు అంటున్నాం."

"అంతే కాదు.. మనుషులంతా ఒక్కటే అంటున్నాం."

"మనలో ఆర్థిక అసమానతలు తప్ప జన్మపరమైన భేదాల్లేవు."

వాళ్ల మాటల్లోని లాజిక్ అతనికి అర్థం అయీ కానట్టుగా వుంది. అందుకే... వాళ్లు వెళుతున్నవైపే తల గోక్కుంటూ చూస్తుండిపోయాడు.

★ ★ ★

ఊరు దాటి పొలాలగుండా చాలా దూరం నడిచి హరిజనవాడ దరిదాపుల్లోకి చేరుకున్నారు శమంతా ఆమె మిత్ర బృందం.

అల్లంత దూరంలో కాలిబాట రెండుగా చీలి ఒకదారి మాలపల్లెలోకి... ఒకటి మాదిగపల్లెలోకి సాగేచోట కూర్చుని ఉన్నారు అయిదారుగురు యువకులు. ఇద్దరి చేతుల్లో బాణా కర్రలున్నాయి. మరో ముగ్గురి చేతుల్లో కొడవళ్లు... ఒకడి దగ్గర బరిశా ఉన్నాయ్.

శమంత ఒక్క క్షణం నడక ఆపి తన పక్కనే నడుస్తున్న వినీత ముఖంలోకి చూసింది. ఇద్దరూ వెనక నడుస్తున్న అమ్మాయిలకేసి తిరిగారు.

"ధైర్యం చేసి వెళదామనిపిస్తోంది" చెప్పింది శమంత.

"వాళ్లేమైనా రాంగ్‌వేలో ప్రొసీడైతే? " సందేహం వెలిబుచ్చింది ఉమ అనే అమ్మాయి.

"ఏం చేస్తారు? గాడిదగుడ్డు. అయినా హరిజనులు ఊళ్లోకి రానీకుండా కదా వీళ్ల బోడికాపలా.. మనం వాడలోకి పోతే ఎందుకు అడ్డుకుంటారు? "

వినీత మాటలు నిజమన్పించాయి. మిగిలిన వారికి.

శమంతా, వినీతా ఓసారి ఆ వ్యక్తులకేసి చూసి.. కళ్లు తిప్పుకుని... ఏదో తమ మానాన తాము పోతున్నట్టు నడుస్తూ

వాళ్లను దాటబోయారు.

వాళ్లలో బాణా కర్ర పట్టుకున్న వ్యక్తి లేచి అమ్మాయిల దారికి అడ్డంగా నిలబడ్డాడు. "ఏ వూరు మన్ది? "

"ప్రస్తుతం నువ్వూ నేను ఇద్దరం ఇక్కడున్నాం కాబట్టి ఈ వూరేమన్ది" అతని వంక సర్‌కేస్టిక్‌గా చూస్తూ చెప్పింది శమంత.

"వాడలో వాళ్లు వూళ్లోగ్గాని... వూళ్లో వాళ్లు వాడలోగ్గాని అడుగుపెట్టడానికి లేదు"

"పెడితే? " అమ్మాయిల్లో ఇద్దరు ముగ్గురు ఒకేసారి దురుసుగా అడిగారు.

"తలకాయిల్లేసి పోతయ్" బాణాకర్ర ఆ చేతిలోంచి ఈ చేతిలోకి మార్చుకుంటూ చెప్పాడు.

'తలకాయిల్లేసి పోతయ్' అనేమాట తమ సహచరుడి నోటి వెంటరాగానే వ్యవహారమేదో కాస్త ముదురుతుందనిపించిందేమో మిగతావాళ్లు లేచి ఆ వ్యక్తికి బాసటగా నిలబడ్డారు.

వాళ్ల చేతుల్లోని కర్రలవంకా కొడవళ్ల వంకా చూస్తుంటే.. భయానికి బదులుగా అసహ్యంతో జలదరించింది శమంత.

"ఒక మనిషిని దారంట పోకుండా అడ్డుకునే హక్కు మరో మనిషికి లేదు. పక్కకు తొలగి మర్యాదగా మా దారిన మమ్మల్ని పోనివ్వండి. లేదంటే పోలీస్ రిపోర్టివ్వాల్సి వస్తుంది"

బరిశె పట్టుకుని ఉన్న వ్యక్తి ఫక్కుమని నవ్వాడు. తనన్న మాటలో జోకేముందో అర్థం కాక చూస్తున్న శమంతను హేళనగా చూస్తూ చెప్పాడు. "రిపోర్టిస్తవా? ఎవుడికి.. ఆ బట్టపుర్రె కర్రి ఎస్సయ్‌కేనా? ఇచ్చుకోపో".

"ఒక బాధ్యత గల పోలీసాఫీసర్‌ని అంత అవహేళనగా మాట్లాడుతున్నావ్. మా రిపోర్ట్‌లో ఈ విషయాన్ని కూడా చేరుస్తాం" బెదిరిస్తున్నట్టు చెప్పింది వినీత శర్మ.

"నేను ఆడ్ని ఎదవన్నరెదవ అని కులం పేరుతో తిట్టానని గూడా రాసుకోపో".

"రేయ్" అంతవరకూ అందరికి వెనకగా నిలబడి ఉన్న లిజీ ఫ్లోరా కోపంగా అతని ముందుకు నడిచింది.

"ఒక అఫిషియల్‌ని కులం పేరుతో తిట్టడానికి నీకెన్ని గుండెల్రా? "

"రా" ఆమె అన్న పదాన్ని రిపీట్ చేస్తూ ఆమె మీది మీదికొచ్చాడు ఆమె చేత అలా అన్పించుకున్న వ్యక్తి "ఏదీ మల్ల బిలువట్ట"

అతని చేతిలోని ఆయుధం వంకా, అతని వంకా మార్చి మార్చి చూసింది లిజీ ఫ్లోరా. "ఏం భయపడతాననుకున్నావా? కులం పేరుతో తోటి మనుషుల్ని వెలివేసి వాళ్ళు ఆకలిదప్పులతో అల్లాడుతుంటే... గమ్మత్తు చూస్తూ కూర్చున్న నిన్ను... ఆ

## నొప్పింపక తానొవ్వక

ఇతరులను స్తుతిస్తూ ప్రశంసా పద్యాలు రాయడం గాలిబ్‌కు ఇష్టముండేది కాదు. ఆరోజుల్లో కులీనుల ఇంట్లో ఎవరైనా పుట్టినా, చనిపోయినా వారిని గూర్చి కవితలు రాయించుకునేవారు. ఇలాంటి పద్యాలు గాలిబ్ రాసేవాడు కాదు. ఒకసారి ఓ పెద్దమనిషి తన పిల్లవాడి పుట్టిన రోజుకు పద్యం రాయమన్నాడు.




'రాయను' అని మోటుగా చెప్పి అతడిని నొప్పించడం ఇష్టంలేదు. అందువల్ల, 'ఆ మధ్య ఎవరి పిల్లవానికో పుట్టిన రోజున పద్యం రాస్తే వాడు పుటుక్కున ఊపిరి వదిలాడు. నా రాతలు అచ్చిరావు. నాతో ఎందుకు రాయించుకుంటారు?' అన్నాడు చమత్కారంగా. దీంతో ఆ రాత బెడద తొలగిపోయింది.

నిస్సహాయులకు ఎవరి సహాయమూ అందకుండా అడ్డుకుంటున్న నిన్ను 'రా' అని ఎందుకు సంబోధిస్తున్నానంటే అంత కన్నా నీచ పదం ఇంకోటి లేదు కాబట్టి"

"పిల్లేందో పెద్ద ఉపెన్నాసం ఇస్తాంది" అతను తన పక్కనున్న వాళ్ళతో అని కన్ను గీటాడు.

వాళ్ళలో ఒకడు దూకుడుగా లిజీ ముందుకొచ్చి అన్నాడు "ఏందే... పెచ్చు మీరిపోతండవ్... మా ఊరి మాల మాది గలు ఆళ్ళు. ఆళ్ళని మేమైనా జేసుకుంటం, నరుక్కుంటం... సంపుకుంటం. కూడూ నీళ్లూ ఈకుండా ఎండగడతం. అదంతా మా యిట్టం. మద్దెలో నీ కేంటికే? రా.. గీ.. అని ఫోజులు గొడతండవ్.. అసల్కి నువ్వెవరివే? పొరుగూరి మడిసివి పొరు గూరి మడిసిలా పడుండు. మా గ్రేమ ఇస యాల్లో తల దూర్చినవంటే పుచ్చెగిరిపోద్ది. సెంద్రకలనే పిల్ల యాడ్నుంచో వచ్చి అరి జనవాడలో జేరి అతిక పెసంగం సేబట్టే ఇప్పుడాళ్లకి ఆ గతి బట్టింది. ఉండాల్సిన సోట ఉండకుండా.. ఎంగిలిస్తరాకుల్లాగా ఎగిరి పడబట్టే ఆ మాల మాదిగలకు ఇట్ట బుద్ధి చెప్పింది".

"కులం పేరుతో తిట్టకు" పళ్ల బిగువున కోపాన్ని ఆపుకుంది లిజి.

"ఏం ఆల్లని దిడితే నీకేంటికీ పొడుసక రాటం?"

"ఎందుకంటే నేనూ... హరిజనుల అమ్మాయినే కాబట్టి" మనసులోని కసి నంతా పెదవుల మీదికి తెచ్చుకుందామె.

"మా హరిజన సంఘం ప్రెసిడెంట్‌కి ఇక్కడి విషయం చెప్పానంటే... మీ తాట వలిచి మిమ్మల్ని ముక్కల కింద నరికే స్తారు. కోర్ట్‌లో కేస్ ఫైల్ చేసి మిమ్మల్ని ముప్పు తిప్పలు పెట్టి..."

లిజీ మాటలింకా పూర్తి కానేలేదు. వాళ్లలో ఒకడు రఫ్‌గా ఆమె భుజం మీది చున్నీని లాగేసి జడ పట్టుకుని మెడ వెనక్కి విరిచి పట్టుకుని చెప్పాడు. "ఇప్పుడు నీకు నేన్జేసిన అగిమానం గూడా నీ పెసిడెంట్‌కి చెప్పుకో".

వాడు లిజీ చున్నీ లాగెయ్యటం, ఆమె జడ పట్టుకుని ఆమెను హెచ్చరించటం... ఇదంతా కొన్ని సెకండ్లలో జరిగి పోవ టంతో ఆ హఠాత్పరిణామాన్ని అచేతనులై నిర్ఘాంతపోయినట్టు చూస్తుండిపోయారు మిగతా వాళ్ళు. ఒక నిమిషం... తరవాత అందరికంటే ముందు తేరుకున్న శమంతా రెడ్డి మిగతా అమ్మాయిలూ... ఎర్రబడ్డ ముఖాలతో... ఆ వ్యక్తుల మీదకు పోబో తుంటే చప్పున అడ్డుకుంది వినీతాశర్మ.

"ఆగండి. షెడ్యూల్డ్ కులానికి చెందిన ఒక స్త్రీ పైన వేరే కులానికి చెందిన ఏ పురుషుడైనా బలప్రయోగం చేసినా బలా త్కారం చెయ్యబోయినా వాడికి అయిదేళ్ల రకూ జైలు శిక్ష విధిస్తుంది చట్టం అనే విషయం, పాపం మన లిజీ చున్నీ లాక్కున్న మొనగాడికి తెలీదు కదా! నిదా నంగా తెలియజేద్దాం. ప్రస్తుతం ఈ గ్రామ సింహాలతో పోరాటం ఆపి వెనక్కి తిర గండి. ఎస్ఐ గార్ని కలిశాక ఫర్‌దర్‌గా ఆలోచిద్దాం."

వాళ్ళు వెనక్కి తిరిగి నడవటం మొదలె ట్టాక లిజీ చున్నీ లాగిన వ్యక్తి పెద్దగా అరిచి చెప్పాడు.

"ఆ బట్టపుర్రి ఎస్సైగాడి దెగ్గిరకేగా ఎల్తంట? నా పేరు దెల్దుగా మీకు! ఎన మల సత్తి నారాయణ.. ఇవరంగా సెప్పు కోండి... పైట ఎట్ట లాగిందీ, జడ ఎట్టా బట్టుకుందీని"

వెనక నుంచి నవ్వులు.

లిజీకి కళ్లలో నీళ్ళు తిరిగాయ్. శమంతా రెడ్డి అనునయంగా ఆమె భుజం మీద చెయ్యేసింది.

వాళ్ళు చకచక నడుచుకుంటూ ఊళ్లోకి

వచ్చి అక్కడనుండి.. తూర్పు దిక్కుగా.. అర కిలోమీటర్ దూరంలో ఊరి శివార్లలో ఉన్న పోలీస్ స్టేషన్ చేరుకున్నారు.

వీళ్లు వెళ్లేసరికి ఎస్.ఐ. స్టేషన్‌లోనే ఉన్నాడు. అతని బట్టతల చూడగానే గుర్తొచ్చాయి శమంతకు ఇందాక ఐదారుగురిలో ఓ వ్యక్తన్న మాటలు. "రిపోర్టిస్తావా? ఎవురికి? ఆ బట్టపుర్రి కర్రి ఎస్సైకేగా! నేను ఆడ్ని తిట్టానని గూడా రాసుకోపో... మల్ల మాట్లాడితే మాల మాస్టీవోడు అన్నెనని గూడా చెప్పుకో పో"

ఒక్కసారిగా... జాలి... దాంతోపాటు అభిమానం పొంగుకొచ్చాయామెలో. సీట్లో కూర్చుని వీళ్లవంక ప్రశ్నార్థకంగా చూస్తున్న ఎస్.ఐ. మీద.

సరిగ్గా అదే సమయంలో "ఇట్టాటి పల్లెటూళ్లో ఇంత అల్ట్రామోడర్న్ అప్ టు డేట్ అమ్మాయిలు ఎవరికి చెందిన వాళ్లబ్బా?" అని ఆలోచిస్తున్నాడు ఎస్.ఐ.

"నమస్తే సర్" చెప్పింది శమంత.

"నమస్తే.. నమస్తే.. కూసోండి" చెప్పాడు.

అక్కడున్న రెండు కుర్చీల్లో శమంత, లిజీ కూర్చున్నారు. మిగతావాళ్లు నిలబడ్డారు.

"చెప్పండి. వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?"

శమంతారెడ్డి, ఖరీదైన దుస్తుల్ని బట్టి ఆమె స్టేటస్‌ను అంచనావేస్తూ అడిగాడు.

"సర్.. ఇక్కడి గ్రామస్థులు... హరిజనుల్ని వెలివేసిన బార్బేరియస్ సంఘటన గురించి ఇంతవరకూ గ్రామంలో ఒక్కరు కూడా మీకు రిపోర్టు చెయ్యలేదా?"

"లేదే"

"అంటే... ఈ గ్రామంలో మనిషి అన్నవాడెవడూ లేడన్న మాట?" ఆవేశంగా అంటున్న వినీత శరీరపు కాంప్లెక్షన్ని పరిశీలనగా చూస్తూ... ఆమె సొసైటీ హైట్‌ని ఎస్టిమేట్ చేస్తూ అడిగాడు.

## కొత్తగాలి...

**నేడు నగదు! రేపు అరువు!!**
**కిరాణా షాపులో బోర్డు**
**రేపే చర్చ! ఎల్లుండే**
**మహిళా రిజర్వేషన్ బిల్లు**
**పార్లమెంటు గుమ్మానికి నోటీసు!!**

– ప్రభాకర్ తల్లాప్రగడ, హైదరాబాద్

"అసలు విషయం చెప్పండి"

వాళ్లు ఓ పదినిమిషాలపాటు ఆ ఎస్.ఐ. అన్న 'అసలు విషయాన్ని' వివరంగా చెప్పారు. చివరగా హరిజనవాడలో ఉన్న తమ ఫ్రెండ్ చంద్రకళని కలవడానికి వెళుతున్న తమను గ్రామస్థులు ఎలా అడ్డుకుందీ... లిజీ చున్నీని లాగి ఆమెను ఎంత ఘోరంగా అవమానించింది చెప్పి... ఎస్.ఐ. రియాక్షన్ కోసం అతని ముఖంలోకి చూస్తుండిపోయారు.

ఎస్.ఐ.ని అక్కడి వ్యక్తులు తిట్టిన విషయాన్ని మాత్రం చెప్పలేదు వాళ్లు. చెబితే... అతను చిన్న బుచ్చుకుంటాడేమో అన్న ఆలోచనే.. వాళ్లను ఆ విషయం చెప్పకుండా ఆపింది.

ఎస్.ఐ. ముఖంలో వాళ్లు ఆశించినంత ఉద్రేకం కనబడలేదు. అతను సాలోచనగా కాసేపు ఉండిపోయి తరువాత అన్నాడు. "ఇది గ్రామ సమస్య. దీన్ని మనం రిపోర్టులు, కేసులు అంటూ కోర్టుదాకా... తీసకపోయినాం అనుకో... తగాదా పెద్దద వుద్ది. దానికన్నా ఆడ పెద్దలతో మాట్టాడి ఆళ్లకీ.. వాడజనానికీ రాజీ కుదిర్చినామనుకోండి.. ప్రశాంతంగా అయిపోద్ది"

సబ్ ఇన్‌స్పెక్టర్ మాటలు వినీతకు రుచించలేదు.

"ఏంటి సర్ మీరు చెప్పేది? ఈ గ్రామస్థుడు మా లిజీ చున్నీలాగి జడపట్టి

మెడలు విరగదీయడాన్ని కూడా ఈజీగా తీసుకోవాలంటారా? "

"అదిగాదమ్మా" అతనేదో సర్ది చెప్పబోయాడు.

"ఏదికాదు? " శమంత ఆవేశంగా కుర్చీ లోంచి లేచింది.

"ఒక వర్గాన్ని మరోవర్గం అంటరానివాళ్లంటూ నిందించి, వాళ్లని ఓ పరిధిలో నిర్బంధించి, వాళ్లకి తిండి, నీళ్లు, మెడికల్ ఎయిడ్‌లాంటివి ఏమీ అందకుండా కాపలా కాస్తూ క్రూరాతి క్రూరంగా ప్రవర్తిస్తుంటే.. ఒక బాధ్యత గల పోలీసాఫీసర్.. లాఠీతో వాళ్ల కీళ్లు విరిచి బుద్ధి చెప్పాల్సింది పోనిచ్చి.. ఇంకా వాళ్లని పెద్దలంటూ గౌరవిస్తూ మీరు మాట్లాడే తీరు సభ్యసమాజానికే అవమానకరం. అసలు.. అసలు మీకు రిపోర్టిస్తామంటే.. ఆ కాపలా కుక్కలు ఏమన్నారో తెలుసా? "

శమంత నోట్లోంచి ఆ మాటలు వెలువడకుండా అడ్డుకుంది వినీత. "అవన్నీ అనవరసరం శమంతా" ఆమెతో అని ఎస్.ఐ. వంక చూసింది. "సర్... హరిజనుల మీద జరుగుతున్న అత్యాచారాన్ని మీ దృష్టికి తేవడానికి మేమిక్కడికొచ్చాం. రిపోర్టు రాసిస్తాం. మీరు వెంటనే యాక్షన్ తీసుకొని ఆ అనధికార వెలిని ఇంప్లిమెంట్ చేసిన వారిని ఎస్.సి... ఎస్.టి అట్రాసిటీ యాక్ట్ ప్రకారం అరెస్ట్ చేయండి. అంతే కాని గ్రామస్థుల్ని బుజ్జగించి ఇది తప్పురా.. కన్నా.. నాన్నా అని చెప్పి ఒప్పించాల్సిన అవసరంలేదు. ఈ సంఘటన పబ్లిక్ ఇష్యూ అయినప్పుడే మిగతా గ్రామాల్లో కూడా కులం పేరుతో జరిగే హెరాస్‌మెంట్ కాస్త తగ్గుతుంది."

ఎస్.ఐ. ఇంకా ఆలోచిస్తుండటం చూసి లిజీ ముఖం ఎర్రబడింది. "ఏంటి సార్ ఇంకా ఆలోచిస్తారు? ఐ నో యు ఆర్ ఎ హరిజన్. నేనూ హరిజనుల అమ్మాయినే. మనవాళ్లకు జరుగుతున్న అన్యాయానికి మనమే స్పందించకపోతే నాకన్నా ఎక్కువగా ఈ సంఘటనపై చలిస్తున్న ఈ అగ్ర వర్ణ అమ్మాయిల ముందు మనం సిగ్గుతో తలవంచుకోవాల్సిన..."

ఎస్.ఐ. ఆమె మాటల్ని మధ్యలోనే కట్ చేస్తూ అన్నాడు, "రిపోర్ట్ రాసివ్వండి"

★ ★ ★

ఎర్రగా పండిన గోరింటాకు చేతుల్ని ముఖానికి అడ్డుగా ఉంచుకుని చెప్పింది చాముండేశ్వరి "మ.. మనిద్దరి జాతకాలు కలిశాయంట. బామ్మ చెప్పింది"

ఒక అరనిమిషం... ఎదురు చూసింది రాజేమైనా అంటాడేమోనని. అతన్నుంచి ఎటువంటి రెస్పాన్స్ రాకపోవడంతో ఆశ్చర్యమనిపించి చేతులు అడ్డు తొలగించి అతనికేసి చూసింది.

అతను చాముండి వంకే నిర్నిమేషంగా చూస్తున్నాడు మాటా పలుకూ లేకుండా.

చాముండికి సిగ్గేసి చప్పున చేతుల్ని మళ్లీ ముఖానికి అడ్డుగా పెట్టుకుంది.

ఆమె అరచేతుల్లో పండిన గోరింటాకుతో పోటీపడుతూ ఎర్రబడ్డాయామె చెంపలు.

"చాముండీ!" పిలిచాడతను.

"ఊ" ముఖాన్నింకా చేతుల్లోనే దాచుకుని ఉందామె.

"ఇలా చూడు"

"ఉహు"

"అరె చూడమంటుంటే..."

అతి కష్టం మీద అరచేతులు విడదీసి ఒకసారి అతనికేసి చూసి తిరిగి చప్పున తలదించుకుని పవిట కొంగు నలుపుకుంటూ నేల చూపులు చూస్తుండిపోయింది.

"నేనోటడగుతాను. ఆలోచించి సమాధానం చెప్పు"

అలాగే అన్నట్టు తలూపిందామె.

"మనసులు కలవడం ముఖ్యమా?

## కొత్తగాలి...

**జీవితం**
**సప్తవర్ణ సత్యం!**
**ఆనందం**
**నిత్యం కోరుకునే స్వప్నం!**

*-యడవల్లి, ఖైరతాబాద్,*
*హైదరాబాద్*

జాతకాలు కలవడం ముఖ్యమా? "

చాముండి బుగ్గల్లో పారాడుతున్న సిగ్గు కాస్త పలచబడింది ఆ ప్రశ్నలోని సీరియస్‌నెస్‌కి.

ఒక్కక్షణం భృకుటి ముడిచి ఆలోచించి చెప్పింది. "జాతకాలు కలవనప్పుడు మనసులు కలిసినా మన పెళ్లి జరగదుగా!"

రాజు సమాధానం విని... మౌనంగా ఎటో చూస్తుండిపోయాడు.

తనిచ్చిన సమాధానం రాజుకు నచ్చలేదేమో అనుకుంది చాముండి.

తనేమైనా పొరపాటుగా అందా? నిజంగానే తనన్నట్టూ జాతకాలు కలవకుండా ఉండుంటే పెళ్లికి ఇంట్లోవాళ్లు ఒప్పుకుని ఉండేవారు కాదు. కానీ.. తనో? బాధపడేదేమో!

కలవకపోయినా సరే తను తన్నే పెళ్లాడతానని పట్టుపట్టేదేమో! అనుమతి కోసం పోరాడేదేమో! అప్పటికీ ఒప్పుకోకపోతే... చస్తానని బెదిరించేదేమో! రాజు లేకుండా తను బతగ్గలదా? ఊహు.. కచ్చితంగా.. ఆత్మహత్య చేసుకునేది.

అంటే... అంటే...

చాముండి గొంతు సవరించుకుంది. "లేదు రాజూ! జాతకాలు కలవకపోయినా.. మన పెళ్లి జరిగుండేది. ఎందుకంటే వాటి కలయిక కన్నా మనసుల కలయిక ముఖ్యం కాబట్టి"

రాజు పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"చాముండీ.. నువ్వు ముందిచ్చిన స్టేట్‌మెంట్‌లో మతధర్మం ఉంది. ఇప్పుడు చెప్పినదాన్లో మనోధర్మం ఉంది. నా గురించిన ఓ నిజాన్ని చెప్పబోతున్నా. అది విన్న తర్వాత రెండు ధర్మాల్లో ఏది నీకు అనుసరించ తగ్గదనిపిస్తే అలా చెయ్యి"

ఆమె కళ్లు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. అతను చెప్పబోయే 'నిజం' ఏమిటా అని ఆరాటంగా చూసిందతని వంక.

అతను చూపులు పక్కకు తిప్పుకున్నాడు.

ఒక్కక్షణం తటపటాయిస్తున్నట్టుగా ఉండిపోయి తరువాత ఓ నిర్ణయానికొచ్చినట్టు ఆమె వైపు చూశాడు.

అతని హృదయపు అట్టడుగు పొరల్లో ఇంతకాలం నుండీ బయటపడుతూ లోపలుండలేక ఊపిరాడనట్టు గిలగిల కొట్టుకుంటున్న ఒక మాట గొంతు దాటి పెదవుల మీంచి జాలువారబోతుండగా..

అప్పుడొచ్చాడు పరమేశ్వరశాస్త్రి. ఆయన్ని చూడగానే లోపలకు తప్పుకుంది చాముండి.

ఆయన రాగానే వాలుకుర్చీలో పడుకుని అలసినట్టుగా కళ్లు మూసుకున్నాడు.

వీధిలోంచి వచ్చినప్పుడు నేరుగా బావి దగ్గరకు వెళ్లి పరిశుభ్రంగా కాళ్లూ చేతులూ కడుక్కునిగాని వరండా మెట్లెక్కని శాస్త్రి.. కనీసం పాదరక్షలు కూడా వదలకుండా నిస్త్రాణగా అలా పడుకుండిపోవడాన్ని చిత్రంగా చూశాడు అక్కడి నుండి వెళ్లిపోవడానికి సిద్ధమవుతున్న రాజు.

"రాజూ!"

వెనుదిరిగి చూశాడు రాజు.

పరమేశ్వరశాస్త్రిగారి ముఖం గంభీరంగా ఉంది.

రాజును ఎదురుగా కుర్చీలో కుర్చోమన్నట్టు సైగ చేశాడు.

"పరిస్థితి విషమిస్తోందయ్యా"

పరమేశ్వరశాస్త్రి మాట్లాడేది ఏ పరిస్థితి గురించో అర్థమైంది రాజుకు.

"విషమించనివ్వండి... మనకేం? " ఉదాసీనంగా అన్నాడు రాజు.

"పట్నం నుంచొచ్చిన.. ఆ చంద్రకళ స్నేహితురాళ్లు ఇవాళ ఉదయం పోలీసు కంప్లైంట్ ఇచ్చారు... తెలుసుగా? ఎస్.ఐ ఆ వంకతో పోలీసుల్ని తీసుకుని వాడలోకి వెళ్లి అక్కడి మనుషుల మీద అనవసరంగా లాఠీచార్జి చేసి... తెల్ల కాగితాలమీద సంతకాలు చెయ్యించుకున్నాడు"

"తెలుసు.. ఆ గందరగోళంలో చంద్రకళ కూడా గాయపడింది" నిర్లిప్తంగా చెప్పాడు రాజు.

"ఆ అమ్మాయిలిచ్చిన కంప్లయింట్‌ని బుట్టదాఖలు చేసి ఈ తెల్లకాయితాల మీద చంద్రకళ అన్న వీరయ్య.. ఇంకో ఇద్దరు యువకులతో కలిసి ముసలయ్యను గొంతు పిసికి బావిలో వేసి.. గ్రామస్థుల మీద కక్ష తీర్చుకున్నట్టుగా, ఇది అగ్రవర్ణాల వారి ఆచార వ్యవహారాల పట్ల ఏహ్యతతో.. ఆవేశకావేషాలకు లోనై.. ఒక ఉన్మాద స్థితిలో చేసిన చర్యగా అభివర్ణిస్తూ.. వాడు తర్వాత రిపోర్టు తయారు చేసి ఎఫ్ఐఆర్ ఫైల్ చేశాడు. వీరయ్యను.. మరో ఇద్దర్ని అరెస్ట్ చేసి లాకప్‌లో ఉంచాడు. దీనికి కారణం పెదరెడ్డి... ఆదెయ్యనాయుడు... ఇంకా కొందరున్నారు. ఇంత జరుగుతున్నా... ప్రెసిడెంట్ ఏమీ పట్టించుకోవటం లేదు"

"అతనెందుకు పట్టించుకుంటాడు? "

అధికారం కన్నా కూడా మతం గొప్పది. మనమంతా ఒక తాటిమీద నిలబడి అతనికి ఎదురు తిరిగి హరిజనుల్ని వెలివేసినప్పుడు అతను గ్రహించి ఉంటాడు, ఊరిజనాన్ని కాదని తనేమీ చేయలేనని.

పరమేశ్వరశాస్త్రి ఏదో అనబోతుండగా గాలి దుమారంలా వచ్చాడు చక్రధర్.

"రాజూ... మాలపల్లెలో... ఒక వృద్ధుడూ... ఇద్దరు పిల్లలూ... ఆకలికి తట్టుకోలేక చనిపోయారట. ఇప్పుడే... ఇప్పుడే తెలిసిందీ వార్త"

రాజు గుండె ఒక్కసారిగా తొట్రుపడింది. అయినా కళ్లలోంచి కన్నీరు తొణక్కుండా తమాయించుకున్నాడు.

"ఏ జన్మలో చేసిన పాపంవల్లో ఇప్పుడు అంటరానివాళ్లయి పుట్టారు. ఈ జన్మలో చేసిన పాపం వల్ల ఆకలి చావులు చస్తున్నారు." అంటున్న రాజువంక తీక్షణంగా చూశాడు పరమేశ్వరశాస్త్రి.

"రాజూ! నువ్వేం మాట్లాడుతున్నావో... నీకు తెలుస్తోందా? "

"ఒక సద్బ్రాహ్మణుడు ఏం మాట్లాడాలో అదే మాట్లాడుతున్నాను. మనం తాగే నీటిని మైలపరిచి... మన ఆచారాన్ని మంటగలిపిన ఆ దుర్మార్గులకు ఆ శిక్ష చాలదు. వాళ్లు పాపం చేశారు. అందుకే ఇంకా సర్వనాశనమైపోవాలి. ఆకలిదప్పులతో అలమటించి పసిబిడ్డలతో సహా దిక్కులేని చావు చావాలి. అప్పుడు... వాళ్లు చేసిన పాపానికి సరైన శిక్ష విధించిన... మనల్ని భగవంతుడు మెచ్చుకుంటాడు. ఉత్తమ గతుల్ని ప్రసాదిస్తాడు".

పరమేశ్వరశాస్త్రి అచేతనుడైనట్టు చూస్తున్నాడు రాజువంక. రాజులోని మితిమీరిన కులగర్వం మతాహంకారం.. ఎందుకో ఆయనకు ఎబ్బెట్టుగా.. వెగటుగా అన్పిస్తున్నాయి. ఒక్కసారిగా రాజుమీద ఏహ్యత లాంటిది కలిగింది. అయినా కోపాన్ని అణచుకుంటూ అన్నాడు.

"రాజూ.. మతధర్మం కన్నా.. మనోధర్మం గొప్పది. మన తక్షణ కర్తవ్యం.. ఆ బాధితుల్ని ఆదుకోవడం"

"మీరు... మీరేనా ఈ మాటలంటున్నది!" అంటూ ఆశ్చర్యపోయాడు రాజు.

## కొత్తగాలి...

**ప్రేమ నేర్పు కంప్యూటర్‌కి**
**సేవ్ చేసుకుంటుంది**
**కచ్చితంగా**
**మనుషుల్లా**
**మోసం చెయ్యకుండా**

*– వోలేటి శ్రీనివాసరావు,*
*విజయనగరం*

ఆయన హృదయాంతరాళంలోకి చూస్తున్నట్టుగా చూస్తూ అన్నాడు.

"మన హిందూధర్మం పంచముల్ని అంటకూడదని ఉద్బోధిస్తోంది కదండీ?"

"కానీ... నా అంతరాత్మ అలా తోటి మానవుల్ని అంటుకోకపోవడం నేరం అని ప్రబోధిస్తోంది రాజూ"

'నిజంగానా?' అని అడగాలన్పించింది రాజుకు. కానీ అడగలేదు.

'రెలిజియన్ ఈజ్ డిఫరెంట్ ఫ్రం మొరాలిటీ' అని ఎప్పుడో... ఏ స్పెన్సరో... హెగ్జ్‌లేనో ప్రతిపాదించిన విషయాన్ని క్లాసుల్లో పాఠాలుగా చదవడం కాదు... ఇప్పుడు పరమేశ్వరశాస్త్రి నోట్లోంచి ప్రత్యక్షంగా వింటున్నాడు.

జపతపాలతో, యజ్ఞోపవీతంతో, సంధ్యావందనాలతో, వేదోపనిషత్తుల పఠనంతో కొనసాగిన ఒక బ్రాహ్మణత్వం.. పంచముల్ని అంటుకోవడం మహాపాపమన్న మత తత్వాన్ని వదలిపెట్టి తోటి మనుషులంతా వాళ్లని ఆదుకోవడమనే మానవత్వాన్ని ప్రదర్శిస్తుంటే... రాజుకు ఒక మనిషిలో కాదు.. సమాజం మొత్తం మీద మార్పు వచ్చిన భావం కలిగింది.

రెలిజియన్ మనిషికీ.. ఒక కనబడని, అసలుందో లేదో తెలీని శక్తికీ మధ్య ఉన్న సంబంధం.. ఇటీజ్ సూప్రా సోషల్.

మొరాలిటీ.. మనిషికీ అతని అంతరాత్మకీ అనుసంధానమైన బంధం... ఇటీజ్ సోషల్ అండ్ స్పిరిచ్యువల్.

ఆ పనిచేస్తే పాపం అంటుంది మతం.. చెయ్యకపోతే నేరం అంటుంది మొరాలిటీ.

మరి ఇప్పుడు.. రెలిజీయిన్ ముందు మొరాలిటీ ఓడిపోయిందా?

మానవత్వం ముందు మతం తలవంచిందా?

తప్పని పరిణామం ఇది.

ఎందుకంటే మానవుడు మతం అనుకుంటున్నది నిజమైన మతం కాదు. అసలు మతం కాదు.. మనిషి కాన్షియన్స్‌లోంచి ఉద్భవించిన ట్రూ రెలిజియన్ ఆత్మ సంబంధమైనది. హైలీ స్పిరిచ్యువల్. అది మనకు జ్ఞానానికి, అజ్ఞానానికి మధ్య అంతరాన్ని తెలుసుకునేలా చేస్తుంది. పారమార్థిక చింతనవైపు మనసును మళ్లిస్తుందని అంటారు శ్రీ అరవిందులు.

ఈ సంప్రదాయాలూ.. కట్టుబాట్లూ అన్నీ నకిలీవి. స్వార్థపరుడైన మనిషి... తన సుపీరియారిటీని నిలబెట్టుకునేందుకు... అసలైన మానవతా నిబద్ధమైన మతాన్ని వక్రీకరించి తదనుగుణంగా మలచుకున్నాడు. నేనెక్కువ అన్నాడు... నువ్వు తక్కువ అన్నాడు. మనుషుల మధ్య అంతరాలు సృష్టించాడు. తరతరాలుగా మనం అనుసరిస్తున్నది ట్రూరెలిజియన్ కాదు. జస్ట్.. క్రిప్టో రెలిజియన్ సూడో మిస్టిసిజమ్.. ఇది మతాన్ని మానవత నుండి వేరుచేస్తోంది.

మొదటి నుంచీ స్వార్థపరుడైన మనిషి ఆయా సామాజిక పరిస్థితుల కనుగుణంగా.. ఏదో ఒక సోషల్ ఈవిల్‌ని మతాచారం పేరుతో మరో మనిషిమీద రుద్దుతూనే ఉన్నాడు. మతం నుంచి బలవంతంగా వేరు చేయబడ్డ ధర్మం.. తన పోరాటం తను సాగిస్తూనే ఉంది.

కొందరు అతి తెలివితో సృష్టించిన రెలి

జియోనిజమ్‌లోని డాగ్మాస్‌నీ.. మతాన్ని రాజకీయం చేస్తూ మనిషి నిర్వచించిన ఈ ఫిక్స్‌డ్ రిజిడ్ మోరల్ కోడ్‌నీ.. అనాదిగా సోషల్ రిఫార్మర్స్ రూపంలో మొరాలిటీ ఎదుర్కొంటూనే వుంది. ఈ రెలిజియో పొలిటికల్, రెలిజియో సోషల్ సిస్టమ్స్ కూకటివేళ్లతో పెకలించబడితేనేగాని ట్రూ రెలిజియన్ మళ్లీ కళ్లు విప్పదు.

"ఇన్నాళ్లూ మీకు తెలీకుండా దాగిన ఒక నిజాన్ని ఇప్పుడు చెప్పాలన్పిస్తోంది" మెత్తగా అన్నాడు ఆలోచనల్లోంచి తేరుకున్న రాజు.

అలా అంటున్నప్పుడు అతని కళ్లు చాముండి కోసం వెదికాయి. మనిషి కనబడలేదుగాని తలుపు చాటునుంచి గాజులు గలగలమన్న శబ్దం వినబడింది.

రాజు గొంతు సవరించుకున్నాడు. "కానీ.. ఆ నిజాన్ని చెప్పేముందు అది మీ నుంచి ఎందుకు దాచాల్సి వచ్చిందన్న కారణాలను చెబుతాను. ఒక మనిషి తను తప్పు చేస్తున్నప్పుడు... అది అతనికి తప్పులా కనబడదు. పైగా తనాతప్పు చెయ్యటానికి... సవాలక్ష రీజనింగ్స్ సృష్టించుకుని.. తనను తను సమర్థించుకుంటాడు. చివరకు తను చేసేది రైట్ అన్న నిర్ణయానికి వస్తాడు. అదే తప్పును ఎదుటివాడు చేస్తున్నప్పుడు మాత్రం దాన్ని తప్పుగా గుర్తిస్తాడు. అందుకే.. మీలోని కులకాఠిన్యతను నా మాటల ద్వారా హరిజనుల మీద చూపించాను. వాళ్లను అవసరానికి మించి అసహ్యించుకున్నట్టు అభినయించాను. నాలోని మితిమీరిన అహంకారం బ్రాహ్మణులైన మీకే అసంబద్ధంగా అన్పించింది. మీకు తెలియకుండానే మీపట్ల మీకే ఒక వ్యతిరేకత కలిగింది. ఫలితంగా మీలోని మతధర్మాన్ని మానవ ధర్మం జయించింది" ఆగాడు రాజు.

పరమేశ్వరశాస్త్రి... రాజువంకే నిశితంగా చూస్తున్నాడు.

రాజు మళ్లీ మొదలుపెట్టాడు, "ఇక్కడ ఐమీన్ ఈ పల్లెల్లో ఒక పరిస్థితి వుంది. అది పట్నాల్లో లేనిది అంటే పూర్తిగా లేదనికాదు. మనసుల్లో కులపరంగా అంతర్లీనంగా తేడాలున్నా సభ్యత కోసం బయటపడరు. కానీ ఇక్కడ మాలపల్లెనీ మాదిగపల్లెనీ... మనుషుల్ని మరీ దూరంగా వుంచుతారు. వాళ్లని డిప్రెషన్‌కి గురి చేస్తారు. ఇదో బయోసైకలాజికల్ ప్రాబ్లమ్. మానసికంగా వాళ్లు దాన్ని యాక్సెప్ట్ చేసినంత కాలం అది సమస్య కాదు. ఎప్పుడైతే ఆ భావాన్ని భరించలేక వ్యతిరేకిస్తారో అప్పుడది సోషల్ ప్రాబ్లమ్ అవుతుంది. అయితే ఆ వ్యతిరేకత అనేది వారి మనసుల్లో ఎప్పుడు పుడుతుందంటే వాళ్లలో ఒక అవేర్‌నెస్ కలిగినప్పుడు.

ఆ అవేర్‌నెస్ కలగాలంటే వాళ్లెంతగా ఎక్స్‌ప్లాయిట్ చెయ్యబడుతున్నారో వాళ్లకి తెలియాలి. అలా దోపిడీ చెయ్యబడుతూ కూడా వాళ్లెంత నీచంగా చూడబడుచున్నారో అర్థం కావాలి. అందుకే వాళ్లని మాటలతో రెచ్చగొట్టాను. ఒక అగ్రకులజుడు వారిని ఎంత ఘోరంగా నిందించగలడో అంతగానే నిందించాను. తరతరాలుగా సమాజంలో వాళ్ళస్థానం ఎంత నీచమైందో చెప్పాను. వాళ్ల మనసుకు గాయమైంది. కళ్లలోంచి రక్తం చిమ్మింది. ఆత్మగౌరవం బుసకొట్టింది. చాలు.. ఆ తిరుగుబాటు తప్పకుండా వాళ్ల జీవిత విధానంలో మార్పు తెస్తుంది. తెచ్చి తీరుతుంది"

పరమేశ్వర శాస్త్రి రెప్పవాల్చకుండా అతడినే చూస్తున్నాడు. "నేను కోరుకున్న.. ఇంట్రాస్పెక్షన్ మీలో... అవేర్‌నెస్ వాళ్లలో కలిగింది. ఇక నాపని అయిపోయింది. కాబట్టి నిజం దాచాల్సిన అవసరం లేదు" ఒక్క క్షణం ఆగి.. శాస్త్రి కళ్లలోకి లోతుగా చూసి తలవాల్చుకుని చెప్పాడు రాజు, "నే

ను మీరంతా అనుకుంటున్నట్లు బ్రాహ్మడ్ని కాదు. హరిజనుడ్ని."



**శ్మ**శాన నిశ్శబ్దం అలుముకుని వుంద క్కడ. వాలు కుర్చీలో పడుకుని వున్న పర మేశ్వర శాస్త్రి పడుకున్న మనిషి పడుకు న్నట్టే వుండిపోయాడు. ఆయన దగ్గరికొచ్చి పలకరించే ధైర్యం లేక... వంటగది గడప నానుకుని నిస్త్రాణంగా కూర్చుండిపోయింది వైదేహి. శ్రీనివాసమ్మ మాత్రం కొడుకు ముఖంలోని గంభీరత కాస్త జంకు కలిగి స్తున్నా.. అక్కడ పేరుకున్న నిశ్శబ్దాన్ని చెదరగొడుతూ.. మనసులో సుళ్లు తిరుగు తున్న బాధను మాటల ద్వారా వెళ్లగక్కు తుంది.

"అసలీ చెక్రిగాడిననుకోవాలి. తగుదు నమ్మా అని వెంటేసుకొచ్చాడు అంటరాని వాడ్ని. నా మడి మైల చేశాడు. ఈ పాపం వూరికే పోదు."

అంత పని చేసిన మనుమడ్ని నమిలి మింగేయాలనుందామెకు. ఎదురుగా వుండుంటే ఆ పని చేసేదేమోగాని తను హరిజనుడ్నని ప్రకటించి ఆ గడపదాటిన రాజు వెనకే చక్రధర్ వెళ్లిపోయాడు.

"ఈ మాత్రంతో బయటపడ్డాం. సంతో షించాల్సిన విషయమే. ఆ త్రాష్టుడ్ని నమ్మి పిల్ల మెళ్లో వాడిచేత మూడు ముళ్లూ వేయించి వుంటేనా అందరం కట్ట కట్టుకు చావాల్సి వచ్చేది."

ఆ మాటని శాస్త్రి ముఖంలోకి శ్రీనివా సమ్మ చూసింది. ఆయన ముఖం ఆభా వంగా వుంది. చూపులు శూన్యంలో చిక్కుపడి ఉన్నాయ్.

శ్రీనివాసమ్మ లేచి కోడలికి దగ్గరగా వెళ్లింది.

"అమ్మాయ్ వైదేహీ.. బెంగతో వీడి గుండె చెదిరినట్టుందే!" దిగులుగా అంది. మళ్లీ అంతలోనే ఉద్వేగంతో చలించిపోతూ "అప్రాచ్యుడు.. వాడికిక పుట్టగతులుండవ్. పరమనిష్ఠా గరిష్ఠులం.. మనల్ని భ్రష్టు పట్టించాడు.. రౌరవాది నరకాలు అనుభ విస్తాడు."

ఎప్పుడూ రుద్రాక్షలు లెక్కిస్తూ ధ్యానం చేస్తూనో, సంస్కృత శ్లోకాలు వల్లిస్తూనో వుండే శ్రీనివాసమ్మ అవన్నీ మానేసి నిము షానికోసారి రాజును నిందిస్తోంది.

ఇన్నాళ్లుగా తమ ఇంట్లో మసలింది, తమలో ఒకడుగా మెలిగిందీ హరిజను డన్న సత్యాన్ని జీర్ణించుకోలేకపోతోందామె.

అగ్ని మధ్యలో తను నిలబడి తగలబడి పోతున్నట్టూ మహాసముద్రంలో మునిగి వూపిరాడక గిలగిలకొట్టుకుంటున్నట్లూ విపరీతమైన అనుభూతికి లోనవుతోంది.

"పూజ గదిలోకి వచ్చి మరీ ప్రసాదం తీసుకునేవాడు"

అంతవరకూ నిశ్శబ్దంగా ఉన్న వైదేహి గాఢంగా నిట్టూర్చింది.

"శివశివా" చెవులు మూసుకుంది శ్రీనివా సమ్మ.

"పిల్లేదండీ? " వైదేహికి చప్పున చాముండి గుర్తుకొచ్చింది.

శ్రీనివాసమ్మ గబగబ వెళ్లి చాముండి గదిలో చూసింది.

చాముండి లేదక్కడ. మిగతా గదుల్లో కూడా ఆమె జాడలేదు.

వైదేహి.. బావి దగ్గర.. స్నానాల గదిలో.. అంతా వెదికింది. ఊహుc.. కన

బడలేదు. చివరికి మేడపైన కూడా లేదు.

వాళ్లంత కంగారు పడుతున్నా.. ఏమీ పట్టనట్టు... తన మౌన ముద్రని వీడని... పరమేశ్వరశాస్త్రిని సమీపించి చెప్పింది శ్రీనివాసమ్మ గాభరా పడుతూ, "చాముండి కనబడడం లేదురా".

"పూజ గదిలో చూశారా?" అడిగాడు భృకుటి ముడిచి సాలోచనగా.

"చూళ్లేదు" చెబుతూనే హడావుడిగా వెళ్లి.. మూసివున్న గదితలుపును తోసింది వైదేహి.

ఆశ్చర్యం! పరమేశ్వరశాస్త్రి ఊహించినట్టే చాముండి అక్కడ ఉంది. దేవుడి విగ్రహం ముందు మఠం వేసుక్కూర్చుని చేతులు జోడించి తదేక ధ్యానం చేస్తున్నట్టుగా కళ్లు మూసుకుని వుంది. వైదేహి తలుపు నెట్టడం వలన అయిన చప్పుడుక్కూడా ఆమె తిరిగిచూడలేదు. కనీసం కళ్లయినా తెరవలేదు.

చాముండి దగ్గరకు వెళ్లబోతున్న శ్రీనివాసమ్మను వారిస్తూ అన్నాడు పరమేశ్వర శాస్త్రి "మీరు రేపిన ఆశలకు మనసు వికలమై అదలా సేదతీరుతోంది. కదల్చకండి."

ఆశలు రేపడం అనేమాట శ్రీనివాసమ్మకు రుచించలేదు. అందుకే అంది "ఏమిటో.. పిల్లవాడు బాగున్నాడనీ... మనవాడనీ అనుకుని జాతకాలూ చూశాం. ఇంత మాత్రానికే ఆశలు రేపడమేంటీ... నా శ్రాద్ధం."

పరమేశ్వరశాస్త్రి ఆమెకు బదులివ్వలేదు. కాసేపు నిశ్శబ్దం రాజ్యమేలిందక్కడ. ఎంతసేపటికీ ధ్యానం విరమించి కళ్లు తెరవని చాముండి వంక వైదేహి మాటిమాటికీ అసహనంగా ఆందోళనగా చూస్తోంది.

ఆ నిశ్శబ్దాన్ని భరించలేనట్టు అడిగింది శ్రీనివాసమ్మ పరమేశ్వర శాస్త్రిని "అవున్రా పరమేశూ! ఆ అంటరానివాడి ఆగమనంతో ఇల్లంతా ఎంగిలి మంగలం అయిందిగా...

> **కొత్తగాలి...**
>
> **కొమ్మల**
> **అడ్రసులు దొరక్క**
> **పక్షులు**
> **టవర్లపై వాలుతున్నాయి?**
>
> -కందాళై రాఘవాచార్య,
> బొబ్బిలివాడ, నిజామాబాద్

ఇప్పుడేం చేద్దామంటావ్? పుణ్యాజలం అదీ చల్లి... ఇల్లు శుద్ధిపెట్టాలిగా"

పరమేశ్వరశాస్త్రి ఒక్కక్షణం ఆమె వంక నిర్నిమేషంగా చూసి మౌనంగా తల తిప్పుకుని మిన్నకుండిపోయాడు.

"ఏ జన్మ పాపమో ఇది! మన ఖర్మ ఇలా తగలడింది. నువ్వు మరీ నొచ్చుకోకు నాయనా"

అప్పటికీ పెదవి విప్పలేదు శాస్త్రి.

"కానీ.. ఏం చేద్దాం.. ఇదంతా ఆ భగవత్ సంకల్పం. అంటరానివాడితో సహజీవనం.. సహపంక్తి భోజనం.. తెలియక చేసిన పాపమిది" గాఢంగా నిట్టూర్చింది.

వైదేహి అత్తగారితో చెప్పింది "మనం ఈ విషయం బయటకు పొక్కనీయకుండా వుండటం మంచిదండీ. వాడు మనింట్లో వుండటం అందరికీ తెలుసుగాని... ఏ రీతిలో వున్నాడో తెలీదుగా. ఏదో... పట్నంలో మా అబ్బాయితో పాటు చదివాడు గదాని... వూరు చూద్దామని వస్తే... నాల్రోజులు పంచలో తలదాచుకోనిచ్చాం అని చెబితే సరి. లేకుంటే నలుగుర్లో తలెత్తుకోలేం"

అప్పుడు భగ్నమైంది చాముండీశ్వరి ధ్యానం.

"అంతే.. అంతే.. కాకుంటే భ్రష్టు పట్టిపోమూ! సాటి కులస్థులు ఇక మనింట్లో మంచి తీర్థం పుచ్చుకుంటారా అని!"

కళ్లు విప్పిన చాముండి శ్రీనివాసమ్మ వంక లోతుగా చూసింది.

"బామ్మా"

"ఏం తల్లీ?" శ్రీనివాసమ్మ మనమరాలి వంక సంభ్రమంగా చూస్తూ అనునయంగా అడిగింది.

"మనం మైలపడ్డాం కదూ?"

"మెల్లగా అంటున్నావా?" దీర్ఘంగా నిశ్వసించిందావిడ.

"మన ఇన్నాళ్ల మడీ, ఆచారం అన్నీ మంటగలిపేశాడా నికృష్టుడు"

చాముండి కాసేపు ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్టూ వుండిపోయి తరువాత అంది "క్రితం సంవత్సరం తూర్పు వీధిలో రామశర్మగారి మనమరాలు... ఆరేళ్ల శివాని పసితనంలో తెలియక.... హరిజనుల పిల్లవాడు పెట్టిన సజ్జరొట్టే తిన్నదని ఆ పిల్ల నాలుక మీద ఉంగరం కాల్చి వాత పెట్టారు గుర్తుందా?"

"అవున్తల్లీ.... ఆచారమంటే ఆచారమే. అందులోనూ ఆ రామశర్మ మడీ తడీ అంటే మరీ పడి చస్తాడు".

"మరిబామ్మా" శ్రీనివాసమ్మను సంబోధిస్తోందేగాని చాముండి చూపులు తండ్రిమీదున్నాయి.

"మరి నేను... శివానీలా ఆహారం తినడం కాదు... మనసే ఇచ్చానే! ఆ పిల్ల శారీరకంగా మైలపడితేనే నాలుక మీద వాత పెట్టారు. మరిప్పుడు మానసికంగా మైలపడ్డ నన్నేం చేస్తారు?"

శ్రీనివాసమ్మ జవాబుకోసం తడుముకోలేదు. వెంటనే దులపరిస్తున్నట్టుగా అంది "ఆc... ఆ పిల్ల నలుగురూ చూస్తుండగా... ఆ రొట్టె ముక్కమింగి... రామశర్మ పరువు తీసింది. చిన్న పిల్లకదా అని వదిలెయ్యడానికి నామోషీ అడ్డొచ్చి.. ఆ తతంగమంతా చేశారుగాని నీ వ్యవహారం ఇక్కడెవడికి తెలుసూ? మనసిచ్చి పుచ్చుకోవడం లేదూ... గుమ్మడికాయా లేదుగాని నువ్ గప్‌చిప్‌గా వుండు".

"ఎవరూ చూడకపోతే... అనాచారం చేసినా ఫరవాలేదా బామ్మా?"

"అబ్బబ్బ వితండవాదం చెయ్యకు. ఏదో జరిగిపోయిందీ.. నలుగుర్లో అల్లరి పడకుండా గౌరవం కాపాడుకోవాలంటున్నా."

"అంటే.. ఆచారాలు నలుగురి కోసంగాని మన కోసం కాదన్న మాట"

"అలా అని నేనన్నానటే!" శ్రీనివాసమ్మ ఆశ్చర్యపోయింది.

"అనక్కర్లేదు. నీ మాటల అర్థం ముమ్మాటికీ అదే"

"శివ శివాc" రెండు చేతులతో చెవులు మూసుకుందామె.

"చాముండీ.. పెద్దావిడతో ఏమిటావాదన? ఈ ప్రస్తావన ఇంతటితో వదిలెయ్. ఆ అప్రాచ్యుడి పేరు ఇక ఎత్తకు" వైదేహి కసురుకున్నట్టుగా అంది.

"పేరెత్తకపోవటం. అతన్ని మరిచిపోవడం అలా ఉంచండి. ముందు నేను మనసా వాచా నమ్మిన ఆచారం మంటగలిసిపోయింది. ఎవరు చూసినా చూడకపోయినా నేను చేసింది పాపమని నాకు తెలుసు. మనసంతా నిండిపోయిన అతను నన్ను మైల చేసేశాడు. అందుకే నేనొక నిర్ణయానికొచ్చాను".

వేలి కొసలతో కణతలు అదుముకుంటూ అంతవరకూ ఆడవాళ్ల సంభాషణ వింటూండిపోయిన పరమేశ్వరశాస్త్రి చాముండికేసి చూశాడు.

తండ్రి చూపులను తప్పించుకుంటూ తలవంచుకుంది చాముండి.

"నేను.. నేను.." ఆమె ఆగింది ఒక్క తృటికాలం.

"ఆc.. నువ్వు!" రాజునేమైనా పెళ్లాడేస్తానంటుందేమోనని ఆరాటపడిపోతూ అంది శ్రీనివాసమ్మ.

"ఆత్మహత్య చేసుకుని చావాలనుకుంటున్నాను. ఒక అంటరాని వాడి... ఆక్రమణతో కలుషితమైన నా మనసును... నా శరీరంతో పాటూ మంటల్లో మాడ్చి మసి చెయ్యాలనుకుంటున్నాను."

ఆ మాటలంటూనే చాముండి అనూహ్యంగా లేచింది. ఒక్క ఉదుటున వంట గదిలోకి ప్రవేశించి దడాలున తలుపు మూసి గడియ పెట్టింది.

వంటగది గడపకివతలగా కూర్చుని వున్న వైదేహి తత్తరపాటుతో లేచి నిలబడింది.

శ్రీనివాసమ్మ దిక్కు తెలీనట్టుగా పరమేశ్వరశాస్త్రికేసి పరుగు పెట్టింది "ఒరే పరమేశూ.. పిల్లేదో అఘాయిత్యం చేసేస్తోందిరా".

ఊహించని ఆ పరిణామానికి... శాస్త్రి కాళ్లూ చేతులూ కంపించాయి. దిగజారిపోతున్న శక్తిని కూడగట్టుకుని కిటికీ దగ్గరకు ఒక అంగలో వెళ్లాడు.

ఆసరికే చాముండి... కిరోసిన్ డబ్బా మూత తీసేసింది.

"అమ్మా! చాముండి... ఆచారం కోసం ప్రాణాలను బలిపెట్టుకుంటావా?"

ఒళ్ళంతా కిరోసిన్ గుమ్మరించుకున్న చాముండి నిదానంగా తండ్రికేసి చూసింది "వెధవ ప్రాణం పోతే ఏం నాన్నా, ఆచారం మంటకలిశాక?"

"ఆచారం కన్నా ప్రాణం గొప్పదమ్మా"

విపరీతమైన ఆందోళనతో వణికిపోతున్న ఆయన పెదవుల మీంచి అస్పష్టంగా జాలువారిన ఆ మాటలు చాముండికి స్పష్టంగా విన్పించాయి.

తలుపులు బాది ప్రయోజనం లేక.. నోట్లో పవిటకొంగు కుక్కుకుని ఏడుస్తున్న వైదేహికేసి.. నిరుత్తరురాలై చలించిపోతున్న శ్రీనివాసమ్మకేసి ఓసారి చూసింది చాముండి.

ఆమె పెదవుల మీద అతిసన్నంగా విరిసిందో నవ్వు "మన ప్రాణం కన్నా ఆచారం గొప్పది కాదు. కానీ ఇతరుల ప్రాణం కన్నా మాత్రం అది చాలా గొప్పది. అవునా నాన్నా?"

"అవుననేంత అవ్యక్తుడిలా కనిపిస్తున్నానా చాముండీ నేను?"

"కన్పించటం లేదు అనటానికి ఆధారాలేమున్నయ్ నాన్నా?"

అవాక్కయినట్టు చూశాడాయన చాముండి వైపు. నిజమే... తనలోని వ్యక్తతకు నిరూపణేది?

చాముండేశ్వరి అగ్గిపెట్టె అందుకుంది. ఘొల్లుమంది వైదేహి. నిలువు గుడ్లు పడిపోయినయ్ శ్రీనివాసమ్మకు.

"ఏమండీ.... అది... అది అగ్గిపుల్ల గీసేస్తోందండీ"

"చాముండి" ఉద్వేగంగా చెప్పాడాయన "తల్లీ.. నీమీద ప్రమాణం చేస్తున్నా... ఇక మీదట కులమతాల కతీతమైన జీవితాన్ని జీవిస్తాను"

"మానవులంతా ఒకే కులము... మన అందరిదీ ఒకే మతము అంటూ ఎలిమెంటరీ స్కూల్లో చదువుకున్న పాఠం చెబుతున్నావా నాన్నా? ఇలాంటి స్టేట్‌మెంట్స్ ఇంతకాలంగా మనుషుల్లో మార్పు తెచ్చుంటే.. ఈసరికి మన ఈ సమాజ స్వరూపమే మారిపోయి ఉండేది. కోటలు దాటే ఈ మాటల మీద నాకు నమ్మకం లేదు. ఎందుకంటే కోటలు దాటాక ఆ మాటలు గాల్లో కలిసిపోవడం ఖాయం కాబట్టి"

చాముండి అగ్గిపెట్టె తెరచి ఒక పుల్ల బయటికి తీసింది. దాన్ని గీయబోతున్న దల్లా ఆగి శ్రీనివాసమ్మకేసి చూసింది.

"బామ్మా కళ్ళు తెరచిన దగ్గర్నుంచీ నీ ఒళ్లో పెరిగాను. ఉగ్గుపాలతో పాటూ నువ్వు రంగరించి పోసిన ఆచారాలను నర

నరంలో జీర్ణించుకుంటూ పెరిగాను. మడి బట్టలూ, కులం కట్టుబాట్లూ జీవిత పరమార్ధం అనుకున్నాను. అందుకే.... రాజు హరిజనుడన్న నిజం తెలియగానే తట్టుకోలేక.. మనశ్శాంతిని వెదుక్కుంటూ భగవంతుని సన్నిధిలో కూర్చున్నాను. ధ్యానం మధ్యలో జ్ఞానోదయమైంది. అసలిప్పుడు మనం పూజిస్తున్న దేవుళ్లది... ఏ కులం. అని నన్ను నేను ప్రశ్నించుకున్నా! శివుడు జంగముడు... కృష్ణుడు యాదవుడు... ఇక మన కులదైవం శ్రీనివాసుడు కులాంతరమే కాదు మతాంతర వివాహం చేసుకున్నవాడు. మనం మడికట్టుకుని ఆరాధించే దేవుళ్లది మన కులం కాదు. మరి మనకన్నా తక్కువ కులంలో పుట్టిన దేవుణ్ని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తూ... పాపం.. ఆ దేవుడి కులానికి చెందిన మనుషుల్ని మాత్రం... కాళ్లకింద అణిచిపెడుతున్నాం. దీన్నిబట్టి చూస్తే ఆచారం ఎంత వెర్రిబాగులదో అర్థం కావడం లేదూ? "

శ్రీనివాసమ్మ కిటికీ వూచల్ని ఆనుకుని నిలబడి చాముండి చెప్పేది శ్రద్ధగా వింటోంది.

చాముండీ మళ్లీ అంది "ఆ పనికిమాలిన ఆచారాల కన్నా.... పవిత్రమైన ప్రేమ గొప్పదనుకుంటున్నా బామ్మా. అందుకే.. బతికి ఆచారానికి బలైపోయేకన్నా.. చచ్చి ప్రేమకు బలైపోవడం మేలనుకుంటున్నా".

"చాముండీ.. ఏమిటీ ఆ పిచ్చి మాటలు.. తలుపు తెరువమ్మా.. నా తల్లి కదూ!" వైదేహి వెక్కివెక్కి ఏడుస్తోంది.

"చెప్పండి.. అది చెప్పినట్టే వింటామని చెప్పండి" అత్తగార్నీ.. భర్తనూ బ్రతిమాలుతోందామె.

"చాముండీ భగవంతుని మీద ప్రమాణం చేసి చెబుతున్నా. నిన్ను రాజుకిచ్చి పెళ్లి చేస్తాను. బయటకు రా తల్లీ" ఒక నిర్ణయానికొచ్చినట్టుగా చెప్పాడు పరమేశ్వర శాస్త్రి.

> ## కొత్తగాలి...
>
> **ముక్కూ మొహమూ**
> **మాట తీరూ ఓకే మరి**
> **మనసు మాటేమిటి?**
>
> – బద్ది నాగేశ్వరరావు,
> అనకాపల్లి

ఒక్కపెట్టున నవ్వింది చాముండేశ్వరి "పెళ్లి చేసి.. నన్ను హరిజన వాడకు పంపిస్తారా నాన్నా? ఎక్కడో ఒక చోట నా కూతురు ప్రాణాలతో వుంది అన్న సంతృప్తితో జీవిస్తారా? "

"మరి మమ్మల్నింకేం చెయ్యమంటావే? " దుఃఖంతో గొంతు పూడుకుపోతుండగా అసహాయంగా ఆవేశంగా అరిచింది వైదేహి.

"హరిజన వాడను ఊళ్ళోకి తీసుకొచ్చి నా పెళ్లి జరిపించండి."

వైదేహీ.. శ్రీనివాసమ్మా.. ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"అది మనకుటుంబం వల్ల అయ్యేపని కాదమ్మా"

"కోట్ల సంఖ్య అయినా ఒక్క అంకెతోనే మొదలవుతుంది నాన్నా. ఒక్కరు ముందు తెగిస్తే వందమంది వెనక నడుస్తారు".

"సాధ్యమవుతుందా తల్లీ? "

"కులాన్నీ మతాన్నీ ప్రేమించడం మాని.. మనిషినీ మానవత్వాన్నీ ప్రేమించడం మొదలుపెడితే.. కచ్చితంగా సాధ్యమవుతుంది."

పరమేశ్వరశాస్త్రి... మౌనంగా చాముండికేసి చూస్తూండిపోయాడు.

"మీకు చేతకాదు. హరి హరీ... అని ఒక వంక హరిని పూజిస్తూనే హరిజనుల్ని అవ

మానించే వాళ్లు మీరు."

చాముండి చేతిలో అగ్గిపుల్ల భగ్గు మంది.

"ఆగు చాముండీ" కంఠనాళాలు తెగేలా అరిచాడు పరమేశ్వరశాస్త్రి. "నే చెప్పేది కాస్త విను. రాజుతో జరిగే నీ పెళ్లి... ఇక్కడ మనుషుల్లో మౌలికమైన మార్పు తెస్తుందన్న నమ్మకం నాకుంది. వ్యక్తిగత స్వార్థం కోసం కాదు. వ్యవస్థాగతమైన మార్పుకోసం అది జరిగి తీరాలి. ప్రస్తుతం నీ పెళ్లి ఒక సత్వర సామాజిక అవసరం"

చాముండేశ్వరి చేతుల్లో భగభగలాడు తున్న అగ్గిపుల్ల చప్పున ఆరిపోయింది.

★ ★ ★

"సెంద్రమ్మా.. పెశిరెంటుగోరచ్చింద్రు"

గుమ్మంలో నిలబడ్డ మోహన్‌రెడ్డినీ.. అతని వెనకే నిలబడివున్న వీఏఓని చూసి ఆకలితో నేల కతుక్కుపోయివున్న నాగ రాజు లేచి నిలుచోబోయి తూలిపడ్డాడు.

చప్పున పట్టుకున్నాడు మోహన్‌రెడ్డి.

ఎస్ఐ సాగించిన దౌర్జన్యకాండలో తలకు బలమైన గాయం తగిలి... అది సలుపుతుంటే... మగతగా కళ్లు మూసు కుని పడుకుని వున్న చంద్రకళ చివుక్కున కళ్లు విప్పింది.

"నేను తక్షణమే కలెక్టర్ దగ్గరకి వెళుతు న్నాను. ఈ ఊరికి ప్రెసిడెంటుగా నేనింకా ఈ విషయాన్ని ఆయన దృష్టికి తీసుకెళ్ళ కపోతే చట్టం దృష్టిలో నేను నేరస్థుడ్నవు తాను. మీరేదో సాధిస్తారనీ మీకిచ్చిన మాటకోసం ఇంతవరకూ ఆగాను. ఇక నావల్ల కాదు"

చంద్రకళ వెంటనే అంది "ఇంకొక్కరోజు ఆగండి"

"ఇంకొక్క రోజు ఆగితే... ఇంకో నలు గురు పసిపిల్లలు ఆకలితో చస్తారు. మరో రెండో మూడో ముసలి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోతాయి. ఈ మారణ హోమంతో ఏం సాధిస్తావు చంద్రకళా? "

చంద్రకళ ఏదో అనబోయింది. గాయం కలుక్కుమంది. బాధగా నొక్కుకుంటూ... తన ఎదురుగా కూర్చునివున్న రాజు వంక చూసింది, మోహన్‌రెడ్డి ప్రశ్నకు సమా ధానం చెప్పమన్నట్టు.

"ఈ మారణ హోమంతో మేము సాధిం చబోయేది ఒక అనూహ్యమైన మార్పు. రాక్షసుడిలాంటి మనిషిలో పశ్చాత్తాపం రేకెత్తి హృదయపు అట్టడుగు పొరల నుంచి జనించబోయే ఒక పరివర్తన"

"అది అసాధ్యం. ఒక్క చట్టమే ఇప్పటి పరిస్థితిని చక్కబరుస్తుంది. నేనసలు ఈపని ఎప్పుడో చేసుండేవాడ్ని. ఈ చంద్ర కళ అభ్యర్థనకు కట్టుబడ్డాను. ఆకలిచా వులు కూడా సంభవిస్తుంటే ఇక చూస్తూ ఊరుకోలేను. హృదయమే లేని మను షుల్లో మార్పును ఆశించడం అవివేకం"

"సరే.. ఇప్పుడు మీరేం చేస్తారండీ? " అడిగింది చంద్రకళ.

అప్పటికే... చంద్రకళ, ఇంటి ముందు ఒక్కొక్కరూ గుమిగూడుతున్నారు. ప్రెసి డెంట్‌గారొచ్చారనే వార్త విని ఓపిక లేకపో యినా ఆకలి కడుపుల్ని అరచేతుల్తో అదు ముకుంటూ వస్తున్నారక్కడికి వాడజనం.

వీఏఓ కల్పించుకున్నాడు "ఏం చేస్తా మంటే.. ఈ విషయాన్ని వెంటనే అధికా రుల దృష్టికి తీసుకెళతాం"

"ఇదే పని నా ఫ్రెండ్స్ కూడా చేశారు... అప్పుడా ఎస్ఐ ఏం చేశాడు? "

"అగ్రకులాల వాళ్ళ కొమ్ముకాస్తూ మీ మీద జులుం చేశాడు. కానీ ఒక పబ్లిక్ సర్వెంట్ ప్రజల్ని రక్షించవలసినవాడు... ఆ విధంగా అధికార దుర్వినియోగం చేస్తే అట్రాసిటీ ఆక్టు ప్రకారం అతనికి.. దాదాపు అయిదేళ్ల కారాగార శిక్ష పడుతుం దని మీకు తెలీదేమో!" చెప్పాడు వీఏఓ.

"ఆ విషయం మాకు తెలుసండీ.

ఇప్పుడు మీరీ విషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసుకెళితే స్పాట్ ఇన్‌స్పెక్షన్ కోసం డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటూ... పోలీస్ సూరింటెండెంట్ వస్తారనీ... ఇక్కడి బాధితుల్ని పరామర్శిస్తారనీ... తెలుసు. ఎస్పి గారు ఫస్ట్ ఇన్‌ఫర్మేషన్ రిపోర్ట్ ఇక్కడి పోలీస్ స్టేషన్‌లో రిజిష్టర్ చేస్తారనీ... పోలీస్ ఫోర్స్‌నీ మాకు తక్షణ సహాయం అందించమని పురమాయిస్తారని కూడా తెలుసు. వాళ్లు ఇక్కడి బాధితులకు రిలీఫ్ ఫండ్స్ అందిస్తారు. ఆహారమూ... బట్టలూ... పంచుతారు. వైద్య సహాయం చేస్తారు. మమ్మల్నీ స్థితికి తీసుకొచ్చిన వాళ్ల మీద కేస్ ఫైల్ చేస్తారు. వాళ్లకు శిక్షలు విధిస్తారు. కానీ ఆ తర్వాత ఈ తతంగమంతా ముగిసి.. మీ భాషలో చెప్పాలంటే.. పరిస్థితులు ప్రశాంతంగా మారాక... ఏమవుతుంది? మాళ్లీ ఊడిగం మొదలవుతుంది. హరిజనుడు ఎప్పటికీ అంటరానివాడిగానే మిగిలిపోతాడు. దట్సాల్" ఆవేశంగా అన్నది చంద్రకళ.

ఏదో అనబోతున్న మోహన్‌రెడ్డిని అడ్డుకుంటూ చెప్పాడు రాజు "చట్టం నేరస్థుడ్ని పట్టుకుని శిక్షిస్తుంది. కానీ అతనిలో అంతర్గతమైన మార్పును ఎప్పటికీ తీసుకురాలేదు. ఇక్కడ మనుషుల దృష్టిలో... వెలివేయటం అనేది నేరం కాదు. రెలిజియస్ లీ రైట్. మీ చట్టం అది నేరమని చెప్పినా.. శిక్షించినా వాళ్ళు దాన్ని యాక్సెప్ట్ చెయ్యరు. అందుకే... వాళ్లలోని మానవత్వం నిద్రలేచి.... మీరు చేస్తోంది తప్పు అని చెప్పేవరకూ మేము ఎదురు చూడదల్చుకున్నాం. వాళ్లకై వాళ్లు మమ్మల్ని చేతులుచాచి ఆహ్వానించే వారకూ... ఆగదలుచుకున్నాం"

మోహన్‌రెడ్డి విషాదంగా నవ్వాడు "ఈలోపు ఆకలి చావుల సంఖ్య... నువ్వూ నేనూ కలిసి లెక్కపెట్టుకోలేనంతగా పెరిగిపోతుంది. అప్పుడు..."

అతని మాటల్ని మధ్యలో అందుకుంది చంద్రకళ "అప్పుడు... నెమళ్ళ లంకలో హరిజనవాడ ఉండదు. అంటరానితం ఉండదు"

"ఇదేనా మీ నిర్ణయం?"

"అంతే"

మోహన్‌రెడ్డి మెనుదిరిగి జనానికేసి చూశాడు.

"మీరు దీనికి ఒప్పుకుంటున్నారా? మీకు చట్టపరమైన రక్షణ అక్కర్లేదా?"

గుంపులోంచి ఒక స్త్రీ ముందుకొచ్చింది.

"గవురం లేని బెతుకులు మాకేంటికి? ఇంక నాల్రోజులు ఉగ్గబట్టినమంటే.... ఎదవ పేనం గుటుక్కుమంటది. బెతికినం తకాలం... కుక్కమారి శీపో అన్పిచ్చుకునే బొదులు.. ఇట్ట జావడమే మేలు"

మోహన్‌రెడ్డి మౌనంగా ఓ అడుగు ముందుకు వేశాడు.

"సర్" పిలిచింది చంద్రకళ.

"దయచేసి ఈ మహాయజ్ఞానికి అడ్డురావద్దు. మీరు ఇక్కడి విషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసికెళ్లనని నాకు మాటివ్వండి"

మోహన్‌రెడ్డి దారికి అడ్డంగా నిలబడి చేతిని ముందుకు చాపింది. వెనువెంటనే రాజు కూడా తన చేతిని చాపాడు. చూస్తుండగానే... వాడ వాడంతా మోహన్‌రెడ్డికేసి చేతులు చాపింది.

ఆకలి కన్నా ఆత్మగౌరవం ఇంత గొప్పదా?

అబ్బురంగా చూశాడు మోహన్‌రెడ్డి వారికేసి.

ఇలాంటి వారికి సహాయం చెయ్యటానికి చట్టం అక్కర్లేదు. మరేం కావాలి?

సహకారం. అవును, తనుగనుక అది అందిస్తే వీళ్లు అనుకున్నది సాధిస్తారు.

మోహన్‌రెడ్డి కళ్లతోనే వారికి మాటిచ్చి

మౌనంగా సాగిపోయాడు.

★ ★ ★

"ఎవరి ఆచారం వాళ్లదే కావచ్చు. సంప్రదాయాలూ కట్టుబాట్లూ వేరు కావచ్చు జీవన శైలిలో తేడాలుండొచ్చు

కానీ ఈ సంఘంలో ఒక మనిషి... మరో మనిషి అవసరం లేకుండా కచ్చితంగా బతకలేడు. ఒక కులం అది ఏదైనా సరే... సజావుగా సంఘంలో మనుగడ సాగించాలంటే... ఎన్నో ఇతర కులాల సహకారం ఉండితీరాలి, అదే జాజ్‌మనీ సిస్టమ్.

అడవిని అర్బనైజ్ చేసిన తరవాత అనాగరికుడు నాగరికతను సంతరించుకుని ఆలోచించాడు. సంఘాన్నే కుటుంబంగా భావించి అందులోని సభ్యులకు తలోపనీ చేసుకుని ఐక్యంగా జీవించమని ఆదేశించాడు. అతని ఆదేశం మేరకు కొందరు విద్యను బోధించారు... కొందరు పాలనా యంత్రాంగంగా మారారు. ఇంకొందరు ఆహారాన్ని ఉత్పత్తి చేశారు. మరికొందరు ఆ ఉత్పత్తుల్ని అమ్మే వర్తకులయ్యారు.

కొందరు బట్టలుతికారు, కొందరు కుండలు చేశారు... ఇలా ప్రతిపనికీ ఒక వర్గం తయారైంది. ఆయా వర్గాల గుర్తింపు కోసం... ఒక్కో పేరును సూచించుకున్నారు. ఒకరి సహకారాన్ని మరొకరు పొందుతూ కలిసికట్టుగా జీవించారు.

పని చేసేవాడు పార్జాన్. చేయించుకునేవాడు జాజ్‌మన్. వీళ్ళ మధ్య వుండేది యజమానీ సేవక సంబంధం కాదు. పరస్పర సహకారం. పార్జాన్ జాజ్‌మన్‌కి కావలసిన పనులన్నీ చేస్తాడు. జాజ్‌మన్ పార్జాన్ అవసరాలన్నీ తీరుస్తాడు. అంతే ఇక్కడ ఎక్కువ తక్కువల ప్రశ్నే లేదు. కేవలం వర్టికల్ యూనిటీ... సంఘ జీవనానికి ఆయువు పట్టులాంటి పరస్పర సహకారం.

క్రమంగా ఆ పద్ధతి పట్టుతప్పింది. మనిషిలో స్వార్థం వెర్రితలలు వేసింది. సహకార వ్యవస్థ దోపిడీ వ్యవస్థగా మారింది. అహం బుసలు కొట్టింది. అంతరాల్ని సృష్టించింది. ఆర్థిక అసమానతలు... జాజ్‌మన్ వ్యవస్థ స్వరూపాన్నే మార్చివేశాయి.

'నీకంటే నేనెక్కువ' అన్న భావన... మనుసులో వేళ్లూనుకుంటూ నాటుకుంది. ఒకరు చేస్తున్న పనిపట్ల ఒకరికి విముఖత ఏర్పడింది. చిన్నచూపు మొదలైంది. నాగరికతను సంతరించుకున్న మానవుడు తిరిగి అనాగరికుడయ్యాడు. నీదో కులం నాదో కులం అన్నాడు.

నిన్ను అంటుకుంటే నేను మైల పడతానన్నాడు. ఒకడు మడిబట్టతో మనసును చుట్టేసుకుంటే.. ఇంకొకడు అధికారంతో మానవ సంబంధాలను నరికేశాడు... పురాణేతిహాసాలకు కులతత్వాన్ని అంటగట్టాడు. వేదాల్లో ఉపనిషత్తుల్లో రాయని విషయాలను సంఘం మీద రుద్దాడు.

వీడ్ని... తిరిగీ నాగరికుడిగా మారిస్తే గాని ఈ వ్యవస్థ బాగుపడదు.

మార్చాలంటే ఒక్కటే మార్గం సోషల్ ఐసోలేషన్. ఒక గ్రూప్ ఇంకో గ్రూప్‌కి సహాయం చెయ్యకూడదు, సహకారం అందించకూడదు.

నో... వర్టికల్ యూనిటీ... నో మ్యూచువల్ ఎయిడ్... ఇక్కడ... జాజ్‌మనీ సిస్టం పూర్తిగా బ్రేకవుతుంది.

అప్పుడే... మనిషి... ఎదుటి మనిషి విలువనీ... అతనితో తనకున్న అవసరాన్ని గుర్తిస్తాడు..." చక్రధర్ చెబుతున్నదాన్ని వింటూ ఆలోచిస్తున్నాడు మోహన్ రెడ్డి. అతని కెదురుగా కూర్చుని ఉన్నాడు వీవీవో. ఆలోచిస్తున్న అతనికేసి ఆసక్తిగా చూస్తున్నారు శమంతారెడ్డి, వినీతాశర్మ ఇంకా మిగిలిన అమ్మాయిలంతా.

అందరూ మోహన్‌రెడ్డి ఇంట్లో సమావే శమైవున్నారు.

"అది బ్రేక్ అవ్వాలంటే సమ్‌థింగ్ షుడ్ బి డన్" శమంత చక్రధర్‌తో అంది.

"ఆ సమ్‌థింగ్ అనేదేమిటో తేలాలి ప్పుడు" అందరూ ఆలోచనలో మునిగారు.

"అయిడియా" ఉన్నట్టుండి అన్నాడు చక్రధర్. అందరూ ఆసక్తిగా అతనికేసి చూశారు.

తన మనసులో మెదిలిన దాన్ని చెప్పా డతను.

"ప్లాన్ బాగానే ఉంది గాని... వర్క వుట్ అవుతుందా? " వినీత అనుమానంగా చూసింది.

"చేసి చూద్దాం ఫెయిలైతే మరోటి ఆలో చిద్దాం" మంజుల అంది.

"కానీ..." మోహన్‌రెడ్డి అన్నాడు. "ఒక వేళ మన ప్లాన్ సక్సెస్ అయి సోషల్ ఐసోలేషన్ సాధించగలుగుతామే అను కోండి.. ఒకరోజు రెండ్రోజుల్లో దాని ఎఫెక్ట్ కనబడకపోవచ్చు ఇట్ మే టేక్ ఎ వీక్ ఆర్ స్టిల్ ఎ లాంగ్ పీరియడ్. మరి అన్ని రోజులపాటు అన్నాహారాలు లేని వాడజనం బతికుంటారా? "

"అన్ని రోజులు కాదు... కేవలం ఇంకో రెండు రోజులు వాళ్లు నిరాహారంగా వుంటే చాలు... చావు ఖాయం" దిగులుగా అన్నాడు చక్రధర్.

"అయితే మనం అనుకున్నట్టూ ఈ ప్లాన్ ద్వారా గ్రామస్థుల మనస్సుల్లో ఒక కాన్‌ఫ్లిక్ట్ తీసుకురాగలిగితే తప్పకుండా విజయం సాధిస్తామన్పిస్తుంది" ఇందాకటి ప్లాన్నే సపోర్ట్ చేస్తూ అన్నాడు వీపీవో.

మోహన్‌రెడ్డి ఎటో చేస్తూ దీర్ఘాలోచ నలో మునిగిపోయాడు.

"ఏమిటి సర్ అంత ఆలోచన! ఈ గ్రామానికి ప్రెసిడెంట్ మీరు... వాడజనా నికి రహస్యంగా కాస్త ధాన్యం సప్లయ్ చెయ్యలేరా? "

> **కొత్తగాలి...**
>
> **ఒకప్పుడు - పల్లెలు - ప్రేపల్లెలు**
> **నగరాలు - నయాగరాలు**
> **నేడో - పల్లెలు - పల్లేరులు**
> **నగరాలు - మసాలా గరంగరాలు**
>
> —రా.వెం.శర్మ, గుంటూరు

మోహన్‌రెడ్డి చప్పున ఆ మాటలన్న శమంతారెడ్డి వంక చూశాడు "ఆ పని ఎప్పుడో చేసుండేవాడ్ని... ఆ చంద్రకళ కాదనకుంటే"

"అప్పుడంటే కేవలం ఆత్మాభిమానంతో వద్దన్నది. ఇప్పుడు మన ప్లాన్ వివరంగా చెప్పాక తప్పక ఒప్పుకుంటుంది" అంది వినీతా.

"సరే.. ఆ విషయం నేను చూసుకుం టాను" చెప్పాడు మోహన్‌రెడ్డి.

చక్రధర్ లేచి ఎటో వెళ్లిపోయి అరగంట తరవాత తిరిగొచ్చాడు. అతని చేతిలో పదో పన్నెండో మోకుల్లాంటి తాళ్లున్నాయి. అమ్మాయిలు తలొకటి అందుకున్నారు.

చివరగా మిగిలిన తాడుని తను తీసు కుంటూ చెప్పాడు చక్రధర్. "బాగా మబ్బులు పట్టివున్నాయ్. వర్షం వస్తుం దేమో? "

"అవును... ఉదయం రేడియోలో విన్నా... సముద్రంలో వాయుగుండం ప ట్టిందట" చెప్పాడు వీపీవో.

"రేడియోలో అనౌన్స్ చేశారంటే... కచ్చి తంగా వర్షం రాదు" నవ్వింది వినీత.

మోహన్‌రెడ్డి వాచీ చూసుకున్నాడు. సాయంత్రం అయిదు కావస్తోంది. "ఇదే మంచి అదను. పనీ పాటల నుంచి జనం ఇళ్లకొచ్చే వేళ ఇది"

అందరూ లేచారు. చక్రధర్ ముందుకు వస్తుంటే అమ్మాయిలంతా అతన్ని అనుస

రించారు. మోహన్‌రెడ్డి ఇంటి నుంచి రెండు ఫర్లాంగులు నడిచాక ఎదురైంది. పంచాయితీ ఆఫీస్. దానికెదురుగా వున్న రచ్చబండ మీదకు చేరారంతా. రచ్చబండకు ఆనుకుని వుంది శాఖోపశాఖలుగా విస్తరించిన ఓ వేపచెట్టు.

అందరూ తలలెత్తి... దాని కొమ్మలకేసి చూశారు. తిరిగీ తమ చేతుల్లోని తాళ్లకేసి చూసుకున్నారు.

ముందుగా చక్రధర్ తాడు ఒక చివరను ఉచ్చులా బిగించి రెండో కొనను బలమైన కొమ్మ మీదికి విసిరాడు. తరవాత దాన్ని అందుకుని గట్టిగా ముడివేశాడు.

★ ★ ★

"ఏందయ్యా అది? "

దారిన పోతున్న ఒకరిద్దరు ఆగి ఆశ్చర్యంగా అడిగారు.

"ఉరితాడు" అడిగిన వ్యక్తికేసి సూటిగా చూస్తూ చెప్పాడు. చక్రధర్.

"అద్దెలుస్తాందిలే! అదేంటికని? "

"చావడానికి"

"ఏందీ... వూరికి నడి బొడ్డున... రచ్చబండకాడ... పెబ్బిలిగ్గా... వురిపోసుకోని సచ్చవా? యాందీ అన్నాయం? " మెల్లగా ఒక్కొకరే పోగవుతున్నారు.

"ఇది కుటుంబ సమస్య అయితే మా ఇంట్లోనే ఉరిపోసుకునేవాడ్ని. ఇది ఊరి సమస్య. అందుకే ఈ స్థలం ఎన్నుకోవాల్సి వచ్చింది. ఇప్పుడు నేనొక్కడ్నేకాదు, ఇదుగో ఈ అమ్మాయిలందరూ కూడా నాలాగే ఒకరి తరువాత ఒకరు ఉరిపోసుకు చావాలని నిర్ణయించుకున్నారు."

అక్కడున్న నలుగురూ నివ్వెరపాటుతో నోళ్లు వెళ్లబెట్టారు. చూస్తుండగానే నలుగురూ నలభైమందయ్యారు.

"పెదరెడ్డి ఇంటి కొచ్చింద్రే... పట్నం పిలకాయిలు ... ఆల్లూ... మన శాస్తుర్లు గోరి కుమారుడు సెక్రదరం బాబూ... రచ్చబండ కాడ ఉరేసుకు సత్తామని... మనసుల్ని బెదర గొడతన్నారంట"

"ఎట్టెట్టా... అసలికి ఆడపిలకాయిలు యాడ్నుంచో వచ్చి ఈడ జావడమేందంట! మన సెక్రదరం బాబు ఆల్లతో గలవడమేంది? అట్టా ఆగడం సైడమేంది? "

నలభైమంది నాలుగొందల మంద య్యారు.

రచ్చబండ చుట్టూ జనం.. ఇసకేస్తే రాలనట్టు అందరి కళ్లూ చెట్టుకొమ్మలకు వేళ్లాడుతున్న ఉరితాళ్లను, చావడానికి సిద్ధంగా ఉన్న అమ్మాయిలనూ మార్చి మార్చి చూస్తున్నయ్.

"సెక్రదరం బాబూ... యామిడిదీ దురు బుద్ధి? ఏంటికీ పని సేస్తుండరు? "

"ఎందుకంటే..." చక్రధర్ చుట్టూ చేరిన జనం వంక తీక్షణంగా చూస్తూ చెప్పాడు "సాటి మనుషుల్ని కులం పేరుతో దూషించి అంటరాని వాళ్లంటూ వెలివేసిన బ్రాహ్మణ కులంలో పుట్టినందుకు పశ్చాత్తాపంతో రగిలిపోతూ ఉరేసుకుంటున్నా"

అతని మాటలు ముగుస్తుండగానే శమంతారెడ్డి అంది "నేనెందుకు చావబోతున్నానో తెలుసా? ఆ వెలి కార్యక్రమంలో పాలుపంచుకుని తోటి మానవుడికి అన్నాహారాలు అందకుండా చేసిన రెడ్ల కులానికి ప్రతినిధినన్న సత్యాన్ని భరించలేక ఆవేదనతో ప్రాణత్యాగం చేస్తున్నా."

"ఆ వెలిలో భాగస్వాములైన వైశ్య కులంలో జన్మనెత్తినందుకు అసహ్యంతో నేను చస్తున్నా"

"క్షత్రియకులంలో పుట్టినందుకు విచారిస్తూ నేను ఉరి పోసుకుంటున్నా"

"అగ్రవర్ణాల చేత... ఛీత్కరించబడుతూ కూడా వాళ్లకే సేవలు చేసుకుంటూ... నాకన్నా తక్కువ జాతి మరొకటుందన్న అహంలో ఆనందాన్ని వెతుక్కోవడం కోసం ఆత్మవంచన చేసుకుంటూ.. బతుకుతున్న

శూద్ర కులంలో పుట్టినందుకు నన్ను నేను క్షమించుకోలేక.. చావుని ఆహ్వానిస్తున్నా"

"పంచములనీ.. అంటరాని వారనీ.. పేర్లు పెట్టి .. కుక్కలకన్నా హీనంగా చూస్తున్నా... చేతులు కట్టుకుని పది పం చలమ్మటి నిలబడి.. కాళ్లు మొక్కి కాసిని తిండి గింజలకు దేవుళ్లాడు సిగ్గులేని బతుకు బతుకుతున్న హరిజనులకు వార సురాలిగా మానాభిమానాలు పోయాక ప్రాణాలు విలువలేనివని చెప్పటానికి నన్ను నేను ఉరి తీసుకుంటున్నా.."

చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్దం అలుముకుందక్కడ. వందల మంది గుమికూడి ఉన్నా ఒక్కరు కూడా లేనంత స్తబ్దత.

ఆ స్తబ్దతను బద్దలు చేస్తూ వినబడింది తిరిగి చక్రధర్ గొంతు "ఏం మేము చస్తున్నామంటే ఇంతమంది కట్టగట్టుకు వచ్చారు! హరిజన వాడలో జనం చస్తుంటే ఒక్కరూ పట్టించుకోరేం? "

"అనాచారం జేసింద్రూ.. ఆ పాపం కట్టి కుదుపుతొంటే సస్తంద్రూ. బగమంతుడే సిన సిచ్చది. మన సేతుల్లో యాముం డది? "

జనంలో ఎవరో నిట్టూర్చారు.

ఆ మాటలన్న వ్యక్తి కేసి నిశితంగా చూశాడు చక్రధర్ "ఒకప్పుడు భర్త పోయిన స్త్రీని బతికుండగానే బలవంతంగా చితిమీద పడుకోబెట్టి దారుణంగా సాముూహికంగా హత్యచేస్తూ... సతీ సహగ మనం... మన హిందూ ధర్మం అన్నారు. నువ్విప్పుడు దాన్ని ఒప్పుకొంటావా?

బాల్యవివాహాలు ఆచారమన్నది అప్పటి సమాజం. అనాచారమంటుంది ఇప్పటి సమాజం. దేవదాసీ వ్యవస్థ ఒకప్పటి సంప్రదాయం, నేడు హేయమైన నేరం.

అసలైన మతం మానవత్వాన్ని ప్రబోధి స్తుంటే.. స్వార్థ ప్రయోజనాలకోసం మతం పేరుతో ప్రచారమవుతున్న పిడివాదం మానవాళి పట్ల వినాశకరశక్తిగా మారింది.

మార్క్స్ అన్నాడు 'రెలిజియన్ ఈజ్ ఓపియమ్' అని. నిజం! అది మత్తు మందులా మారి మీ మనసుల్ని నిద్రాణ స్థితిలోకి తీసికెళుతోంది. కులమతాల మత్తులో పడి మీరు విచక్షణా జ్ఞానాన్నే కోల్పోతున్నారు.

మత్తుతో జోగే మనిషి ఒక్క చెంపపెట్టుతో జాగృతమైనట్టు.. ఆచారాల మత్తులో జోగే మీకు మా చావులు చెంప పెట్టుకావాలి? "

మెల్లగా ఈదురుగాలి మొదలైంది.

జనంలోని స్తబ్దతా నిశ్శబ్దతా మాయమై పోయింది.

ఎవరికి తోచింది వాళ్లు మాట్లాడు కుంటూ ఉండటంతో ఆ ప్రదేశమంతా రణగొణ ధ్వనులతో నిండిపోయింది.

## పక్కింటి వాళ్లను అడుగు

గాలిబ్‌కు ఎక్కడెక్కడినుంచో అనేక మంది ఉత్తరాలు రాసేవారు. వాటికి



ఆయన ఎంతో ఓపికతో సమాధానాలిచ్చే వాడు. ఓసారి తన మిత్రుడు అల్లావుద్దీన్ అహమద్ ఖాన్ ఆరోగ్య, క్షేమ సమాచారా లను తెలుపాల్సిందిగా లేఖ రాశాడు. దానికి త్వరలో తనకు రాబోయే మృత్యువు గురించి గాలిబ్ చమత్కారంగా ఇలా రాశాడు- 'నా సంగతి నన్నేమడుగుతావు? కొద్ది రోజులైె నాక పక్కింటివాళ్లను అడుగు'.

## కొత్తగాలి... 

### ధరాఘాతం ముందు వడదెబ్బ తోక ముడిచింది

-బడ్డి నాగేశ్వరరావు,
అనకాపల్లి

రచ్చబండ మీద ఎత్తుకోసం ముందే అమర్చుకున్న రాళ్లమీద ఎక్కి నిలబడ్డారు. చక్రధర్.. అతని వెంట ఉన్న అమ్మాయిలూ.

ముందుగా.. చక్రధర్ ఉరిని మెడకు తగిలించుకున్నాడు. అమ్మాయిలంతా అతన్ని అనుసరించారు.

అంతమంది ఒక్కసారిగా మెడలకు ఉరి తాళ్లు తగిలించుకుని ఎదురుగా నిలబడేస రికి ఆ దృశ్యం భయానకంగా అన్పించి... చూస్తున్న వాళ్ల శరీరాలు గగుర్పొడిచాయి.

"ఇంతమందిమి ఈడున్నం.. మీరట్టా ఉరిపోసుకు సత్తుంటే చేతులు ముడుసుకోని సూత్తా ఉంటామా?"

ఇద్దరు ముగ్గురు ఒడుపుగా రచ్చ బండమీదికి వెళ్లబోయారు.

"ఆగండి" అప్పుడే అక్కడికి వచ్చిన మోహన్‌రెడ్డి వారించాడు. "మన గ్రామంలో మనుషులెవరూ లేరు. ఒట్టి బండరాళ్లే. ఈ బండరాళ్ల మధ్యన మనుషులు బతకలేరు. వాళ్లిష్ట ప్రకారం వాళ్లని చావనివ్వండి"

మోహన్‌రెడ్డి మాటలు ముగుస్తుండగా అక్కడికి వగరుస్తూ వచ్చాడు పరమేశ్వర శాస్త్రి. జనంలోంచి సందుచేసుకుంటూ రచ్చబండ దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

ఆయన ఫాల భాగమంతా స్వేదంతో తడిసి ముద్దయిపోతోంది. చక్రధర్ వంక ఆర్తిగా చూస్తూ అన్నారాయన. "చెక్రీ, నువ్వు చావాల్సిన అవసరం లేదు. నీ వెనుక నేను నిలబడతా. నా వెనుకా, ఆ వెనుకా కచ్చితంగా ఒకరొకరూ నిలబడతారు"

చక్రధర్‌కి ఆనందంతో నోట మాట రాలేదు. ఇలాంటి సానుభూతిని జనం నుండి పొందాలనీ... వారి సహకారం ఈ విధంగా అందుకోగలగాలనే ఈ ఉరి నాటకం ఆడింది.

కానీ.. ఇంత విచిత్రంగా అది తన తండ్రినే ఇన్‌స్పైర్ చేస్తుందనుకోలేదతను.

అక్కడే నిలుచున్నచోటనే మఠం వేసు క్కూర్చున్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఈ క్షణం నుండీ నేను నిరాహారదీక్ష ఆరంభిస్తున్నా. ఇక్కడే హరిజనులతో కలిసి సహపంక్తి భోజనం చెయ్యగలిగిన రోజు వస్తేనే... నేను దీక్ష విరమిస్తాను"

చాలు.. పరమేశ్వరశాస్త్రి నోటి నుండి వచ్చిన ఆ మాటలు చాలు. అక్కడ గ్రూప్ మైండ్ థియరీ వర్క్‌వుట్ అవడానికి.

లెబనాన్స్ గ్రూప్‌మైండ్ థియరీ ప్రకారం... ఆ ప్రదేశంలో గుమికూడివున్న మనుషుల సెంటిమెంట్లు, ఆలోచనలూ... ఒక్కటిగా ట్యూన్ అయి ఒకే దిశలో ప్రయాణించడం మొదలు పెట్టాయి. ప్రస్తుతం అక్కడ ఎవరి ఆలోచనా వ్యక్తి గతం కాదు... వ్యవస్థాగతం.

పరమేశ్వరశాస్త్రి వెనక చక్రధర్‌తో పాటూ శమంతా... వినీతా... ఇంకా మిగి లిన అమ్మాయిలే కాదు... ఆ ఊరి ప్రెసి డెంట్ మోహన్‌రెడ్డి... వి.ఎ.ఒ. రాఘవ రావు కూడా కూర్చున్నారు.

చూస్తుండగానే క్రౌడ్ బిహేవియర్‌లో అనుకోని ఛేంజ్ వచ్చింది. ఒక్కొక్కరుగా వచ్చి పరమేశ్వరశాస్త్రికి బాసటగా నిలబడు తున్నారు.

సోషల్ ఫెసిలిటేషనూ.. ఇన్నర్ స్టిమ్యు లేషన్ ఒక్కటిగా కలిసిపోగా ఒక కన్‌స్ట్ర క్టివ్ వర్క్ మొదలైందక్కడ.

మనిషిని మూర్ఖత్వంవైపు నడిపే డాగ్మా

టిక్ రెలిజియన్ అంతమై అసలైన రెలిజియన్... మానవుడ్ని మానవత్వం వైపు నడిపే.. హ్యూమనిస్టిక్ రెలిజియన్ అప్పుడే ఆ పల్లెలో కళ్లు విప్పిన క్షణాలవి. ది కేస్ట్ సిస్టమ్ ఈజ్ అపోజ్డ్ టు ది రిలీజియన్ ఆఫ్ ది వేదాంతాస్. అంతవరకూ ఆకాశంలో ముసురుతున్న కారు మొయిళ్లు కాస్త చెదిరిపోవడం ఆరంభమైంది.

★ ★ ★

తల్లి గుండెల్లో గువ్వల్లా ఒదిగిపోయి వుంది చంద్రకళ. చెమర్చిన కళ్లను పదే పదే తుడుచుకుంటున్నాడు ఆమె తండ్రి వెంకటేశ్వరరావు.

"ఈ సమాజం ఎటుపోతే నీకెందుకే? నువ్వేమన్నా కందుకూరి కూతురివా? రాజారామ్ మనమరాలివా? పెద్ద రిఫార్మిస్టువి బయలుదేరావ్" కూతురి తలను హృదయంలోకి పొదువుకుంటూ చిరుకోపాన్ని ప్రదర్శిస్తుందామె తల్లి.

"అది కాదమ్మా! ప్రతిపనీ.. ఇది నా వల్ల కాదు. ఎవరో వచ్చి చెయ్యాలని ప్రతి ఒక్కరూ అనుకుంటూ కూర్చుంటే ఇక..."

"చంద్రా... స్టాపిట్... ఇప్పుడా సోదంతా వినే సహనం నాకు లేదుగాని... ముందు నువ్వు భోంచేద్దువు లే.." చంద్రకళ తల్లి లేచి వడ్డించింది.

"ఎన్నాళ్లయిందో అమ్మ చేతి భోజనం తిని!" చంద్రకళ నిట్టూర్చింది.

ఆమె అన్నం కలపబోతుంటే.. చప్పున వారించి తనే కలిపిందామె తల్లి.

"చందమామ రావే... పాట పాడమ్మా" తన నోటికి గోరు ముద్దలందిస్తున్న తల్లికేసి అల్లరిగా చూసింది చంద్రకళ.

"చందమామ మిడిగుడ్లేసుకు చూస్తాడెందుకు? దిష్టి తగులుతుంది" అందామె.

ఫక్కుమని నవ్వింది చంద్రకళ. వెంటనే పొలమారింది. ఆమె తల మీద చేత్తో తట్టి కంగారుగా నీళ్లందించింది ఆమె తల్లి.

తల్లి నీళ్లగ్లాసు పట్టుకుని ఉంటే చంద్రకళ ఆబగా తాగుతోంది.

కడుపులో సన్నటి నొప్పి ఏమూలో ఆరంభమైంది.

ఇంకో గ్లాసు తాగితే బాగుండు.

మరో గ్లాసు అందిందామె పెదవులకు.

"అబ్బా! ఇంకా నొప్పిగా ఉంది. ఇంకో గ్లాసు ఇవ్వమ్మా"

"చంద్రకళా!"

"నీళ్లమ్మా.. మంచినీళ్లు.. అబ్బ ఎందుకలా కుదుపుతావు.. నీళ్లివ్వమ్మా.."

"ఇక తాక్కూడదు. లేవండి"

చంద్రకళ చప్పున కళ్లు విప్పింది. ఎదురుగా అంతవరకు ఆమెకు నీళ్లు పట్టిన రాజు ఆమెవంకే చూస్తూ కూర్చున్నాడు.

"అమ్మా.. అమ్మేది? "

"కలగన్నారా? "

ఆమెకు అర్థమైంది. తనింతవరకూ అమ్మను చూసింది కలలో అని.

ఎందుకో అప్రయత్నంగా కళ్లలో నీళ్లు తిరిగాయామెకు. జాలేసిందతనికి. "బాధపడుతున్నారా? "

ఆమె మాట్లాడలేదు. మౌనంగా ఊరుకుంది.

"నిద్రలో మీరేదో కలవరిస్తుంటే మెలకువొచ్చింది నాకు. లేచి మీ దగ్గరకొస్తుంటే.. మీకు పొలమారినట్టు ఉక్కిరిబిక్కిరి అయ్యారు.. అందుకనీ మంచినీళ్లిచ్చాను."

చంద్రకళ చటుక్కున ఎడమచేత్తో కడుపుమీద అదుముకుంది.

అతనికి తెలుసు ఆమె ఎందుకలా చేసిందో! అది మామూలు నొప్పికాదు.. ఆకలి బాధ... విపరీతమైన వేదన.

"సెంద్రమ్మా... నా బిడ్డలుంగలు సుట్ట కపోతాందమ్మా" యాకబు చెప్పలేదు. ఏడుస్తూ అరిచాడు.

పగలు వీచిన ఈదురుగాలికి పవర్ ఫెయిలై చిమ్మ చీకటి ఆవరించి ఉంద

### కొత్తగాలి...

**అప్పుడు వ్యాపారిగా**
**ఇప్పుడు ఖైదీగా**
**ఆయన్ను చూడ్డానికి**
**అనుమతి కావలసిందే**
**ఎంత 'రాజ'సం? ఎంత 'సత్యం'?**

*–అయినాల కనకరత్నాచారి, కొరిశపాడు*

క్కడ. నేలకు కడుపు ఆన్చి బోర్లా పడుకుని ఉన్న వీరయ్య భార్య తిరుపతమ్మ దిగ్గున లేచి కూర్చుందా కేకకి. లేవగానే... ఆకలి బాధకన్నా ముందు ఆమె గుండెను నలిపింది... వీరయ్య లాకప్‌లో ఉన్నాడన్న నిజం. బాధను దిగమింగుతూ లాంతరు వెలిగించి వత్తి పెద్దది చేసింది. శవాల్లా పడివున్న నాగరాజూ లక్ష్మమ్మ లేచి గోడ వారగా చేసుకుని కూర్చున్నారు.

"నా నడిపి బిడ్డ రూతమ్మ ఆకలికి ఆగలేక కిందా మీదా అయితాంది"

రాజు తిరపతమ్మ చేతిలోంచి లాంతరు అందుకున్నాడు. అతను ముందు నడుస్తుంటే హడావుడిగా అతన్ని అనుసరించింది చంద్రకళ. తిరుపతమ్మా, లక్ష్మమ్మా, నాగరాజు.. నీరసంగానైనా వడిగానే నడుస్తున్నారు.

వెళుతూ వెళుతూ మారెవ్వ గుడిసెకేసి చూసింది. గుడిసె ముందరి మట్టి అరుగు ఖాళీగా ఉంది. చిన్న చేపల ఇగురూ... నూకల సంకటీ ఇష్టంగా తిని అరుగుమీద కూర్చుని ఆకు వక్కా...పటుకూ పటుకూ మనిదంచే అవ్వ మొన్న సాయంత్రం చుక్కలు పొడవకముందే ఆకలికి తాళలేక చనిపోయింది.

ఇంతకుముందు... చంద్రకళ కడుపును మెలిపెడుతున్న నొప్పి గుండెల్లోకి వచ్చింది. ఆ బాధకు కనుకొలుకుల్లోంచి ఓ కన్నీటి బొట్టు రాలింది.

రూతమ్మ ఆరుబయట నులకమంచం మీద పడుకుని ఉంది. కళ్లు సగం మూసుకుని నిస్త్రాణగా పడివుంది. పక్కలు ఎగరేస్తోంది. కాళ్లూ చేతులూ తోటకూర కాడల్లా వేళ్లాడుతున్నాయి. ఉండీ ఉండీ వెక్కిళ్లు వస్తున్నాయామెకు.

ఆమె తలకు చెరో వైపు మంచానికి దగ్గర నేలమీద కూర్చున్నారు చంద్రకళ రాజూ. ఉండబట్టలేక అక్కడదాకా కాళ్లీడ్చుకొచ్చిన కొద్దిమంది నిలబడి చూసే ఓపిక లేక నేలమీద చతికిలపడ్డారు.

"ఆ... క... లి..." రూతమ్మ పెదవులు అస్పష్టంగా కదిలాయి.

చంద్రకళ రాజుకేసి చూసింది.

చివరికి ఏం సాధిస్తున్నాం మనం?

ఆకలి చావులా?

ఇలా రోజుకొకరు... గంటకొకరూ... ఆఖరికి నిముషానికొకరూ మృత్యువుకు...

"ఎవరో... ఇద్దరు మణుసులు సీకటిసాటున వాడలోకొచ్చిండ్రు. రొండు బస్తాల దాన్నెంగూడ దెచ్చి ఏపమాని కింద దించిండ్రు"

రాజు ఆశ్చర్యంగా లేచి అటు వెళ్లబోతుంటే ఆ మనుషులే ఎదురొచ్చారు. ప్రెసిడెంట్ మోహన్‌రెడ్డి మనుషులు వాళ్లు.

తలగుడ్డలు తీసి విదిలించి భుజాన వేసుకుని చెప్పాడొకవ్యక్తి... గ్రామంలో జరిగిన విషయం యావత్తు. పరమేశ్వర శాస్త్రి... మోహన్‌రెడ్డి... గ్రామస్థుల్ని కూడేసుకుని... తమ కోసం... నిరాహారదీక్ష చేస్తున్నారా?

రాజూ చంద్రకళలకే కాదు... అంతవరకూ.. నేలక్కరుచుకొని ఉన్న మిగతావాళ్లక్కూడా పంచభక్ష్యాలు తిన్నంత శక్తి వచ్చింది.

"అయ్యా.. నా బిడ్డ" యాకబు మాత్రం ఏడుస్తున్నాడు.

"నో... రూతు చావకూడదు. రేపటిరో

జున... తాము సాధించబోయే విజయం చూడ్డానికి... రూతూ... రూతూలాంటి ఇంకొందరూ బతికి ఉండాలి"

ఏడుస్తున్న యాకబు భుజం మీద ఓదారుస్తున్నట్టుగా చెయ్యివేసి తిరుపతమ్మను దగ్గరికి పిలిచింది చంద్రకళ. "అర్జంటుగా అన్నం.." అంటూ క్షణం రూతమ్మకేసి చూసింది. అన్నం తినే స్థితిలో రూతమ్మ లేదు. అందుకే మళ్లీ చెప్పింది.

"గంజి కాచు"

తిరుపతమ్మ లేని శక్తిని ఒంట్లోకి తెచ్చుకుంది. ఆగంతకులు తెచ్చిన ఓ బస్తా లోంచి కాసిని బియ్యం కొంగులో పోయించుకుని... యాకబు గుడిసెలోకి వెళ్లింది. ఇరవై... నిముషాల తర్వాత... పొగలు కక్కే గంజి పాత్రను మసిగుడ్డతో పట్టుకుని వచ్చి... ఆరుబయట అందరిమధ్యనా పెట్టింది. యాకబు హడావుడిగా లోపలికెళ్లి... ఓ గ్లాస్ తెచ్చాడు. చంద్రకళ దాన్నందుకుని అందులో గంజిని పోసి కాసేపు ఆరనిచ్చింది. గాలి వీవనలకు అది చల్లారగానే... ఆకలి బాధకు తాళలేక ఉండలు చుట్టుకుపోతున్న రూతమ్మ మంచం మీద... తలవైపు నుంచీ కూర్చుంది చంద్రకళ. ఆమె తలను ఒళ్లోకి తీసుకుంది. ఇంత జరుగుతున్నా కళ్లు విప్పలేదు రూతు.

చంద్రకళ మెల్లగా గ్లాసు అంచుల్ని రూతు పెదవులకు ఆనించింది.

అందరూ ఆ దృశ్యాన్ని కళ్లనిండుగా... మహాక్రతువును చూస్తున్నంత ఆనందంగా చూస్తున్నారు.

గంజి ఉప్పగా తగిలింది రూతు పెదవులకు.

నోరు తెరవడానికి బదులు బలవంతంగా కళ్లు విప్పిందామె. వద్దువద్దన్నట్టు చేత్తో సైగ చేసింది. ముఖం తిప్పుకుంది.

ప్రాణం లేచి వచ్చినట్టయ్.. ఆబగా తాగుతుందనుకున్న మనిషి.. అలా అయిష్టతను ప్రకటించేసరికి... తెల్లబోయారు అక్కడున్న వాళ్లంతా.

"తాగు రూతూ! స్వయంగా మనకోసం ప్రెసిడెంట్ గారే పంపారు."

అయినా తాగలేదు రూతు.

"మనం గెలుస్తాం. మనకోసం సగం ఊరు నిరాహారదీక్ష చేస్తోంది."

రూతు పెదవులు ఏదో చెప్పాలన్నట్టు అస్పష్టంగా కదిలాయ్.

"ఏంటి రూతూ?" గ్లాసును పక్కనే నిలబడ్డ యాకబు చేతికి అందించి ఆత్రంగా అడిగింది చంద్రకళ.

"మ...మన కోసరం..." ఒక్కక్షణం ఆగింది. "ఆ...డ...అం...ద...రూ పస్తులుంటంటే... ఈ...డ...మనం... ఒద్దు... గె...లి... సే...దా...కా... నీల్లుగూడ..."

యాకబు చేతిలోంచి గ్లాసు జారి నేల మీద పడింది. ఘొల్లుమని ఏడ్చేశక్తి కూడా లేక... అలాగే రూతుశవం మీద నిస్త్రాణగా పడిపోయాడు.




ఊరికి వుత్తరంగా ఫెళఫెళమని ఉరిమింది.

ఇంకాసేపట్లో వాన వంగేట్టు వుంది.

దట్టంగా ముసురుతున్న కరిమబ్బుకేసి గుబులుగా చూశాడు పెదరెడ్డి.

నల్లటి ఆకాశం కింద... కనుచూపుమేరంతా పరుచుకుని వున్న పచ్చని

పైరుమీంచి తెరలు తెరలుగా తేలివస్తోంది వర్షపుగాలి.

పెదరెడ్డి వెనకాల చేతులు కట్టుకుని నిలబడ్డ పోలయ్య తప్పు చేసిన వాడిలా తలదించుకుని అన్నాడు "ఎంచేటు బంగ పోయినా ఎవ్వడూ రానన్నడు. అందరికందరూ కూడబలుక్కొని ఆ పంతు లెనకాల కూసోని సమ్మె జేస్తుండరు."

ఆ ఊళ్లోని బలిజోళ్లనీ... మంగలోళ్లనీ.. చాకలోళ్లని గుంపులు కట్టించి పని పాటలకు గుత్తకు తీసుకొచ్చే మేస్త్రీ పోలయ్య.

మాలమాదిగల్ని వెలేసినందుకు నిరసనగా పనిపాటలు చేసుకునే వాళ్లంతా నిరాహారదీక్షలో కూచున్నారు. పోలయ్యలాంటోళ్లు ఒకరిద్దరున్నా అయ్యేపని కాదది.

వాన వంగేలోగా... పంటకొయ్యాలి. లేదంటే పంటంతా నీటిపాలే.

గెనెంమీద నడుస్తుంటే... ఎదురు పడ్డారు ఆదెయ్యనాయుడు. పెదరెడ్డిని చూసి ఉసూరుమని నవ్వాడు.

"మనూరికేందో సేటుగాల మొచ్చింది" నవ్వుతూనే నిట్టూర్చాడు పెదరెడ్డి.

"ఆ మిట్టమీన సెంచక్క కొడుకు లేడూ... తిరిపాలుగాడు.. ఆడ్ని కూసింత మంచి జేసుకుని పనిసక్క బెట్టుకుందా రని.. మా పాలేర్ని నాలుక్కుంచాల బియ్యపు గింజలెత్తుకొని ఆడి నట్టింట్లో బెట్టి పనికి బిలవమని అంపినా! ఆ ఎదవ లొంగలేదే! బో కొవ్వెక్కినాదోడికి. పైగా అన్నెడంటా.. మీ నాయుడొచ్చి మాతో బంతి భోజినం సేమను.. అట్నే పనిలో పడతం అన్నెడంట! సూస్తెన్నవా రెడ్డీ, సిత్రం.."

ఆదెయ్యనాయుడు మాటలు వింటూనే.. మళ్లీ చూశాడు ఆకాశంకేసి పెదరెడ్డి.

కరిమబ్బు మరింత చిక్కబడింది.

"ఒక్కాపు ఊపిందంటే సాలు.. పంట సతికిలబడుద్ది" బలహీనంగా ఉందతని స్వరం.

"ఆనిక మిగిలేది ఒట్టి సొప్పే" ఆదెయ్య నాయుడు అన్నాడు.

వాళ్లిద్దర్దే కాదు... ఆ ఊళ్లోని మోతుబరులందరి గుండెల్లోనూ గుబులురేపుతోందా పరిస్థితి.

సోషల్ ఐసోలేషన్.

ఒకరితో ఒకరికి సంబంధం లేనప్పుడు... ఒకరిపట్ల ఒకరు సానుభూతి చూపించనపుడు... ఒకరికొకరు సహాయపడనపుడు... ఏం జరుగుతుందో... ఇప్పుడదే జరుగుతోందక్కడ!

స్తబ్దత... ఎటుచూసినా నిరాసక్తత... ఈ సహాయ నిరాకరణకి ఫలితం...

టప్‌మని రాలిపడిందో చినుకు వినాశనానికి నాంది వాచకం పలుకుతున్నట్టు.

గుండె ఝల్లుమన్న ఒకరన్నారు "పదిమంది సేనిమీదబడి.. జవిరేస్తే.. ఎంచే పని? "

ఏరీ ఆపదిమంది? పదిమందీ ఒక్కరై ఒడ్డున కూర్చున్నారు. మునిగిపోతున్న తమను చూస్తూ వెక్కిరిస్తున్నారు.

అవునూ... తమతో పాటూ వాళ్ళ పైరు కూడా మట్టిపాలేగా!

లెక్క చెయ్యటం లేదెందుకని?

కొందరు కొన్ని లెక్క చెయ్యకపోబట్టే... ఈ సమాజ స్వరూపం ఇప్పటికీ మాత్రం ఉందన్న సత్యం వాళ్లకు ఎప్పటికీ అర్థం కాదేమో!

"బైట్నించన్నా కొత్త కూలోళ్లను బిల్సుకుందమంటె ఊరి పొలిమేరకాడ గూడ... బైటాయిచ్చిండ్రు. ఆ ఎస్సయ్యగానికి రొవంత జూసుకోమని సెబితే ఆడేందో సతాయిస్తన్నడు. పట్నం ఆడపిలకాయిలొచ్చిన కాడ్నించి ఆడేందో మంచికీ సెబ్బరకూ బయపడతాండు. కేసవుద్ది కేసవుద్దని గునుస్తాండు"

"ఎట్ట జేద్దమబ్బా"

టపటపమని రాలిపడుతున్నయ్ చినుకులు. అంతవరకూ ఉగ్గబట్టుకున్న గుండెలు చెదిరిపోయాయి.

"పోనీ... ఓపాలి... ఆ ఎదవల్తోని గూకోని బోంసేత్తె!

రామప్ప అనే వ్యక్తి అన్నాడు.

అక్కడున్న అందరి గుండెల అట్టడుగు పొరల్లో... పీచు పీచుమంటున్న భయం ఆ వాక్యరూపంలో వెలువడింది.

"అంతకాడి ఆ నాగల బాయిలో దూకి సావడం మేలు"

"ఈ కారు మట్టిపాలైతే సావెట్టాగూ దప్పదులే"

"నన్నుగిన అడిగితే... రామప్ప జెప్పినట్టు ఆల్లతోని గల్సి.. కల్లు మూసుకోని ఓ ముద్ద గతికితే పరిస్థితి ఓ కొలిక్కొస్తది" పెదరెడ్డి ఓ మెట్టు దిగాడు.

సర్టెయిన్ ఫోర్సెస్.. అది ప్రకృతి వైపరీత్యం కావచ్చు.. సామాజిక విప్లవం కావచ్చు.. ఏదైనా సరే... కచ్చితంగా ఎన్నడూ అనుకోని, ఎవరూ వూహించని ఒక పరిణామాన్ని తెస్తాయి. డిటర్మినిస్టిక్ థియరీ ఆఫ్ సోషల్ చేంజ్!

సమ్నర్ అన్నట్టు... ఒక ఎకనామికల్ ఫ్యాక్టర్ సామాజిక పరమైన ఒక మార్పు తేబోతుందక్కడ.

"నిజవేఁ.. రెడ్డి సెప్పినట్టు సెయడమే మంచిది. దాంతో పదురుగూ కలిసొచ్చి పదిసేతులేస్తె మాయిటాలకు పంట ఇంటికాడికి సేరుద్ది. లేకుంటే ఈ ఏటికంతా పస్తులే"

ఇంతకు ముందుకూడదనుకున్నది... ఇప్పుడు ఒప్పుకోబడుతోంది.

వాళ్లకు తెలియకుండానే... వాళ్లో నిర్ణయానికి వచ్చేస్తున్నారు.

ఓ గొప్ప పరిణామానికి శ్రీకారం చుడుతున్నారు. "సోషల్ ఛేంజ్ ఈజ్ యాన్ ఇర్రేషనల్ అండ్ అన్‌కాన్షియస్ ప్రాసెస్" అన్న కెల్లర్ ప్రతిపాదనను నిజం చేస్తున్నారు.

"మనుషులందర్నీ బుట్టిచ్చింది ఆ బగమంతుడే గాదూ!"

"ఆఁ.. మన రగతం ఎర్రగా... ఆల్ల రగతం నల్లగా ఉంటద్దా ఏంది? మనెర్రిగాని.. అంతా ఒకటే"

"పెద్ద పెద్దోల్లు సెప్పొచ్చేదదే... కులంలేగిలంలే.. మతంలే మన్నూలే"

"అంతా గల్సేది ఆ మట్లోనే"

మెటీరియల్ కండిషన్స్ ఆఫ్ లైఫ్... సామాజిక పరమైన మార్పుకి కారణాలన్నాడు హెగెల్.

అవసరం మనిషిని మారుస్తోంది. మనసును మరో దారి పట్టిస్తోంది.

హెగెల్స్ మెటాఫిజికల్ ఐడియలిజమ్ శరవేగంతో వర్కవుట్ అవుతోందక్కడ.

ఇంతకుముందు మతం అన్నది మాల మాదిగల్ని అంటుకోవడం నేరమని.

ఇప్పుడు అవసరం అంటున్నది.. అంటుకోకపోవడం నేరం అని!

అయినా అంతర్గతంగా ఒక ఊగిసలాట! ఏదో సందిగ్ధం.

'అవునూ', 'కాదు'ల పరుగుపందెం.

చూస్తుండగానే చినుకులు ధారలయ్యాయి.

వాన పెద్దదైంది. గాలి ప్రచండమైంది.

"నిండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి ఒకటే... చండాలుడుండేటి సరిభూమీ...

**కొత్తగాలి...**

**వాన వచ్చే పోయే**
**కాగితం పడవ చేసే**
**తీరికేది చేతులకు!**
**స్కూల్‌వర్క్! హోంవర్క్!**

–కందాళై రాఘవాచార్య,
బొబ్బిలివాడ, నిజామాబాద్

ఒకటే అని ఆనాడే సెలవిచ్చాడు తన దివ్య గానం ద్వారా అన్నమయ్య. ఆ మహానుభావుడన్నట్టూ ఈ సకల చరాచర జగత్తు యావత్తూ.. ఆ భగవత్ సృజితమేగా.."

మతం అంతమైన హృదయంలో కళ్లు విప్పింది ఆధ్యాత్మికత.

వర్షం... ఎడతెరిపిలేని వర్షం... చెట్లనూ, పుట్లనూ ఊపేస్తున్న గాలి.

"రేడియోలో చెబితే... రాదులే అనుకున్నా"

"ఈ రాత్రికి గంటకు నూట ఇరవైకిలో మీటర్ల వేగంతో వీస్తాయట గాలులు"

"ఇంతకంటే ఎక్కువగానా? ఓ యమ్మో!"

"ఇట్టాటి తుపాను... ముంగలెప్పుడూ మేమెరగమమ్మా"

చూస్తుండగానే ఆవరించాయి చిమ్మ చీకట్లు. పట్ట పగ్గాల్లేకుండా విజృంభిస్తోంది గాలి. ఇళ్ల కప్పులెగిరిపోతున్నాయ్. చెట్లు కూకటి వేళ్లతో సహా ఒరిగిపోతున్నయ్.

"సెరువుగ్గాని గండిపడదు గదా!"

"పడితే ఇంకేముంది? ఊరు ఊరంతా కొట్టకపోద్ది. మణిసన్నాడు మిగల్డింక"

"భగవంతుడా.. మమ్మల్ని కాపాడు తండ్రీ" భయానకమైన చీకటి ఘోషలో ఆ రాత్రి హోరుమంటోంది.

ఆకాశమే కూలిపడుతుందా అన్నంత వర్షం. భూమి బద్దలుగా పగులుతున్నంత శబ్దం.

ఎవరో..ఎక్కడో..ఉన్నట్టుండి అన్నారు.. కాదు పిడుగుపాటులా అరిచారు.

"చెరువుకు గండి పడింది"

"ఆఁ"

విస్మయంగా వేయినోళ్లతో భయంగా అరిచింది.

★ ★ ★

నీటి మధ్యలో నేల పడుకుని వుంది, క్రితం రాత్రి కురిసిన వర్షాన్ని నెమరు వేస్తూ...

కురిసి కురిసి అలసిపోయిన వర్షం... ఆకాశం అంచుల నుంచి బొట్లు బొట్లుగా జారుతోంది.

పగిలిపోయిన గుండెలు ముక్కలు ముక్కలుగా కళ్ల వెంట రాలుతున్నాయి.

కష్టపడి కట్టుకున్న అహంకారాల కోటలు ఉప్పెనలో కొట్టుకుపోగా మిగిలిన శిథిలాల మధ్య కూర్చుని నిట్టూర్పుల నిరాశలో ఓ మనిషి.. తన చుట్టూ నిశ్చలంగా నిలబడిన వరద నీటికేసి తదేకంగా చూస్తున్నాడు.

అచ్చం క్రితంరాత్రి.. చెలియలికట్ట తెంచుకుని ఊరిని ముంచిన చెరువు నీటిలో ఆ మనిషి కళ్లలో పొంగుతోంది కన్నీరు.

తన భార్యా.. బిడ్డలూ... అక్కడ కదూ వున్నారు. కాళ్లు విరిగి నేలమీద పడి కరిగి నీరయిన ఆ మబ్బుల్లో! ఇప్పుడెవరో వస్తారు.. ఆ వరద నీళ్లలోంచి శవాల్ని వెలికి తీస్తారు.. కుప్పలు కుప్పలుగా పేర్చి కాలుస్తారు..

అతనికి దుఃఖం ఎక్కువైంది. గుండెలవిసేలా ఏడుస్తున్నాడు.

ఇక.. ఇక.. నాకెవరూ లేరా?

ఇసుక కుప్పలా కూలిపోయి.. మంచుగడ్డలా బిగుసుకుపోయి అచేతనుడైన అతని తల మీద పడిందో చేయి మార్దవంగా!

"బాధపడకు"

ఆ స్వరంలో అంతులేని ఆర్తి.. మండే తన గుండె మీద అమృతాన్ని చిలకరిస్తూ.

ఎవరు నువ్వు?

నువ్వు నాకేమీ కావే.. అన్నవూ... తమ్ముడివీ కాదు.. కడుపున పుట్టిన బిడ్డవు కాదు.. నన్ను కన్నతండ్రివీ కాదు.. చివరికి.. చివరికి.. నా కులస్థుడివి కూడా కాదు..

నువ్వు.. నువ్వు..



"నేను.. నీసాటి మనిషిని... నేను లేకుండా.. ఒంటరిగా నువ్వు బతకలేవు. ఇక కులం, మతం అంటావా.. అవి రాత్రి వచ్చిన ఉప్పెనలో కొట్టుకుపోయాయి. నామరూపాల్లేకుండా తుడిచి పెట్టుకుపోయాయి. కేవలం మనుషులం మిగిలాం."

ఆ మనిషి అతనికేసి అదేపనిగా చూశాడు. తన తలను నిమురుతున్న అతని చేతిని అందుకుని గుండెకు దగ్గరగా ఆనించుకున్నాడు.

బతుకంటే దుఃఖమేనా?

కులం కాదా? మతం కాదా?

ఇన్నాళ్లూ హృదయంలో చిత్తువత్తుగా పెరిగిన మూర్ఖపు ఆలోచనల పిచ్చి మొక్కల నుండి జలజల రాలిపడ్డాయి నమ్మకాల ఆకులు. ఆ ఎండు టాకుల మధ్య నిట్టూర్పులు కదులుతున్నాయి.

గుండెకు ఆనించుకున్న అతని చేతిని ఆసరాగా పట్టుకుని లేచి నిలబడ్డాడా మనిషి.

చుట్టూ పరుచుకున్న జలరాసికేసి చూశాడు. అలాగే చూస్తున్న ఆ మనిషితో దూరంగా వున్న ఓ చెట్టును చూపిస్తూ అతనన్నాడు ఉలికిపాటుగా. "పెదరెడ్డి

గారూ! అటు చూడండి. ఆ చెట్టు కొమ్మలో ఎవరో స్త్రీ చిక్కుకుని వున్నట్టు లేదూ? "

"అవి.. రాజూ.. ఎవురో ఆడ కూతురే.."

కళ్ల ముందే కన్న బిడ్డలందరూ మృత్యు వాత పడ్డా.. గుండె రాయి చేసుకుని బ్రతుకుతున్న మొండి తల్లిలా నిలబడి వుందా రావిచెట్టు.

ఆ చెట్టు కొమ్మల్ని వాటేసుకుని ఉందొక స్త్రీ ముఖం. అటు తిప్పుకుని ఉండటంతో ఆమె ఎవరైంది అంతు పట్టటం లేదు రాజుకు.

చెట్టు చుట్టూ నీళ్లు... నీళ్లలో తేల్తున్న శవాలు.. ఆమె ఇటు తిరిగింది.

రాజు నిశితంగా చూశాడామెకేసి.

ఆమె.. ఆమె..

"ఆ పిల్ల శాస్తుర్లగారమ్మాయి శాముండీశ్వరిలాగుంది గదూ!"

అవును.. చాముండే.. కాదు కాదు... చాముండిలా వుంది..

ఎలా.. ఎలా తనామెను చేరుకోవడం? ఈ ముంపు నీళ్లలోంచి ఈదుకుంటూ పోతే.. తనకు ఈత రాదే?

పెదరెడ్డి కొచ్చేమో?

"రాజూ? ఇట్టా సూడు" ఆత్రుతగా పిలిచాడు పెదరెడ్డి "ఆ ముళ్ల తుప్పల్లో ఎవరో పడుండారు"

"శ్వాస ఆడుతోందా? "

"ఆ.. దప్పిక్కాబోలు.. ఓ సుక్క నీల్లుంటే బాగుండు"

చుట్టూ నీళ్లేగా!

"సుట్టుమట్ల ఇన్ని నీల్లుండయ్... ఏంటికీ కొరగావు. చవాలు ఉబ్బి కుల్లి..." మాట పూర్తి చేయలేనట్టు ఆపేశాడు.

ఎవురి శవాలవి? రెడ్లవా... బ్రాహ్మణులవా? కొంపదీసి హరిజనులవా?

శవాలకి కులమేంటి? శవం ఏ కులం వాడిదైనా కుళ్లిపోక తప్పదు.

ఇంత మాత్రానికి మనుషులెందుకూ కులాల పేరుతో విడిపోవటం!

"ఆ సెట్టుమీన మణిషి సెయ్యూపు తాంది రాజూ!"

రాజు గుండె గుబగుబలాడింది.

"చాముండీ! నా చాముండీ... భయపడకు నేనెలాగైనా..."

దూరం నుంచీ వస్తున్న ఓ లైఫ్ బోట్... ఆ చెట్టువైపే వెళుతోంది.

"దేవుడా! నువ్వున్నావయ్యా"

లైఫ్ బోట్ అదొక్కటే కాదు... చూస్తుండగానే అన్ని పక్కలనుంచీ... చాలా వస్తున్నాయి. ఒకటి తమకేసే వస్తోంది.

రెస్క్యూ స్క్వాడ్ దాని పని అది చేసుకుపోతోంది.

బాధితులందర్నీ.. సహాయ శిబిరాల్లోకి చేరుస్తోంది.

భయం.. ఆందోళన.. ఆవేదన ముప్పిరిగొని ఉన్నాయక్కడ.

సన్నగా ఏడుపులు... అక్కడక్కడా వెక్కిళ్లు... ఒక్కోచోట గాఢమైన నిట్టూర్పులు... మరోచోట... గుండెలు బాదుకుంటున్న శబ్దాలు... ఎవరో ఎవరో కలుసుకున్నప్పుడు ఎక్కడో ఆనందపు పొలికేకలు మొత్తం మీద అక్కడంతా గందరగోళంగా ఉంది.

తమ మనుషులెక్కడన్న తారట్లాట.. కళ్లలో ఆశ నిరాశల ఊగిసలాట...

"చాముండీ.. నువ్వు నువ్వేనా? అవునో కాదో అని తల్లడిల్లిపోయాను."

రాజు బాహుబంధాల్లో తల దాచుకుని ఉంది చాముండి.

"రాజూ! నాన్నా.. అమ్మా.. బామ్మ.. వీళ్లంతా.. వీళ్లంతా.." ఆమె బావురుమంటోంది.

"చంద్రకళా!" సంభ్రమంగా పిలిచాడు రాజు, చాముండి కౌగిలి నుండి విడివడుతూ.

# జూలై-09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. సి. మాధవి - ఎస్.ఎస్.బి.ఎన్ కాలేజి, అనంతపురం
2. వాడపర్తి పాపమ్మ - శివాజీపాలెం, విశాఖపట్నం
3. ఎం.కామేశ్వరి - ప్రశాంతినగర్, హైదరాబాద్
4. విశ్వనాథ వెంకటరమణ - సీతమ్మధార, విశాఖపట్నం
5. పి. వరదాచార్యులు - తాడేపల్లిగూడెం ప.గో జిల్లా



**సరైన జవాబులు**

1. పద్మ 2. లా 3. జానకి 4. వంశీకృష్ణ 5. ధర్మారావు 6. ఫిరాఖ్ గోరఖ్ పూరీ 7. గాంధీజీ 8. దినేశ్ 9. అనుష్క 10. దాసు శ్రీరాములు

---

అతి నీరసంగా గోడకి చేరగిలబడి ఉన్న ఓ వ్యక్తికి... పొట్లంలోని ఆహారాన్ని తీసి నోటికందిస్తోందామె.

ఆయన.. ఆయన రామశర్మ కదూ! హరిజన బాలుడి వద్ద రొట్టెముక్క తిన్న నేరానికి ఆరేళ్ల పిల్ల నాలుక మీద నిర్దాక్షిణ్యంగా వాత పెట్టిన నిష్ఠాగరిష్ఠుడు కదూ ఆయన!

ఒక హరిజన యువతి నోటికి అందిస్తున్న అన్నాన్ని ఒక అగ్రకులస్థుడు ఆబగా అమృతంలా తింటున్న ఆ దృశ్యం...

ఏ అజ్ఞాత అద్భుత చిత్రకారుడో... గాలి వానకు రంగు వెలసి బీభత్సంగా మారిన ప్రకృతి కేన్వాస్‌ను.. శుభ్రపరిచి.. దానికి కొత్త రంగులు పూసి.. అహర్నిశలూ శ్రమించి గీసిన అపూర్వ చిత్రంలా ఉంది.

రాజును చూసి చంద్రకళ ఒక్క ఉదుటున లేచింది.

"రాజూ! మీరు.. మీరు బతికే ఉన్నారా? " నమ్మలేనట్టుగా అంది చెమ్మగిల్లుతున్న కళ్లతో చూస్తూ. రాజేదో అనబోయేలోగా తనే అడిగింది,

"చక్రధర్... కనబడలేదా? "

"ప్చ్..ఇంతవరకూ లేదు. కానీ కనబడతాడన్న నమ్మకం ఉంది నాకు" దుఃఖాన్ని ఆశతో అణిచేస్తూ అన్నాడు రాజు.

"మా పెదనాన్న పోయాడు" చంద్రకళ కళ్లల్లోంచి చివ్వున రాలాయి నీటిబొట్లు. "వదిన కనబడ్డంలేదు. పెద్దమ్మా అన్నా ఒకటే ఏడుపు" తనూ ఏడుస్తోంది.

"అరుగోండి... ప్రెసిడెంట్ గారు" చాముండి ఆనందంగా అరిచేసింది.

మోహన్‌రెడ్డి.. చుట్టూ చేరారందరూ.

పగలేకాదు... ఆ రాత్రంతా కూడా రక్షణ సిబ్బంది పనిచేస్తూనే ఉంది. మనుషుల్ని శిబిరానికి చేరవేస్తూనే ఉంది.

ఒకటా.. రెండా.. నెమళ్లలంకతో సహా.. పదిహేను గ్రామాలు ముంపుకు గురయ్యాయి.

ఎంతమందిని చేరవేస్తున్నా.. ఇంకా మనుషులు దొరుకుతూనే ఉన్నారు.

ఆ దొరికే వాళ్లలో తమ వాళ్లుండకపో

తారా అన్న ఆశతో.. ఊపిరి బిగపట్టి చూస్తున్నారు శిబిరంలోని బాధితులు.

అక్కడి అందరి బాధా ఒకటే... అందరి కన్నీళ్లూ ఒకటే... కులమతాల్ని కాసేపైనా మరిచిపోయి ఒకర్నొకరు ఓదార్చుకుంటూ ఆ ఓదార్పుల్లో సేదతీరుతున్న అద్భుత క్షణాలవి...

★ ★ ★

ఆ రాత్రి...

పరిసరాలకు పిండి వెన్నెల మెరుగుపడుతోంది. నిన్న వీచిన దయ్యపుగాలి ఏమైందో మరి... అలలు అలలుగా మంద్రంగా వీస్తోంది చలిగాలి.

శిబిరంలోని మనుషుల్ని వరసల్లో కూర్చోబెట్టి ఆహారపు పొట్లాల్ని సరఫరా చేస్తున్నారు.

"చాముండీ... దిగులుపడకు. మీ నాన్న తప్పకుండా దొరుకుతారు"

పక్కనే ఉన్న ఆహారపు పొట్లాన్ని పట్టించుకోకుండా మోకాళ్ల మధ్య తల దూర్చి కూర్చున్న చాముండి చివ్వున తలెత్తింది.

"మరి... అన్నయ్యా... అమ్మా...బామ్మా" చిన్నపిల్లలా కళ్లార్పుతూ చూసింది.

సమాధానం చెప్పలేని రాజు తల వంచుకున్నాడు.

"నాకు తెలుసు వాళ్లిక దొరకరు. ఎందుకంటే... ఎందుకంటే... వాళ్లంతా చచ్చిపోయారు" మళ్లీ మోకాళ్లలో తలదూర్చింది.

"చాముండీ!"

అలా అన్నది రాజు కాదు... కానీ... ఆ స్వరం తనకు చిరపరిచితం...

"నా...న్నా..."

నిన్న ఊరిని ముంచిన ఉప్పెనలా లేచింది చాముండి.

"నాన్నా... నాన్నా" ఆయన్ని అల్లుకుపోతూ పలవరిస్తోంది.

భాషకందని భావాన్ని.

మౌనంలోకనువదించి ఆమె తలను స్పృశిస్తూండిపోయాడాయన.

"అమ్మ.... దొరకదా నాన్నా? "

నాన్న కనబడ్డాడు కనుక అమ్మ కావాలి.

"ఆ పరాత్పరుడు మనకన్యాయం చెయ్యడమ్మా"

"మరి... మరి... బామ్మో"

అమ్మ కనబడుతుందన్న భరోసా నాన్న ఇచ్చాడు. కాబట్టి బామ్మ కావాలి.

"కచ్చితంగా కన్పిస్తుంది. ఎక్కడో ఓచోట ఊపిరితోనైనా ఉండివుంటుంది"

"నాన్నా..." చాముండి గొంతు మరింత గాద్గదికమైంది

"అన్నయ్య".

"అన్నయ్యెక్కడికి పోతాడమ్మా! ఓ పది మందిని రక్షించి మరీ తన వెంట పెట్టుకొస్తాడు".

ఆమె మనసు ఒక్కక్షణం... ఆనందపు శిఖరాన్ని దాటింది. అంతలోనే అగాధంలోకి జారింది.

"అసలు... అసలు... దేవుడెందుకని నాన్నా ఇలా చేశాడు? "

"ఎందుకంటే!" ఆయన ఆగి... ఆ శిబిరంలో భోజనం చేస్తున్న అందరికేసీ ఒక్కమారు చూశాడు.

అటు చూడు.. అక్కడ కులాల కుమ్ములాట లేదు. ఆహారం కోసం దేవులాట తప్ప.

ప్రస్తుతం మనిషిని మనిషే కాదు... లోలోపలి మనసును కూడా స్పృశిస్తున్నాడు.

ఇక్కడ అంతరాల్లేవు... అంటరానితనం లేదు. కేవలం... కేవలం... ఒకరిపట్ల ఒకరికి సానుభూతి తప్ప... సుహృద్భావం తప్ప.

ఇదుగో... ఈ సుందర దృశ్యాన్ని ప్రకృతి కేన్వాస్ మీద చిత్రించడానికే భగవంతుడు... చట్రంలో బిగుసుకున్న ఈ సంఘపటాన్ని ఒక ఊపు ఊపి ఉంటాడు.

హృదయాల్లో వేళ్లు పాతుకున్న దురాచారాల పెను వృక్షాలను కూకటివేళ్ళతో పెకలించి ఉంటాడు... తను సృష్టించిన భూతం మీద తన పిల్లలకు ఈ సహపంక్తి భోజనాన్ని ఏర్పాటు చేసి ఉంటాడు."

ఆయన మాటల్ని చాముండి ఒక్కటే కాదు... ఆ శిబిరంలోని ప్రతి మనిషీ వింటున్నాడు. తినటాన్ని ఆపేసి శిలాసదృశ్యల్లా ఆయనకేసి చూస్తున్నారు.

"నాన్నా"

"ఏమ్మా? "

"ఈ సహజీవనం ఇలా శాశ్వతమైతే ఎంత బాగుంటుంది"

ఆయన చాముండి కళ్లలోకి లోతుగా చూశాడు.

"చాముండీ!" ఆయన ఆమెనే కాదు, అక్కడున్న అందర్నీ ఉద్దేశించి అంటున్నాడు. "ఆదిమానవుడు... నాగరికతను సంతరించుకుంటున్న వేగిరపాటులో... అటూ ఇటూ కాని సంధికాలంలో... ఎదిగీ ఎదగని మనసుతో ప్రతిపాదించిన అర్ధం లేని సంప్రదాయాలను... మధ్య యుగాల నాటి కులపు కట్టుబాట్లనూ... పునర్ వ్యవస్థీకరిస్తూ మానసికంగా తిరోగమిస్తున్న ఈ మనుషుల్ని మార్చాలని... అనాది కాలం నుండీ...

ఒక బుద్ధుడూ... ఓ వివేకానందుడూ... ఓ దయానంద సరస్వతీ... ఒకరేమిటి ఎందరో మహానుభావులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఈ కుల వ్యవస్థను కూకటివేళ్లతో పెకలించాలనీ చూస్తున్నారు. ఇది ఇప్పటి సంఘర్షణ కాదు. తరతరాలది.

అందుకే విజయాన్ని సాధించేవరకూ ఈ సంఘర్షణ కొనసాగాలి.

కేశవ చంద్రసేన్... కులాంతర వివాహాలను ఒక ఉద్యమంగా చేపట్టి కులవ్యవస్థ కూకటివేళ్లను పెళ్లగించాలని చూశాడు.

ఇప్పుడు... నేనదే బాటలో నడుస్తాను"

ఆయన చెప్పడం ఆపి రాజు వంక చూశాడు.

"రాజూ! నువ్వు హరిజనుడునని ప్రకటించి మా గడప దాటి వెళ్లాక... నా కూతురు ఓ కోరిక కోరింది. ఒక్క నిన్నే కాదు హరిజనవాడనే ఊళ్లోకి తెచ్చి వాళ్లకు గ్రామస్థులతో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసీ మరీ తన పెళ్లి చెయ్యమని. దాని కోరిక తీర్చడానికి ఇదే తగిన సమయం అనుకుంటున్నా" రాజు చేతిని అందుకుని... చాముండి చేతిలో ఉంచుతూ చెప్పాడాయన.

"కులమతాల కతీతమైన ఈ సహజీవన సుందర దృశ్యాన్ని ఇప్పుడు కాకున్నా... కనీసం... మీ ముందు తరంలోనైనా శాశ్వతం చెయ్యాలని... మిమ్మల్ని దీవిస్తున్నా."

చంద్రకళ.. కలుసుకున్న ఆ ఇద్దరి చేతుల్నీ.. అలాగే దగ్గరకు తీసుకుని గాఢంగా ముద్దు పెట్టుకుంది.

ఆమె కళ్లనుంచి జలజల రాలుతున్నయ్ కన్నీటి బొట్లు... అక్షింతల్లా.

చంద్రకళ వంకే దీక్షగా చూశాడు కాసేపు పరమేశ్వర శాస్త్రి.

అప్రయత్నంగా ఆయన చెయ్యి ఆమె తలను నిమిరింది. ఆయన పెదవులు ఏదో చెప్పాలన్నట్టూ అస్పష్టంగా కదిలాయి. "చంద్రకళ..." అన్న ఒక్క మాట మాత్రం వినబడింది.

ఇంకా కనబడని భార్య కోసం... బిడ్డ కోసం... తల్లి కోసం... ఆయన మనసు ఆక్రోశిస్తోందని అర్థమైంది చంద్రకళకు.

"బాధ పడకండి. ఒక మంచి మార్పును తేవడానికి ఇంతటి విలయం సృష్టించిన ప్రకృతి... ఆ పనిని ఎప్పటికీ అసంపూర్తిగా వదిలిపెట్టదు. కచ్చితంగా అది మీకు మీ భార్యను, బిడ్డనూ... తల్లినీ కానుకగా ఇస్తుంది. ఆ విశ్వాసం నాకుంది" దృఢంగా

ఉంది ఆమె స్వరం.

★ ★ ★

దుమ్ము రేపుకుంటూ ఆగింది నెమళ్ళ లంక బస్ స్టేజీ దగ్గర ఓ ఆర్టీసీ బస్సు. అందులోంచి దిగిన ఇద్దరు వ్యక్తులు... ఊరి వైపు నడక సాగించారు కాలి బాట గుండా.

ఊళ్లోని రచ్చబండ దగ్గర ఆగి... అక్కడ కూర్చుని ఉన్న ఓ మనిషిని అడిగారు.

"ఈ ఊళ్ళో హరిజన వాడకు ఎటు వెళ్ళాలి? "

ఆ మనిషి వాళ్ళకేసి ఎగాదిగా చూసి చెప్పాడు.

"మా నెమళ్ల లంకలో... అట్టాటి వాడ లేమీ లెవ్వండి"

"అదేంటి? " ఆశ్చర్యపోయారు ఆ ఇద్దరు వ్యక్తులూ.

"అదంతే... కావల్నంటె... అదో పెసి డెంటుగారు ఇటే వస్తన్నారు... నేరుగా ఆయన్నే గనుక్కోండి."

వాళ్ళను చూడగానే... ప్రభుత్వోద్యోగు లని గమనించాడు ప్రెసిడెంట్.

సాదరంగా తన వెంట పంచాయితీ ఆఫీ సుకు పిలుచుకెళ్లాడు.

"మేం స్టేట్ బేంకాఫ్ ఇండియా తరపున వచ్చామండీ. మీ నెమళ్లలంకా ఇంకా చుట్టుపక్కల గ్రామాల్లోని హరిజన వాడల్లో పక్కా గృహాల నిర్మాణానికి మా బేంక్ లోన్లు మంజూరు చెయ్యబోతోంది. ఆ వర్క్‌మీద ఇన్‌స్పెక్షన్‌కి వచ్చాం. ఆ బండ మీద కూర్చున్న మనిషినడిగితే... అసలు మా పల్లెలో హరిజనవాడే లేదం టాడు" కంప్లయింట్ చేస్తున్నట్టుగా చెప్పా డొక వ్యక్తి.

"అతను చెప్పింది అక్షరాలా నిజమండీ. మా నెమళ్లలంకలో కులమతాల్లేవ్. మేమంతా ఒక్కటే."

"అది కాదు మోహన్‌రెడ్డిగారు..."

"ప్లీజ్... మోహన్ అని పిలవండి చాలు."

"ఓ.. సారీ.. అంతా ఒకటే అనడం, అనుకోవడం సంతోషదాయకమే. కానీ దానివల్ల ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాలకు కేటాయించిన సాయాన్ని మీ గ్రామంలోని హరిజనులు పోగొట్టుకోవలసి వస్తుంది. ప్రభుత్వమిచ్చే లోన్లకు సబ్సిడీలూ అవీ..."

"అక్కర్లేదండీ" అప్పుడే పంచాయితీ ఆఫీ సులోకి అడుగు పెట్టిన రాజు అన్నాడు. "భారత రాజ్యాంగాన్ని రచించిన అంబే ద్కర్... రిజర్వేషన్‌కి ఓ లిమిట్ పెట్టాడు. అది కేవలం పదేళ్ళు. కనీసం ఆ పదేళ్ల కాలంలో అంటరానితనం అంత రించి ఒక న్యూ సోషల్ ఆర్డర్ ఆరంభం అవుతుందన్న ఆశతో. కానీ... స్వతంత్రం వచ్చి యాభై సంవత్సరాలు దాటుతున్నా... ఇంకా కులాల అంతరాన్ని అనుక్షణం గుర్తుచేస్తూ ఈ రిజర్వేషన్లు యథావిధిగా కొనసాగుతోంటే... అంటరానితనాన్ని రూపు మాపే ప్రయత్నంలో మనమింకా అ... ఆలు దిద్దే స్థితిలోనే ఉన్నామంటే... అంబేద్కర్ లాంటివాళ్లు ఆశించిన సమ సమాజం ఎప్పటికీ రాదన్నమాటేగా!

అందుకే... మా ఊరు ఊరంతా ఒక నిర్ణయానికొచ్చాం. ప్రభుత్వ సహాయం భారీ ఎత్తున మా కందకపోయినా ఫరవా లేదు గాని దాని కోసం తిరిగి కులాల వారీగా విడిపోవటానికి మేం ఒప్పుకోం."

ఆ ఉద్యోగులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తరవాత చిన్నగా ఏదో మాట్లాడుకున్నారు.

వాళ్లేదో అనబోయేంతలో ప్రెసిడెంట్ అన్నాడు "కానీ మీ సాయాన్ని మేం వద్ద నటం లేదు. మా గ్రామంలో కులం లేద న్నామే గాని పేదరికం లేదనలేదు. కులాని కతీతంగా మీరు అందించే ఏ సహాయ మైనా అందుకోవడానికి సిద్ధంగా ఉన్నాం."

ఆ తరువాత ఆ ఇద్దరూ ప్రెసిడెంటు, రాజు ముందుండి దారి తీస్తుంటే గ్రామ మంతా తిరిగారు.

పరమేశ్వరశాస్త్రి ఇంటి ముందు ఓ నిముషం నిలబడ్డాడు రాజు.

"ఇది మా ఇల్లే... మా అత్తగారిది" చెప్పాడు రాజు.

"రండి లోపలికి... కాస్త కాఫీ తీసుకుం దురు గాని"

ప్రెసిడెంట్‌తో పాటూ ఆ ఇద్దరూ వచ్చి వరండాలో కూర్చున్నారు.

లోపలి గది గుమ్మంలోకి తొంగి చూసింది చాముండేశ్వరి.

రాజు ఆమెకు దగ్గరగా వెళ్ళి చెప్పాడు. "బేంక్ ఆఫీసర్లు వాళ్లు. కాఫీ... ఫలహా రాలు పంపించు"

చాముండేశ్వరి గబగబ వంటింట్లోకి వెళ్లింది. వైదేహీ... చంద్రకళా కలిసి... చాముండిని అత్తారింటికి పంపడానికని పిండివంటలు చేస్తూ బిజీగా ఉన్నారు. లడ్డూలూ కడుతున్న చంద్రకళ పక్కనే ముక్కాలి పీటవేసుక్కూర్చుని వరుసపెట్టి లడ్డూలు లాగిస్తున్న చక్రధర్‌కేసి ఉరిమి చూసింది.

"బయట ప్రెసిడెంట్‌గారూ ... ఇంకా ఎవరెవరో వచ్చి ఉన్నారు. నువ్వేమో... వంటగదిలో వదిన కొంగు పట్టుక్కూర్చు న్నావ్" అంది చాముండి.

తింటున్న లడ్డు పక్కన పెట్టేసి వరం డాలోకి వెళ్లాడు చక్రధర్. అతను వెళ్లిన వైపే నవ్వుతూ చూసి ఇందాక తను అన్న "వదిన కొంగు" అనే మాట పట్టుకుని మూతి ముడుచుకు కూర్చున్న చంద్రకళతో చెప్పింది "వదినా! వాళ్లకు కాఫీ ఫలహా రాలు పంపాలట"

"నాకు తెలీదు. అత్తయ్యనడుగు పో" విదిలించింది చంద్రకళ.

"ఎవరే ఆ వచ్చింది?" మూలన కూర్చుని రుద్రాక్షలు లెక్కిస్తున్న శ్రీనివా సమ్మ ఆరాగా అడిగింది.

"ఎవరో బేంక్ ఆఫీసర్లట"

"అమ్మాయి! అయితే... మనమేడ దక్షిణం దిక్కున కూలిపోయిందిగా చూపిస్తే లోనిస్తారేమోనే"

"వెళ్లి అడుగు బామ్మా" చెప్పింది చాముండి తల్లి ప్లేట్లలో సర్ది ఇచ్చిన లడ్డూలు అందుకుని వరండాలోకి వెళుతూ.

శ్రీనివాసమ్మ గబగబ వచ్చింది చాముండి వెనకాలే.

ఆఫీసర్లతో మాట్లాడుతున్న పరమేశ్వర శాస్త్రితో మెల్లగా అంది "ఒరేయి పరమేశూ! దక్షిణంవేపు మేడ దెబ్బతిందిగా కాస్త వాళ్లకు చూపించకూడదూ"

ఆమె మెల్లగా చెప్పాలనుకుందిగాని ఆ మాటలు ఆ ఉద్యోగుల చెవిన పడనే పడ్డాయి.

లేచి వెళ్లి చూసి వచ్చారు.

ఇద్దరిలో ఒక వ్యక్తి ఓ ఫారం బయటికి తీసి.. "వివరాలు చెప్పండి రాసుకుంటాం" అన్నాడు.

"ఇల్లు మా బామ్మదే. ఆమె పేరుమీదే ఉంది" వాళ్లతో అని "వివరాలు చెప్పవే బామ్మా" అన్నాడు చక్రధర్ ఆమె వంక తిరిగి ఫారం ఫిలప్ చెయ్యడానికి ఉపక్ర మిస్తూ.

అడిగాడు ఆ ఉద్యోగి, "పేరు?"

"గుడిమెట్ల శ్రీనివాసమ్మ"

"వయస్సు?"

"అరవై ఏడనుకుంటా. ఏరా పర మేశూ?"

"కులం?"

బామ్మ నోట్లోంచి బాణంలా వచ్చింది సమాధానం.

"లేదు"

ఆ వ్యక్తి తలెత్తి ఆమెకేసి ఆశ్చర్యంగా

అందరిలాగే కోటి ఆశలతో వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టిన ఆమె తర్వాత కొద్దికాలానికే ముద్దులు మూటగట్టే తరుణ్‌కు తల్లయింది. అంతలోనే షాక్! తను ప్రాణప్రదంగా చూసుకునే భర్త అనూహ్యంగా తమను తమ ఖర్మానికొదిలి మాయమయ్యాడు.. తుపాను తాకిడికి అల్లల్లాడుతున్న ఆకులా మారిన ఆమె జీవితాన్ని ఉద్ధరిస్తానని ముందుకొచ్చిన మరోప్రబుద్ధుడు పెళ్లయిన మర్నాటినుంచే నరకం చూపాడు.. పసివాడని చూడకుండా తరుణ్‌నూ రాచిరంపాన పెట్టాడు.. అతని బారినుంచి కొడుకును రక్షించుకునేందుకు ఆమె ఏంచేసింది? అడుగడుగునా పడగవిప్పి కాటేయచూసిన కాలసర్పాలతో ఎలా పోరాడింది? ఈ పోరాటంలో ఆమె స్నేహితులు ఆమెకెలా అండగా నిలిచారు? చివరికేమైంది? అక్షరాక్షరంలో ఉత్కంఠ కలిగించే విజయరాణి **అనిర్వచనీయం**



**సెప్టెంబరు చతురలో చదవండి...**

చూశాడు.

"అంత చదువులు చదివారు... ఇంకా కులమేంటీ మతమేంటీ అనడగడానికి మీకు చిన్నతనంగా లేదూ? ఎప్పుడో తెలియని మూర్ఖత్వంలో మానవులు తమ మధ్య కట్టుకున్న అడ్డుగోడలవి. ఈ ఊళ్లో ఇప్పుడవి లేవు. మొన్నటి తుఫానుకు కూలిపోయినాయి"

బామ్మ చెప్పింది నిజమేనని... పంచాయితీ ఆఫీసులో కూర్చుని ఒక్కొక్క ఫారాన్ని నింపతున్నప్పుడు గాని రూఢీకాలేదు వాళ్లకు.

"పేరు? "

"ఆదెయ్యనాయుడు... కాదండీ... ఆదెయ్యండీ"

"వయస్సు? "

"నలభై రెండు"

"కులం? "

"లేదండీ"

అతని తరువాత ఇంకో మనిషొచ్చాడు.

"పేరు? "

"పెదరెడ్డి... పెదయ్యండీ"

"వయస్సు? "

"యాభై... యాభై నాలుగుంటయి"

"కులం? "

అడగబోయి తమాయించుకొని ఆ కాలమ్ ఎదురుగా 'నో' అన్న అర్థం వచ్చేలా ఓ గీత గీసుకున్నాడు ఆ ఉద్యోగి.

వాళ్లు ఆ సాయంత్రం వెళ్లిపోతూ... బస్ వరకూ వచ్చి దిగబెట్టిన రాజూ, చక్రధర్‌లతో వారిలో ఒక వ్యక్తి అన్నాడు.

"గుడ్ హేబిట్సార్ ఆల్సో కంటేజియస్ లైక్ బేడ్ హేబిట్స్. వి హోప్ దట్ దిస్ కేస్ట్‌లెస్ కల్చర్ స్ప్రెడ్స్ త్రూ అవుట్ ఇండియా వెరీసూన్" ©

అపార్ట్‌మెంటాలజీ -19

# లవ్ జంప్

యర్రంశెట్టి శాయి



(గత సంచిక తరువాయి..)

**"ప**రిస్థితి చాలా ఉద్రిక్తంగా ఉంది గజనీ. అపార్ట్‌మెంట్స్‌లోని వాళ్లు అతనెప్పుడు దూకుతాడోనని ఆందోళనగా ఉన్నారు"

రాజు చెప్తుంటే, అతడి చేతిలోని మైక్ లాక్కుని "మాకేం ఆందోళన లేదు గజనీ! ఇక్కడ చాలామంది అతను దూకే దృశ్యం చిత్రించాలనీ సెల్‌ఫోన్ కెమెరాలు సిద్ధం చేసుకున్నారు" అంది షైనీ.

న్యూస్‌రీడర్ గజనీలో కన్‌ఫ్యూజన్.

"హలో.. మీరెవరు? "

"కెమెరామెన్ సునీతతో అపార్ట్‌మెంట్స్ సొసైటి లేడీస్ వింగ్ సెక్రటరీ షైనీ"

రాజు ఆమె చేతిలో నుంచి బతిమాలి మైక్ తీసుకున్నాడు.

"రాజూ.. ఇంతకూ ఆ యువకుడు దినేష్ ఇంతటి తెగింపుకు ఎందుకు పాల్పడ్డాడు? "

"అతను ప్రేమించిన 'సుధి'ని పెళ్ళి చేసుకోవాలని అతని కోరిక గజనీ. దానికి 'సుధి' తల్లిదండ్రులు ఒప్పుకోకపోతే- దూకటం ఖాయమనీ, వెనక్కు తగ్గే ప్రసక్తి లేదని అతనంటున్నాడు గజనీ"

"మరి ఈ విషయంలో పోలీసు లేమంటున్నారు రాజూ? "

"ఇంతకుముందు 'దూకి ఛస్తే.. ఛావనీ' అని అనుకున్నారు గజనీ. కానీ ఇప్పుడు ఛానెల్స్ అన్నీ ఈ వార్తని లైవ్ టెలికాస్ట్ చేస్తుండటంతో ఆ యువకుడితో చర్చలు జరపడానికి వస్తున్నారని తెలిసింది- అదిగో పోలీస్ జీప్ వచ్చేసింది గజనీ"

జీప్‌లోనుంచి స్పీకర్ పట్టుకుని ఒక ఎస్సై దిగాడు. ఒక సీఐ, ఇద్దరు కానిస్టేబుల్స్ దిగారు.

"ఇదిగో చూడు దినేశ్.. నీకూ, నువ్ ప్రేమించిన అమ్మాయికీ పెళ్లి జరిపించే పూచీ మా డిపార్ట్‌మెంటుది! అందుకని నువ్విక దూకే ఆలోచన విరమించుకుని కిందకు దిగిరా" బతిమలాడాడు సీఐ.

"మీ మాటలు నమ్మి కిందకు దిగొస్తే బొక్కలో తోస్తారు! ఛస్తే దిగను సార్. ఆ సుధి తల్లిదండ్రులు స్వయంగా ఇక్కడికొచ్చి నాకూ, సుధికీ ఇక్కడే ఈ అపార్ట్‌మెంట్‌లోనే పెళ్ళి జరిపిస్తామని మాటివ్వాలి. అప్పుడే దిగుతా" అన్నాడు దినేశ్.

సీఐ చిరాకుపడ్డాడు. అది ఛానెల్ కెమెరాకు చిక్కకుండా చిరునవ్వు నవ్వాడు.

"ఇదిగో మోహన్‌రావ్. వెంటనే వెళ్ళి ఆ సుధి వాళ్ళ పేరెంట్స్‌నీ, ఆమెనూ ఇక్కడకు తీసుకురా!" అంటూ ఎస్సైని పంపించాడు.

ఈలోగా మళ్ళీ లైన్లో తుగ్లక్ ఛానెల్ గజనీ- "రాజూ- ఇప్పుడక్కడ పరిస్థితేంటి? ఏం జరుగుతూంది?"

"గజనీ.. దినేశ్ ప్రేమించిన సుధిని, ఆమె పేరెంట్స్‌ని పిలిపిస్తున్నారు. ఈ ప్రేమ కథను సుఖాంతం చేసేందుకు పోలీస్ డిపార్ట్‌మెంట్ అన్ని చర్యలు తీసుకుంటోంది గజనీ"

"రాజూ.. దినేశ్, సుధి కలిసి ఒకటే కాలేజీలో చదువుకున్నట్లు తెలుస్తోంది. ఇలా కాలేజ్‌మేట్స్, కొలీగ్స్ ప్రేమించుకోవడం, పెళ్లి చేసుకోవడం కామన్ అయింది. సుధి తల్లిదండ్రులు మూర్ఖంగా వారి ప్రేమకు అభ్యంతరం చెప్పడం ఎందుకు జరుగుతోంది? వారింకా చాదస్తాన్ని వదలకుండా, మూర్ఖంగా, అనాగరికంగా, జంతువుల్లా ఎందుకు ప్రవర్తిస్తున్నారు?"

"గజనీ.. ఈ జెనరేషన్ గాప్ యుగయుగాల నుంచీ కొనసాగుతోంది. మహాభారత్‌కాలంలో కూడా ప్రేమికులకు, వారి పెద్దలకూ యుద్ధాలు జరిగిన దాఖలాలున్నాయి గజనీ. ఏదేమయినా ఈ రోజుల్లోనూ ఇంకా ఆ పురాతన కాలంనాటి బూజుపట్టిన అభిప్రాయాలతో దినేశ్, సుధిల ప్రేమకు అడ్డు చెబుతున్న సుధి పేరెంట్స్‌ని చూసి సభ్యసమాజం సిగ్గుతో తల దించుకుంటోంది గజనీ"

"థాంక్యూ రాజూ.. సుధి తల్లిదండ్రులలాంటి నికృష్టమైనవారిని నిలువునా నరకాలో, కాల్చాలో, పాతర వేయాలో, రాళ్లతో కొట్టాలోనన్న దానిపై మీరంతా ఆలోచించి సమాధానం వెంటనే ఫోర్ జీరోస్‌కి ఎస్సెమ్మెస్ చేయండి. ఇప్పుడో బ్రేక్"

సరిగ్గా అప్పుడే పోలీస్ జీప్‌లో సుధి, ఆమె తల్లిదండ్రులు వచ్చి దిగారు.

ఒక్కసారి ఛానెల్ కెమెరాలు, జర్నలిస్టులు అందరూ వాళ్లవేపు పరిగెత్తేసరికి తమమీద దాడికి వస్తున్నారనుకుని సుధి పేరెంట్స్ వెనక్కు తిరిగి పరుగెత్తి స్పీడ్ బ్రేకర్ తగిలి కిందపడ్డారు.

వెంటనే పోలీసులు పరుగున వెళ్లి, వాళ్లను లేపి వాళ్లంతా టీవీ ఛానెల్ వాళ్లనీ, గూండాలు కాదనీ నచ్చజెప్పి కెమెరాల ముందుకు తీసుకొచ్చారు.

"ప్రేమించుకున్న యువతీ యువకులను కలపాలనీ, వాళ్లకు వివాహం చేయాలని మీరెందుకు అనుకోవటం లేదు. ఇంత రాక్షసం ఎందుకు?" అడిగాడు రాజు.

"మేము రాక్షసంగా ప్రవర్తించటమేంభయ్! అసలు లవ్ మారేజెస్‌కి మేము ఎగినెస్ట్ అని ఎవలు జెప్పిన్రు" వాళ్ల రివర్స్‌లో వచ్చేసరికి రాజు కంగారు పడ్డాడు.

"అంటే మీ అమ్మాయి లవ్ వ్యవహారాన్ని మీరు అంగీకరిస్తున్నారా?"

"అవ్ మల్లా!"

"అయితే మరి ఆ దినేష్ వాటర్ టాంక్ మీద నుంచి ఎందుకు దూకుతున్నాడు?"

"ఆ సంగతి వాడినడగాలె! నన్నడిగితే నాకేమెరుక? అడ్డమైనోడి సంగతులూ తెలుసుకోడానికి నేనేం ఛానలోడిలెక్క ఉన్ననా?" రాజుకు మతిపోయింది.

అంతా 'సుధి'వేపు కెమెరాలు తిప్పారు.

"సుధీ మీవాళ్లు మీ పెళ్లికి అంగీకారం తెలిపానంటున్నారు- నిజమేనా?"

"నిజమే-"

అందరూ మళ్ళీ షాక్.

"అయితే దినేశ్- అలా చెప్తున్నాడేంటి? సుధి తల్లిదండ్రులు ప్రేమకు అడ్డు చెప్తున్నందున దూకుతానంటున్నాడు కదా?"

"అతనిదీ నిజమే" మెల్లగా అంది సుధి!

అందరూ మళ్ళీ తలలు పట్టుకున్నారు.

మళ్లీ లైన్లో తుగ్లక్ ఛానెల్ న్యూస్ రీడర్ గజనీ- "రాజూ! సుధి తల్లిదండ్రులేమంటు

న్నారు? దినేష్‌తో పెళ్లి జరిపించడానికి ఒప్పుకున్నారా లేదా? "

"అదే సరిగ్గా అర్థం కావటం లేదు గజనీ. వాళ్ళయితే ఆ ప్రేమికులకు తామెన్నడూ అభ్యంతరం చెప్పలేదంటున్నారు. సుధి కూడా ఆ మాటను కన్‌ఫర్మ్ చేస్తోంది. ఒక్క నిమిషం గజనీ - సీఐ గారు దినేశ్‌తో మాట్లాడుతున్నారు. ఆ దృశ్యాన్ని మన ప్రేక్షకులకు చూపించవచ్చు" అంటూ కెమేరాలన్నీ సీఐవేపు తిప్పారు.

"దినేశ్! అనవసరంగా ఆవేశపడుతున్నావ్! సుధి పేరెంట్స్ సంస్కారవంతులు. వివాహానికి తాము అభ్యంతరం చెప్పలేదంటున్నారు. పెళ్లికి ఏర్పాట్లు కూడా చేశామంటున్నారు" అన్నాడు సీఐ.

దినేశ్ కోపంతో జుట్టు పీక్కుంటూ స్పీకర్ తీసుకుని అరుస్తూ మాట్లాడాడు.

"అంతా అబద్ధం! దగా! ఆ ముసలాళ్ళు డ్రామా ఆడుతున్నారు. వాళ్ళు సుధిని రాజేష్‌కిచ్చి పెళ్లి చేస్తున్నారు"

సీఐ ఖంగు తిన్నాడు.

"మిస్ సుధీ! మీ పేరెంట్స్ మీ ఇష్టానికి వ్యతిరేకంగా రాజేష్‌కి మిమ్మల్నిచ్చి పెళ్లి చేస్తున్నారని అంటున్నాడు- నిజమా? "

సుధి ఒక్కసారిగా కన్నీళ్ళు పెట్టుకుంది. దాంతో తుగ్లక్ ఛానెల్ రాజు చెలరేగాడు.

"గజనీ! పాపం ఈ మిస్ సుధిని చూస్తే అనాదిగా అన్యాయానికి, దౌర్జన్యానికీ గురవుతోన్న భారత మహిళకు ప్రతినిధిగా కనబడుతోంది.! తల్లిదండ్రులు ఇష్టం లేని పెళ్లి చేస్తున్నా కిక్కిరుమనకుండా మౌనంగా సహిస్తోంది గానీ ఈ అమ్మాయి పాపం తల్లిదండ్రుల దుర్మార్గాన్ని పదిమందికీ చెప్పలేక లోలోపల కుళ్లిపోతోంది- గజనీ!"

వెంటనే న్యూస్‌లో దున్నేయటం గజనీ వంతయింది- "అమాయకురాలయిన సుధిని ఆ అమ్మాయి తల్లిదండ్రులు మానసికంగా ఎంతగా హింసిస్తోందీ - ఎంతగా నరకయాతన పెడుతోందీ- ఆ అమ్మాయి పెట్టే కన్నీరే దానికి సాక్షి. తల్లిదండ్రుల ఆగడాలకు అంతేలేదా? గృహహింస చట్టం కింద పోలీసులు వారిని ఇంతరవకూ అరెస్ట్ చేయకపోవడం చూస్తూంటే- పోలీసుల నిర్లక్ష్య వైఖరి మనకు స్పష్టంగా తెలుస్తోంది. మీ తల్లిదండ్రులు కూడా ఇంత నికృష్టంగా ఉన్నారా? వెంటనే ఎస్.ఎం.ఎస్ చేసి నాలుగు జీరోలకు పంపండి"

సుధీ దగ్గరకొచ్చాడు సర్కిల్.

"మిస్ సుధీ! నువ్వూ దినేశ్ ప్రేమించుకున్నమాట నిజమేనా? "

"నిజమే"

"మీరిద్దరూ పెళ్ళి చేసుకోవాలని నువ్వు కోరుకుంటున్నావా? "

"అవును"

"కానీ మీ తల్లిదండ్రులు నిన్ను బలవంతపెట్టి రాజేష్‌కిచ్చి పెళ్ళి చేస్తున్నారు కదా? "

సుధి తండ్రి కోపంగా సర్కిల్ దగ్గరకు వచ్చి, "గిందులో బలవంతమేమున్నది వయ్యా- మా సుధి కోరికమీదే రాజేష్‌తో పెళ్ళి ఫిక్స్ చేశామని చెప్తూంటే మీకు, ఆ టీవీ చానెల్ కొడుకులకూ వినబడదా? " మండిపడ్డాడు.

ఇన్‌స్పెక్టర్ కంగారుపడ్డాడు.

"ఏంటి? సుధి కోరికమీదే రాజేష్‌తో పెళ్ళి ఫిక్స్ చేశారా? "

"అవుననేగా చెప్పేది? "

"అంటే మీ సుధి దినేశ్‌ని ప్రేమించలేదా? "

"ఆ ప్రశ్నా మా అమ్మాయినడగాలి"

"మిస్ సుధీ! నువ్ దినేశ్‌ని ప్రేమించావ్ కదా- మరి రాజేష్‌తో పెళ్ళి జరిపించమని మీ పేరెంట్స్‌ను ఎందుకు కోరావ్? "

"నేనూ రాజేష్ ప్రేమించుకున్నాం"

అందరూ షాక్.

"ఏంటి? నువ్వూ రాజేష్ ప్రేమించుకున్నారా? "

"అవును-"

"మరి దినేశ్‌ని ప్రేమిస్తున్నాన న్నావ్? "

"నాదీ రాజేష్‌ది శారీరక ప్రేమ. దినేష్‌తో నాకున్నది మానసిక ప్రేమ.'
'

తుగ్లక్ ఛానెల్ రాజుకి మతిపో యింది.

ఇన్‌స్పెక్టర్ బుర్ర గోక్కున్నాడు.

"ఏంటి రాజేష్‌తో శారీరక ప్రేమా- దినేష్‌తో మానసిక ప్రేమా? "

"అవును-"

"నాకు నీ మాటల్లో ఒక్కముక్క అర్థమయితే ఒట్టు. ఏమయ్యా రాజూ- మీరు కవర్ చేసే సెన్సేషనల్ న్యూస్ లన్నీ ఇలాటివేగా? ఆ అమ్మాయి చెప్పిన ప్రేమల గురించి నీకేమయినా అర్థమయిందా? "




రాజు అతని మాటలు వినిపించుకోలేదు. సుధి ఇచ్చిన స్టేట్‌మెంట్‌తో చానెల్ వ్యూయర్‌షిప్ పెంచుకోడానికి పెద్ద ఎత్తున కామెంటరీ మొదలుపెట్టాడు.

"గజనీ.. సుధి, దినేష్‌ల ప్రేమ వ్యవ హారం మరో కొత్త కోణంలో ప్రవేశించింది. సుధిని దినేష్, రాజేష్‌లు ఇద్దరూ ప్రేమించి నట్టు తెలుస్తోంది. అంటే దీన్ని మనం ఒక లవ్ ట్రయాంగిల్‌గా పేర్కొనవచ్చు గజనీ! ఇలాంటివి స్టూడెంట్స్‌లో చాలా సాధారణ విషయాలు గనుక సుధి విషయంలో కూడా అదే జరిగిందని చెప్పుకోవచ్చు గజనీ. ప్రస్తుతం ఇది ఒక ఫ్యాషన్‌గా కూడా మారిందని చాలా మంది అంటు న్నారు గజనీ. లవ్ ట్రయాంగిల్ లేని గాళ్స్‌నీ, బాయ్స్‌నీ సొసైటీలో చిన్న చూపు చూస్తున్నారనీ అనుకుంటున్నారు గజనీ"

"అయితే మరి ఈ వ్యవహారంలో సుధి పాత్ర ఏమిటి రాజూ? సుధి ఆ ఇద్దరిలో ఎవరిని ప్రేమిస్తోంది? "

"అదే కొంచెం కాంప్లికేటెడ్‌గా ఉంది గజనీ! తనకూ రాజేష్‌కీ మధ్య ఉన్నది శారీ రక ప్రేమనీ, తనకూ దినేష్‌కి మధ్య ఉన్నది మానసిక ప్రేమనీ రెండు కేటగిరీ లుగా విభజించింది గజనీ. మరింత క్లారిటీ కోసం సుధితోనే మాట్లాడతాను గజనీ"

"ఓకే రాజూ, ప్రొసీడ్"

"మిస్ సుధీ రాజేష్‌తో మీకు శారీరక ప్రేమ ఉందంటున్నారు. అలాగే దినేశ్‌ని మానసికంగా ప్రేమించానంటున్నారు. ఈ రెండు ప్రేమలకూ గల వ్యత్యాసాన్ని మీరెలా నిర్వచిస్తారు? "

"ఈ రెండు ప్రేమలకూ వ్యత్యాసం ఉందని మీకెవరు చెప్పారు? " అంటూ సుధి ప్రశ్నించేసరికి రాజు కంగారుపడ్డాడు.

"అంటే ఈ రెండింటికీ వ్యత్యాసం లేదని మీరంటున్నారా? "

"ఎక్కడుంది? రెండూ బేసిక్‌గా ప్రేమలే"

"అంటే ఆ ఇద్దరిలో ఎవరితో మీ జీవి తాన్ని పంచుకోడానికి ఇష్టపడుతున్నారు? " అందరూ సస్పెన్స్‌తో చూస్తున్నారు.



సుధి మాట్లాడలేదు.

"మిస్ సుధీ! మీ అభిప్రాయం తెలుసుకోడానికి తుగ్లక్ ఛానెల్ తాలూకూ కోట్లాది మంది ప్రేక్షకులు ఎంతో ఆత్రుతతో, సస్పెన్స్‌తో చూస్తున్నారు. జవాబు చెప్పండి."

"నాకు ఇద్దరితోనూ జీవితాన్ని పంచుకోవాలని ఉంది" అంతా కలకలం! దభేల్ మని టెర్రస్ వాటర్‌టాంక్ దగ్గర చప్పుడయింది. టాంక్ మీదనుంచి కిందపడిన దినేశ్ మళ్ళీ లేచి నిలబడ్డాడు.

"వాట్? ఇద్దరితోనూ జీవితాన్ని పంచుకుంటారా? అదెలా సాధ్యమవుతుంది. మిస్ సుధీ! పెళ్ళి అనేది ఒక్కరితోనే అవుతుంది కదా!"

"అయినా బాయ్స్ చాలామంది ఇద్దరమ్మాయిలతో సంసారం చేస్తున్నారు కదా"

"మగాళ్ళ సంగతివేరు సుధీ" ఆ తరువాత రాజు మాట్లాడలేకపోయాడు.

"ఇప్పుడేమంటావ్ మిస్ సుధీ. రాజేష్, దినేశ్‌లిద్దరినీ పెళ్ళి చేసుకుంటానంటారా?"

"అవును"

లేడీస్‌లో హాహాకారాలు. "ఇటీజ్ ఇంటరెస్టింగ్" అంది షైనీ.

"కానీ అందుకు చట్టం ఒప్పుకోదు కదా?" అడిగాడు రాజు.

"చట్టాన్నెవరు లెక్కచేస్తున్నారంకుల్? ప్రజాస్వామ్యంలో 'చట్టం' అనేది ఒక పెద్ద ఫార్స్! అయినా నేను చట్టాన్ని లెక్కచేయదల్చుకోలేదు. మా ఫాదరూ, మదరూ ఒప్పుకుంటే చాలు" చెప్పిందామె.

"ఇగో తుగ్లక్ ఛానెల్.. ఇప్పుడేందంటావ్ నువ్వు? ఆ ముగ్గురికీ పెళ్ళి చేయటానికి ఒప్పుకోవట్లేదు గనుక నేను రాక్షసుడిని, దుర్మార్గుడిని, పాగల్ గాడినంటావా- బే దమాక్ సాలే" విరుచుకుపడ్డాడు సుధీ తండ్రి. రాజు మొఖం వాడిపోయింది. మరుక్షణం గజని విజృంభణ మొదలైంది.

"సుధీ అనే ఈమె విప్లవాత్మకమయిన ప్రశ్న లేవనెత్తింది. ఆమె ప్రేమించిన ఇద్దరు యువకులనూ పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది. ఈ పద్ధతి మీరు కరెక్టనుకుంటున్నారా, తప్పనుకుంటున్నారా? ఏ విషయం వెంటనే ఎస్.ఎం.ఎస్ చేయండి" వెంటనే స్పీకర్‌లో సర్కిల్ అరిచాడు.

"దినేశ్! నువ్ ప్రేమించినమ్మాయ్ రాజేష్‌తోపాటు నిన్నూ కలిపి- కంబైన్డ్‌గా పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది. కనుక నువ్ దూకుడు కార్యక్రమం ఆపి ఆ అమ్మాయితోనే మాట్లాడి తేల్చుకో"

వెంటనే దినేశ్ స్పీకర్‌లో రెస్పాన్స్ ఇచ్చాడు.

"దానికి నేనొప్పుకోను. కేవలం సుధీ నన్నొక్కడినే పెళ్ళి చేసుకోవాలి! లేకపోతే దూకుతా"

మళ్ళీ పోలీసులు, సుధి పేరెంట్స్- ఆ అమ్మాయితో చర్చలు జరిపారు. కాసేపటి తర్వాత సుధి రాజేష్‌ని వదిలి దినేశ్‌ని పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకున్నట్లు సర్కిల్ ప్రకటించాడు.

ఆ ప్రకటన అలా ముగిసిందో లేదో ఆ పక్కనే ఉన్న బ్లాక్ వాటర్‌టాంక్ మీద

నుంచి ఇంకో గొంతు వినిపించింది.

"నా సుధిని నాకు కాకుండా ఇంకెవరికిచ్చి పెళ్ళి చేయడానికి ప్రయత్నించినా నేను దూకుతా"

అందరూ ఉలిక్కిపడి అటువేపు చూశారు. అతను సుధి శారీరక ప్రియుడు రాజేష్ అని అందరికీ అర్థమయిపోయింది.

సర్కిల్ కి పిచ్చెక్కిపోయింది.

"ఇదిగో.. కొడకల్లారా! ఇద్దరూ కట్ట కట్టుకు దూకండ్రా! దూకకపోతే నేనే మీ ఇద్దరినీ కాల్చిపారేసి ఈ ప్రాబ్లెమ్ సాల్వ్ చేస్తా" అంటూ రివాల్వర్ తీశాడు. సబ్ ఇన్ స్పెక్టర్ అతనిని శాంతపరచాడు. అపార్ట్మెంట్స్ వాళ్ళందరికీ పిచ్చెక్కిపోతోంది.

"ఈ చెత్త నాయాళ్ళందరికి మన అపార్ట్ మెంట్సే దొరికినయ్యా- ఇంకెక్కడయినా చావచ్చుగా" అన్నాడు శంకరమూర్తి.

"ఏమంటావమ్మా! వాళ్ళిద్దరూ నువ్ దక్కకపోతే ఛస్తానంటున్నారు- మరి నీ స్టేట్ మెంటేమిటి? " కోపం అణచుకుంటూ అడిగాడు సర్కిల్.

సుధి ఆలోచనలో పడింది.

ఈలోగా తుగ్లక్ ఛానెల్ రాజు మరింత ఉత్సాహంగా కామెంటరీ ఇస్తున్నాడు.

"ఇప్పుడో కొత్త యాంగిల్ మొదలయింది గజనీ.. సుధి తనకు దక్కకపోతే చస్తానని ఇద్దరు ప్రియులూ వాటర్ టాంక్ లెక్కి నిలబడ్డారు గజనీ. ఆమె కాదంటే ఇద్దరూ ఎప్పుడైనా దూకే అవకాశముంది గజనీ"

"వాళ్లు సుమారు ఏ సమయంలో, అంటే ఇంకా ఎంత సేపట్లో దూకుతారో చెప్పగలవా రాజూ? "

"అది కచ్చితంగా చెప్పటం ప్రస్తుతానికి సాధ్యం కాదు గజనీ- కానీ ఎవరో ఒకరు దూకటం ఖాయమని- ఇక్కడ నేను చేసిన సర్వేలో తేలింది గజనీ!"

"ఇప్పుడో చిన్న బ్రేక్" గజని కంఠం ఖంగుమంది. వెంటనే వ్యాపార ప్రకటన స్టార్టయింది.

"ఏ క్షణాన దూకుతారో తెలీని పరిస్థితుల్లో మీకు బాసటగా నిలిచేది మా నిశ్చింతా ఇన్సూరెన్స్ ఒక్కటే. ఈ క్షణమే మీ జీవితాన్ని బీమా చేసుకోండి. నిశ్చింతగా దూకి ఛావండి?

"ప్రేమ దూకుళ్ళవల్ల మీ తలలు పగిలినా, కాళ్ళు విరిగినా, వెన్నుపూస మట్టి కొట్టుకుపోయినా 'మట్టి మల్టీస్పెషాలిటీ హాస్పిటల్' ఒక్కటే మీ ఆరోగ్యం కుదిరేట్లు చేస్తుంది. ఎల్లవేళలా, ఎలాంటి రోగానికయినా గుర్తుంచుకోండి. మట్టి మల్టీస్పెషాలిటీ హాస్పిటల్-పంజాగుట్ట- హైదరాబాద్."

సరిగ్గా అప్పుడే ఇంకో బ్లాక్ పైనుంచి స్పీకర్ లో లేడీ వాయిస్ వినిపించింది.

"హలో.. నా పేరు రాధిక! ఆ దినేశ్ అనే బాడుకవ్ కొద్ది దినాల ముంగట నన్ను పెళ్ళి చేసుకుంటానని తుగ్లక్ టీవీ ఛానెల్ ద్వారా ఎస్.ఎం.ఎస్ పంపాడు. ఆ ఛానెల్ యాంకర్ కూడా మా ఇద్దరికీ బ్రోకరత్వం నెరిపి, ఇద్దరినీ నెక్లెస్ రోడ్ లో కలుసుకునేందుకు ఏర్పాట్లు చేశాడు. ఆ ఛానెల్ ద్వారానే ఇద్దరం ఏరోజు ఏ లాడ్జిలో కలుసుకోవలసిందీ ఎస్.ఎం.ఎస్ లతో తెలుసుకునేవాళ్ళం. వాడివల్ల నేను ప్రెగ్నెంట్ అయ్యాను. ప్రెగ్నెంట్ అని తెలిసినప్పటి నుంచి వాడు కనబడటం లేదు. తుగ్లక్ ఛానెల్ వాళ్ళు కూడా మాకేం సంబంధం లేదని చేతులెత్తేశారు. ఇప్పుడు ఆ దినేశ్ గాడికీ, నాకూ పెళ్ళి జరిపించకపోతే నేను దూకి చావటం తప్ప ఇంకో దారిలేదు."

ఒక్కసారిగా కథ కొత్త ట్విస్ట్ తీసుకునేసరికి ఈ వ్యవహారం ఏమిటో చూడాలని మా అపార్ట్ మెంట్స్ లో ఉన్న మొత్తం కుటుంబాలు బయటికొచ్చేశాయ్. ఇసుక వేస్తే రాలనంత జనం.

సర్కిల్ మళ్ళీ తలబాదుకున్నాడు.

"దినేశ్.. ఆ రాధిక అనే అమ్మాయి



చెప్పిందంతా విన్నావా? దీనిమీద నీ రియాక్షనేంటి? "

దినేశ్ ముఖంలో ఎక్కడలేని ఆవేశం కనబడుతోంది.

"అది చెప్పేదంతా అబద్ధం. అదొక మోసగత్తె. ఎవడితోనో కడుపు చేయించుకుని నన్ను బలిపశువుగా చేయాలనుకుంటోంది. దయచేసి దాని మాటలు నమ్మకండి! నేను సుధిని తప్ప ఇంకెవరినీ ప్రేమించలేదు. సుధి తప్ప నాకు ఇంకో ప్రపంచం లేదు" అన్నాడతను. దాంతో రాధిక మండిపడింది.

"వాడిలా చెబుతాడని ముందే తెలుసు! నా కడుపులో పెరుగుతున్న బిడ్డకు డిఎన్ఎ టెస్ట్ చేయిస్తే నిజం తెలుస్తుంది."

"రాజూ! అక్కడ ఏం జరుగుతోంది. మన ఛానల్ వీక్షకులు- ఎవరో ఒక్కరయినా దూకి చచ్చారా లేదా -అన్న విషయం తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉన్నారు. ఎస్.ఎం.ఎస్‌లు, ఫోన్‌కాల్స్‌తో మన ఆఫీస్ దద్దరిల్లిపోతోంది రాజూ" మళ్లీ ఆన్‌లైన్‌లో గజనీ ప్రత్యక్షం.

"గజనీ ఇప్పుడిక్కడ దూకడానికి రాధిక అనే మూడో అభ్యర్థి సిద్ధంగా ఉంది గజనీ. తను దినేష్‌వల్ల ప్రెగ్నెంట్ అయ్యాననీ, కానీ అతడు పెళ్లిచేసుకోవడానికి నిరాకరిస్తున్నాడనీ రాధిక ఆరోపణలు చేసింది గజనీ. తన బిడ్డకు దినేష్ తండ్రి అనడానికి డిఎన్ఎ టెస్ట్ చేయాలనీ పట్టుపడుతోంది గజనీ."

"మరి పోలీసులేమంటున్నారు రాజూ? "

"సర్కిల్‌గారు ఈ దూకుళ్ల పర్వాన్ని స్వయంగా పర్యవేక్షిస్తున్నారు గజనీ- ప్రస్తుతం దూకి చావడానికి ముగ్గురూ సిద్ధంగా ఉన్నారు గజనీ! అందులో ఏ ఒక్కరు చచ్చినా పోలీసులకు చాలా చెడ్డ పేరు వస్తుంది గజనీ! అందుకే వాళ్లు ఆచి తూచి అడుగులేస్తున్నారు గజనీ"

"ఇప్పుడీ ప్రేమ చతురస్రానికి పరిష్కారం ఏమయినా ఉందా రాజూ? "

"ఆపండహే వెధవ మోత. రాజూ- గజనీ.. రాజూ- గజనీ అంటూ పిచ్చెక్కించేస్తున్నారు. ఇదిగో త్రీనాట్ త్రీ.. ఆ టీవీ ఆఫ్ చేసెయ్" అరిచాడు సర్కిల్.

ఆ మాటతో షైనీ మండిపడింది.

"నా టీవీ నా ఇష్టం! మధ్యలో మీరెవరండీ ఆఫ్ చేయడానికి? మా అపార్టుమెంట్ లేడీస్ అంతా టీవీలో కనబడుతున్నామా లేదా అని చూసుకోవడానికి ఇక్కడ పెట్టుకున్నాం! ఆ టీవీ ముట్టుకున్నారంటే మర్యాదగా ఉండదు"

షైనీ తిరగబడేసరికి సర్కిల్ సైలెంటయిపోయాడు.

"దినేష్! నువ్ డిఎన్ఎ టెస్ట్‌కి సిద్ధమేనా? "

"నాకెందుకు సార్ డిఎన్ఎ టెస్ట్! రాధికను ప్రెగ్నెంట్ చేసిన దీపక్‌కి చేయమనండి!"

అందరూ ఉలిక్కిపడ్డారు.

"దీపక్ ఎవరయ్యా బాబూ! ఉన్నోళ్లతోనే చస్తూంటే ఆ దీపక్ పేరెందుకొచ్చింది? "

"ఏమ్మా రాధికా! ఆ దీపక్ నీ బిడ్డకు తండ్రి అని దినేష్ అంటున్నాడు. ఆ దీపక్

ఎవరసలు? "

"ఆ దినేష్‌గాడిని చెప్పు తీసుక్కొడతా! దీపక్ నాకు అన్నలాంటివాడు. మా ఇద్దరినీ కలిపింది అతనే!"

"అసలు దీపక్ ఎవరు? "

"తుగ్లక్ ఛానల్లో 'సయ్యాట కావాలా? లవ్వాట కావాలా?' ప్రోగ్రాం యాంకర్ సార్. అతనే ఫోన్‌లో జంటలు ఏ లాడ్జ్‌లో, ఏ పార్క్‌లో, ఏ ఫామ్‌హౌస్‌లో కలుసుకోవాలని.. అన్నీ హెల్ప్ చేస్తుంటాడు. ఒంటరిగా ఉండే గాళ్స్‌కి బాయ్స్‌నీ ఫోన్‌లో కలిపి జంటలుగా చేస్తుంటాడు. అతను నాకు అన్నయ్యలాంటివాడు. అతనికి రాఖీ కూడా కట్టాను."

"వాడికీ నీకు సంబంధం ఏంటి? మీరిద్దరూ గ్రీన్ పార్క్ హోటల్లో రూమెందుకు తీసుకున్నారని నేనే అడిగాక వాడికి రాఖీ కట్టావ్" దినేష్ అరిచాడు.

"ఆ దినేష్ మాటలు నమ్మకండి సార్! దీపక్, నేనూ అన్నాచెల్లెళ్ల బంధంతోనే నా బర్త్‌డేనాడు హోటల్ రూమ్‌లో గడిపాం! ఆ రాత్రంతా అన్నా చెల్లెళ్ల ప్రేమకు సంబంధించిన సినిమా పాటలు వింటూ గడిపాం. కావాలంటే మాతోపాటు అదే రూమ్‌లో ఉన్న దీపక్ ప్రియురాలు స్రవంతిని అడగండి"

"అబ్బా" తల గట్టిగా పట్టుకుని నేలమీద కూర్చుండిపోయాడు సర్కిల్.

కానిస్టేబుల్, ఎస్.ఐలు అతని చుట్టూ మూగారు.

"ఏమిటి సార్- ఏమయింది? "

"స్రవంతి అని కొత్త కారెక్టర్ ఎంటరయ్యేసరికి కళ్లు తిరిగినట్లనిపించింది. వెంటనే ఈ రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో టెర్రేస్ క్లోజ్ చేసి లాక్ చేయించండి. లేకపోతే ఇంకెంతమంది వాటర్ టాంక్ మీదెక్కి దూకి చస్తారో ఏమో!"

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ చూస్తుండగానే ఇంకో బ్లాక్ వాటర్‌టాంక్ మీద నుంచి ఇంకో కొత్త లేడీ గొంతు వినిపించింది.



"సార్ నా పేరు స్రవంతి! ఆరు నెలల క్రితం నేను టి.వి. టవర్ ఎక్కి దూకబోయాను. అప్పుడూ మీరే వచ్చి నా కోరిక ప్రకారం నాకూ, దీపక్‌కీ ఆ టవర్ కిందే పెళ్లి చేయడానికి ఒప్పుకొని నేను కిందకు దిగగానే పెళ్లి జరిపించారు."

సర్కిల్ ఆశ్చర్యంగా చూశాడు.

"అవును స్రవంతీ! నీకు, దీపక్‌కీ మీ కోరిక మీద దీపక్ తల్లిదండ్రులను బెదిరించి ఒప్పించి పెళ్లి చేసాం కదా! మళ్లీ ఇప్పుడు వాటర్ టాంక్ ఎందుకెక్కావు? "

"ఆ దీపక్ నుంచి నాకు విడాకులు కావాలి! వాడు నన్ను నరకయాతన పెడుతున్నాడు. రోజుకోదాన్ని ఇంటికి తీసుకొచ్చి 'ఇదే నా అసలు పెళ్లాం.. నువ్వు మాకు చాకిరీ చేయాల్సిందే' అంటూ కొడుతున్నాడు. ఏదో రోజు నన్ను హత్య చేస్తానంటున్నాడు. ఇప్పటికిప్పుడు నాకు ఆ మృగం నుంచి విడాకులు ఇప్పించకపోతే నేను దూకి చచ్చేది ఖాయం! వాడి చేతిలో చావటం కంటే ఇలా చస్తే టీవీ కవరేజయినా దొరు

కుతుంది" అందామె ఆవేశంగా!

"రాజూ! ఇప్పుడక్కడ పరిస్థితి ఏంటి! ఒక్కరయినా దూకారా? చర్చలు జరుగుతున్నాయా? " గజనీ నుంచి మళ్లీ ప్రశ్న.

"ఇంతవరకూ ఎవరూ దూకలేదు గజనీ- అసలిక్కడ ఎవరు ఎందుకు దూకుతున్నారో, ఎవరు ఎవరికోసం దూకుతున్నారో, ఇంతవరకూ ఎందుకు దూకటం లేదో, ఒకవేళ దూకితే ఎప్పుడు దూకుతారో, ఒకవేళ దూకకపోతే ఎందుకు దూకరో.. ఏమీ అర్థం కావటం లేదు గజనీ"

అప్పుడే పోలీస్ వైర్‌లెస్ హడావుడిగా మోగింది. 'ఇన్‌స్పెక్టర్ శ్రీరామ్.. ఇన్‌స్పెక్టర్ శ్రీరామ్- అర్జంటుగా అధికార పార్టీ ఆఫీస్ కార్యాలయానికి ప్రొసీడ్ అవ్వాలి. అక్కడ నలుగురు సిటింగ్ ఎమ్మెల్యేలకు టిక్కెట్లు ఇవ్వలేదని వారి అనుచరులు యాభైమంది పెట్రోలు పోసుకుని లైటర్‌తో అంటించుకోవడానికి సిద్ధంగా ఉన్నారు. వెంటనే ప్రొసీడ్ అయి వాళ్ళని రెస్క్యూ చేయాలి! ఓవర్"

"హలో.. శ్రీరామ్ స్పీకింగ్- శ్రీరామ్ స్పీకింగ్.. సార్, ఇక్కడ ఈ ప్రేమ గోడ వల్లో దూకే వాళ్ళసంఖ్య నాలుగుకి చేరింది. వీళ్ళను వదిలి పార్టీ ఆఫీస్‌కి వెళ్ళమంటారా సార్! వెయింటింగ్ ఫర్ ఇన్‌స్ట్రక్షన్స్ సార్- ఓవర్"

"నలుగురు పోతేపోనీ.. యాభైమంది ఇంపార్టెంట్ మనకి. పైగా ఇది పొలిటికల్. టాప్ ప్రయారిటీ - ప్రొసీడ్ ఇమ్మీడియెట్లీ.. ఓవర్" మరుక్షణం పోలీసులందరూ జీపుల్లో సైరన్ మోగించుకుంటూ వెళ్లిపోయారు.

గజని మళ్ళీ లైన్లోకొచ్చి- "రాజూ.. ఇప్పుడక్కడ పరిస్థితేంటి? పోలీసులేమంటున్నారు? "

"గజనీ ప్రస్తుతం ఇక్కడ పోలీసులు లేరు గజనీ! పార్టీ వర్కర్స్ మూకుమ్మడిగా పెట్రోలు పోసుకుని తగలబెట్టుకోబోతున్నారని ఇన్‌ఫర్మేషన్ రావడంతో వాళ్ళని రక్షించడానికి అక్కడికెళ్ళారు గజనీ"

"మరిప్పుడు ఆ అపార్ట్‌మెంట్స్ కమిటీ వాళ్ళేమంటున్నారు? "

"ఇప్పుడే ప్రెసిడెంట్ హమీద్‌మియాగారితో మాట్లాడతాను గజనీ- హమీద్ మియాగారూ ఆ దూకే వాళ్ళతో మీరు చర్చలు జరుపబోతున్నారా? "

"అంటే మాకెవరికీ ఏం పనీపాటా లేవనుకున్నయ్? దూకే వాటితో చర్చలే మాకు పని అనుకున్నయ్? దూకి ఛస్తే ఛస్తయ్- ఉంటే ఉంటయ్ - మేమందరం ఎవరి ఫ్లాట్‌కి వాళ్ళు పోతున్నాయ్- చలో భయ్- సబ్‌లోగ్ అందర్ ఛలో" అన్నాడు హమీద్ మియా కోపంగా. మొత్తం అందరూ ఫ్లాట్స్ లోపలికెళ్ళిపోయారు నిరుత్సాహంగా.

"మాణింగ్ నుంచీ అనవసరంగా వెయిట్ చేశాం! ఒక్కడయినా దూకి ఛస్తేనా? " విసుక్కుంటూ టి.వి. సెట్ లోపలకు తీసుకెళ్ళిపోయింది షైనీ.

గజని మళ్ళీ లైనో-

"రాజూ- ఏం జరుగుతోందక్కడ? లేటెస్ట్ న్యూసేంటి? "

"ఇప్పుడే నాకు మెసేజ్ వచ్చింది గజనీ. కృష్ణానగర్‌లో కొంతమంది సినిమాల్లో ఎక్స్‌ట్రాస్‌గా పనిచేసే గాళ్స్ తమ డిమాండ్స్‌ని సినీ పరిశ్రమ అంగీకరించాలని కోరుతూ అర్ధనగ్న ప్రదర్శన నిర్వహిస్తున్నారట గజనీ- ఆ కవరేజ్‌ని మన ప్రేక్షకులు ఎక్కువగా ఆదరిస్తారు కాబట్టి అక్కడికి వెళ్తున్నా గజనీ- తుగ్లక్ చానెల్ కోసం కెమెరామెన్ సునీతతో రాజు"

ఆ తరువాతేం జరిగిందో మాకు తెలీదు. మర్నాడు ఉదయం అందరం బయటికొచ్చి చూస్తే ఎవరూ దూకిన దాఖలాలేమీ కనబడ్లేదు సరికదా ఆ దూకేవాళ్లు కూడా లేరు. ©

# తెలుగు తావి.. తీవి విశ్వనాథ

## 1895 - 1976



**ప్రాచీన, ఆధునిక తెలుగు మహాకవులను జోడించి వేళ్లపై లెక్కించదలచినప్పుడు వారిలో ఉండి తీరవలసిన పేరు విశ్వనాథ సత్యనారాయణ. ఆయన పుంభావ సరస్వతి. సాహితీ విరాణ్మూర్తి. అనంత భావ సంపత్తి ఆయన సొత్తు. కవిత, కథ, నవల, నాటకం, గేయం, విమర్శ, వ్యాసం, రూపకం- ఇలా విశ్వనాథ స్పృశించని ప్రక్రియ లేదు. ఆయన నవ్య సంప్రదాయ కవితోద్యమాన్ని పరిపుష్టమొనర్చారు. ఆయన స్వాభిచిత్రణ లోకప్రసిద్ధం. "అల నన్నయకులేదు తిక్కనకు లేదాభోగం" పద్యంలో తనలాంటివాడ్ని శిష్యుడిగా పొందే అదృష్టం వారికి లేదనడంలో ఆ ధిషణాహంకారం తేటతెల్లమవుతుంది.**

విశ్వనాథ ప్రచురణలో 88 వేల వరకు రాత పుటలు ఉండవచ్చునని విమర్శకుల అంచనా. 'రామాయణ కల్పవృక్షము' మహాకావ్యానికి ఆయన 1970 సంవత్సరానికి జ్ఞానపీఠ పురస్కారం అందుకుని తెలుగు సాహిత్యానికి ఎనలేని గౌరవం చేకూర్చారు.

విశ్వనాథ 1895 సెప్టెంబరు 10న కృష్ణాజిల్లా నందమూరులో జన్మించారు. తండ్రి శోభనాద్రి. తల్లి పార్వతమ్మ. వీరి పూర్వీకులది హంసలదీవి సమీపంలో ఉన్న విశ్వనాథపల్లి. స్వగ్రామంలోని వీధిబడిలో అక్షరాభ్యాసం. ఇందుపల్లి, పెదపాడులలో ప్రాథమిక విద్య, వెలినూతల, నాగవరప్పాడు, మచిలీపట్నాలలో ఉన్నత పాఠశాల విద్య పూర్తి చేశారు. మచిలీపట్నంలో చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి శిష్యరికంలో సంస్కృతాంధ్రభాషలు సర్వంకషంగా అధ్యయనం చేశారు. నోబెల్ కళాశాలలో చదివి బి.ఏ. పట్టం పొందారు. పిమ్మట స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. మచిలీపట్నం హిందూ కళాశాలలో అధ్యాపకత్వం నిర్వహిస్తూ మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ. పట్టం (ప్రయివేటు) అందుకున్నారు. విమలానంద భారతీస్వాముల వద్ద వేదాంతం అభ్యసించారు. గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో, మచిలీపట్నం ఆంధ్రజాతీయ కళాశాలలో అధ్యాపకులుగా పనిచేసిన తర్వాత విజయవాడలోని ఎస్.ఆర్.ఆర్ & సి.వి.ఆర్. కళాశాలలో 1937 నుంచి 1957 వరకు తెలుగుశాఖాధిపతిగా వున్నారు.

1958 నుంచి 1961 వరకు కరీంనగరులో




వున్న ఎస్.ఆర్.ఆర్. కళాశాల ప్రధానాచార్యులుగా బాధ్యతలు నిర్వహించారు. 1958లో విశ్వనాథకు ఆంధ్రప్రదేశ్ శాసన పరిషత్తు సభ్యత్వం లభించింది. రాష్ట్ర సాహిత్య అకాడమీ 1957లో స్థాపన నుంచి ఉపాధ్యక్షులుగా చిరకాలం సేవలందించారు. బాల్యప్రాయంలోనే ఆయనకు వరలక్ష్మమ్మతో వివాహమయింది.

శతాధిక గ్రంథకుసుమాలతో తెలుగు సరస్వతిని అర్చించిన విశ్వనాథ పదకొండో ఏటనే

*(తరువాయి.. పేజి 128)*

# కాలాతీతం




# ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్




కొండల మీద మొహరించి ఉంది సైన్యం. చలి కాచుకోవటానికి శత్రువులు వేసుకున్న నెగళ్ల వెలుగు అల్లంత దూరంలో కనిపిస్తున్నది. చొక్కా ఉతుక్కోటానికి కాలువ గట్టుకెళ్లిన పొడగరి సైనికుడు జిమ్‌కాంక్లిన్‌కు ఓ పిడుగులాంటి వార్త తెలుస్తుంది. మరునాడు తెల్లవారు ఝామున శత్రువులపై దాడి చెయ్యటానికి తమపై అధికారులు వ్యూహాలు రచిస్తున్నారు. ఆ రాత్రంతా బెటాలియన్‌లోని సైనికులు ఈ విషయమే చర్చించుకుంటారు. దూరదేశాలలో జరిగిన భీకర పోరాటాల గురించి విన్నారు. ఆ వర్ణనలకు శరీరం గగుర్పొడిచింది. వీరుల శౌర్య పరాక్రమాలు తమలో ఉత్తేజం పెంచాయి. జీవితంలో తమనూ అలాంటి అనుభవం వరిస్తుందా అని కలలుగన్నారు. తీరా ఇప్పుడు యుద్ధం ప్రారంభం కాబోతుందని తెలిస్తే ఆందోళన పెరిగింది. కాని యుద్ధాల స్వభావం కూడా మారిపోతున్నది. గతకాలపు సమరాలతో పోలిస్తే ఇవి చిన్న పోట్లాటలే.

హెన్రీ ఫ్లెమింగ్‌కు 'జాగ్రత్త! ప్రాణం మీదకి తెచ్చుకోకు!' అంటూ తల్లి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. చివరికి 'వీడ్కోలు' చెబుతూ అక్కున హత్తుకున్నప్పుడు తనకూ కన్నీరాగలేదు.

సైన్యంలో చేరినరోజే డ్రిల్లు ప్రారంభమైంది. శరీరశ్రమతో మనసు మొద్దుబారుతుంది. ఈ వందల వేలమంది యువకులలో తనూ ఒక్కడు. స్వంత అభిప్రాయాలకు, అభ్యంతరాలకు విలువలేదు. వేయి కళ్ల, పదివేల చేతుల, కరకు కోరల యుద్ధ భూతం తమనూ కబళించబోతున్నది.

శత్రువుల గురించి ఆలోచించాడు. వాళ్లెవరైనా నిర్ధాక్షిణ్యంగా కాల్చివేయటమే

తమ డ్యూటీ. యుద్ధంగురించి చదివాడు. విన్నాడు. ఇప్పుడు ప్రత్యక్షంగా పాల్గొనబో తున్నాడు. తాను శత్రువులను ఎదిరించగ లడా? దాడి తర్వాత బతికుంటాడా? ప్రాణరక్షణ కోసం పారిపోవచ్చా? "నాకు ప్రాణభయం లేదు." అని ప్రగల్భాలు పల కటం సులభమే. కాని యుద్ధమే వ్యక్తుల నిజస్వరూపాన్ని బహిర్గతం చేస్తుంది. తన బెటాలియన్‌లో ఎందరు వీరులు, ఎందరు పిరికి పందలున్నారు? సూర్యోదయంతో పాటే మార్చింగ్ ఆర్డర్ ఇస్తాడు కమాం డర్. తామెక్కడికెళ్లాలి? కొందరు జోకులే స్తున్నారు. సరదాగా పాడుకుంటున్నారు.

రాత్రి విశ్రమించినప్పుడు ఇల్లు జ్ఞాపకం వస్తుంది. హాయిగా వ్యవ సాయం, పశు పోషణతో ప్రశాంతంగా గడిపిన వాడి క్కడకెందుకొచ్చాడు? తనకు సైనికుడి లక్షణాలు లేవు.




మరో సైనికుడు విల్సన్. ఎందుకంత ముభావంగా ఉంటాడు. భయమా? బెంగా? తీరా యుద్ధం ప్రారంభమైన తర్వాత ఎవరైనా పారిపోరని నమ్మకమేమిటి?

"మన ఇష్టాయిష్టాలిక్కడ పనిచెయ్యవు. పారిపోవటం సాధ్యంకాదు."

మరునాడు సైన్యం నది దాటింది. కొన్నాళ్ల ఫీల్డు అనుభవంతో కొత్త రిక్రూట్లు కూడా డిసిప్లిన్‌కు అలవాటుపడ్డారు. దా డికి ముందు, అనావశ్యకమైన లగేజీ కిందికి దించుకోవాలి. కాంక్లిన్ మెరుపులా ముందుకు పరిగెత్తాడు. తుపాకులు పేలాయి. అంటే, 'రియల్ థింగ్' ప్రారం భమైంది. హెన్రీ పారిపోవటానికి ప్రయ త్నించాడు. ఎక్కడికీ కదలలేదు. అంద రితో పాటు అడుగు ముందుకెయ్యక తప్పదు. తాను స్వచ్ఛందంగా సైన్యంలో చేరాడు. ఇది పిల్లలాట కాదు, మానెయ్య టానికి. యుద్ధరంగంలో సైన్యం కదలిక అంటే చావు ఊరేగింపులాంటిదే.

కొందరు ఎదురెదురుగా నిల్చిపోరాడుతు న్నారు. కొందరు పొదల్లోకి కాలుస్తు న్నారు. అడుగు ముందుకేసిన హెన్రీ కాళ్ల దగ్గర మృతదేహం. శత్రువులు పన్నిన 'ట్రాప్'లో పడుతున్నారందరూ. 'ఆగండి' అంటూ కేకెయ్యాలనిపించింది. ఒక సైని కుడు అదేదో ఆటలపోటీ అన్నట్టుగా ముందుకురికాడు. 'యుద్ధరంగంలో ప్రతి వ్యక్తీ తనలో దాగిన మరో వ్యక్తిని గుర్తి స్తాడు' అని ట్రయినింగ్‌లో చెప్పారు. విల్స న్‌కు ప్రాణభయం పట్టుకున్నట్టుంది. తాను మరణిస్తే ఇంటికి పోస్టు చెయ్యమని ఒక 'పచ్చ కవర్' ఇచ్చాడు.

మరో రోజు చెట్ల వెనక నక్కి, శత్రువుల కదలికలను గమనిస్తున్నది బెటాలి యన్. అప్పుడప్పుడూ తుపాకీ చప్పుళ్లతో తెల్లపొగ కమ్ముకుంటున్నది. బుల్లెట్లు తలపైనుండి పోతున్నాయి. అంతలో ఒకడు, 'అదిగో శత్రువు!' అంటూ కేకేశాడు. ఫైరింగ్ పొజిషన్‌లో నిల్చున్నా రు. జనరల్ కల్నల్‌కు ఆదేశాలిచ్చాడు. హెన్రీ కాల్పులు ప్రారంభించాడు. కాని యు ద్ధంలో ఎవరికీ ప్రత్యేక వ్యక్తిత్వం ఉండదు.

అందరూ బెటాలియన్ అనే యంత్రంలో చిన్న చిన్న భాగాలే. సౌభ్రా తృత్వ భావన ఎక్కువ అక్కడ. ఎందుకు యుద్ధం చేస్తున్నామో మరచిపోవటానికదో కారణం. త్వరలోనే కాల్పుల ప్రభావం కని పించింది. పొగతో, వాసనతో శరీరం మంటబుట్టింది. కళ్లు మూసుకుపో యాయి. శౌర్యం సంగతేమోగానీ నిలుచో వటమే నరకంగా ఉంది. ఊపిరాడలేదు.

ఎవరు హీరోలు? ఏదీ ఆ అద్భుత

దృశ్యం? నిల్చుని, వంగి, కూర్చుని, పడుకుని, అన్ని భంగిమల్లోనూ తుపాకులు కాల్చాలి. కొందరు మరణించారు. క్షతగాత్రుల సంఖ్య పెరిగింది. మొత్తం మీద ఆ సాయంత్రానికి శత్రువును నిలువరించగలిగారు. దాహంతో నోరు పిడచగట్టుకుపోయింది. దూరంగా తుపాకీ మోతలు విని పిస్తున్నాయి. అంటే మరో సెక్టార్లో యుద్ధం కొనసాగుతూనే ఉన్నదన్నమాట.

అలసిపోయిన హెన్రీ కాసేపు కళ్లు మూసుకున్నాడో లేదో, 'శత్రువు' అంటూ మళ్లీ కేకలు. రెజిమెంట్లో ఎవరికీ పోరాడే ఓపిక లేదు. కానీ యుద్ధంలో విరామం ఉండదు. మనస్థైర్యానికి ఇది పరీక్ష. పక్కనున్న సైనికుడు, తుపాకీ కింద పడేసి పారిపోవటానికి ప్రయత్నించాడు. అతణ్ణి చూసి మిగిలిన వాళ్లు తలో దిక్కూ పరిగెత్తారు. తను ఒంటరిగా శత్రువునెదిరించాలి కాబోలుననుకున్నాడు హెన్రీ. తల తిరిగినట్టైంది. తను చూసింది నిజమేనా?

మరికాసేపటికి స్పృహవచ్చి చుట్టూ పరికించాడు. ఎవరూ పారిపోలేదు. అందరూ కలిసి శత్రువును వెనక్కు నెట్టగలిగారు. తన అశక్తతకు సిగ్గుపడ్డాడు హెన్రీ. సాయంత్రం అడవిలో నడుస్తున్నప్పుడు ఉడత కనిపించింది. విరిగిన కొమ్మను విసిరాడు. అది కిచకిచమని చప్పుడు చేస్తూ దాక్కుంది. 'ఆత్మ రక్షణ జీవలక్షణం' అనుకున్నాడు. మరోచోట కుళ్లిన శవం చూశాడు.

'ఆకాశం ఎరుపు. నిప్పురవ్వలు ఎరుపు. నెత్తురు, యుద్ధం ఎరుపు' అనుకుంటాడు. గాయాలపాలై, నెత్తురోడుతున్న సైనికులు కొందరు. అంత బాధలోనూ నవ్వుతున్నారు. మరికొందరు తమకు జరిగిన నష్టానికి 'కమాండింగ్ జనరల్'ను నిందిస్తున్నారు. ఒకడు విరగబడి నవ్వుతున్నా మొహంలో మృత్యువు తాండవిస్తుంది.

అందరూ తమ డ్యూటీ నిర్వర్తించారు. తానొక్కడే పారిపోవటానికి సాకులు వెదుక్కుంటున్నాడు. యుద్ధరంగంలో తగిలిన ఎర్రటి గాయమే సైనికుడికి నిజమైన ప్రశంసా పతకం- రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్.

తన మిత్రుడు జిమ్ కాంక్లిన్ తీవ్రంగా గాయపడ్డాడు. బాధతో మూలుగుతున్నాడు. 'నేను నడవలేను. ఈ దారి పక్కనే పడిపోతాను. నన్నెవరూ గుర్తుపట్టరు. ఆర్మీ ట్రక్కులు నా మీదుగా వెళ్లిపోతాయి' అంటూ ఏడుస్తున్నాడు. అదే జరిగితే 'నిన్ను పక్కకు లాగుతానులే' అన్నాడు హెన్రీ. జిమ్ నడవలేక ముందుకు తూలాడు. హెన్రీ అతణ్ణి పొదల్లోకి లాగాడు. మనుషులు ఇలాగే ఒంటరిగా 'నా' అని పలకరించేవాళ్లు లేకుండా మరణిస్తారు. మృత్యు బాధతో మెలితిరిగి తుదిశ్వాస విడిచాడు జిమ్. ఆ క్షణాన హెన్రీలో ఏదో మార్పు. పిడికిలి బిగించి యుద్ధరంగం వైపు కదిలాడు.

'నాకు బాధ్యతలున్నాయి. ఇంటి వద్ద భార్యా పిల్లలకు నా అవసరముంది. నేను చావటానికి వీల్లేదు' అంటూ ఆక్రోశించాడు మరో సైనికుడు. కాని మరి కాసేపట్లో తుపాకీ గుండు తగిలి నేలకొరిగాడు.

హెన్రీలో అంతర్మథనం కొనసాగుతుంది. మరణించేవాళ్లే తనకాదర్శం. యుద్ధంలో పాల్గొనాల్సిందే. ఆకలిగా ఉంది. ఒళ్లంతా నొప్పి. సమీపంలోనే ఎక్కడో పోరాటం జరుగుతున్నది. తమ సైన్యం ఓడిపోతే తననెవరూ నిందించరు. గెలిస్తే డెజర్టర్గా ముద్రవేస్తారు. యూనియన్ ఆర్మీ అపజయం ఎరుగదు. ఆలోచనలతో తనను తాను చిత్రహింసలు పెట్టుకోవటం కన్నా మరణించటమే మేలు.

ఆకస్మాత్తుగా పొదల్లోంచి సైనికులు పరిగెత్తుకొచ్చారు. "ఏమైంది?" అడిగాడు హెన్రీ. ఎవరూ జవాబు చెప్పలేదు. ఒకణ్ణి చేయి పట్టుకుని ఆపటానికి ప్రయత్నిస్తే

# ప్రముఖుల ప్రశంసలు

యుద్ధరంగంలో సైనికుల మనస్తత్వాన్ని అత్యంత వాస్తవికంగా చిత్రించిన నవల 'ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్.' హెచ్.జి.వెల్స్, జోసెఫ్ కోన్రాడ్‌లు దీన్ని అమెరికన్ సాహిత్యంలో అనర్ఘరత్నమని కొనియాడారు. 'ఇదొక అద్భుతమైన వచన కావ్యం' అన్నాడు ఎర్నెస్ట్ హెమింగ్వే.

"తన రచనల్లో జీవితాన్ని స్పృశించ గలిగిన వాడే నిజమైన రచయిత" ఈ కథలో డాక్యుమెంటరీ కన్నా సహజంగా యుద్ధరంగాన్ని దర్శింపచేశాడు రచయిత. నిజానికి సైనికులందరూ దేశభక్తి ప్రేరేపితులై 'విజయమో వీర స్వర్గమో' అనుకుంటూ ఆత్మ త్యాగానికి సిద్ధపడి తుపాకీ పట్టుకుంటారా? అంతగా విద్యాగంధం లేని నిరుపేద యువకులకు సులభంగా దొరికే ఉద్యోగం ఇదేనని, యూనిఫాం ధరించినప్పుడు వాళ్ల కోరికలేమిటి? ప్రాణభయం ఉండదా?

స్టీఫెన్ క్రేన్ ఈ నవల రాసే నాటికి అమెరికాలో అంతర్యుద్ధం(సివిల్ వార్) ముగిసి మూడు దశాబ్దాలు దాటింది. ఆనాటి జ్ఞాపకాలు, అనుభవాలు నెమరేసుకున్న వాళ్లను జనం ఆసక్తిగా విన్నారు. అనేక పుస్తకాలు కూడా వచ్చాయి. ముఖ్యంగా సెంచరీ మాగజైన్‌లో వచ్చిన 'బ్యాటిల్స్ అండ్ లీడర్స్ ఆఫ్ సివిల్ వార్' శీర్షిక ఆధారంగా, యుద్ధానుభవం లేని ఇరవైరెండేళ్ల యువకుడు ఈ నవలా రచనకు ఉపక్రమించాడు.

సివిల్ వార్‌లోని అత్యంత రక్తసిక్తమైన బ్యాటిల్ ఆఫ్ చాన్సిలర్స్ విల్ ఈ నవలలోని కథాక్షేత్రం. కథాకాలం 1861. అంటే పారిశ్రామిక విప్లవానికి ముందు రోజులన్నమాట. అప్పటికి అమెరికా వ్యావసాయిక దేశం. ఈ నవలలోని కథానాయకుడు హెన్రీ ఫ్లెమింగ్‌ది కూడా రైతు కుటుంబమే.

ఈ నవలలోని ప్రత్యర్థి సైన్యాలు- ఒకటి ప్రభుత్వ(యూనియన్) ఆర్మీ. మరొకటి తిరుగుబాటు చేసిన కాన్‌ఫెడరేట్ ఆర్మీ. 'మనుషుల్ని కబళించే ఒక బ్రహ్మారాక్షసి సైనిక వ్యవస్థ' అంటాడు రచయిత. సైనికులు ఆ రాక్షసి కరాళ దంష్ట్రల్లో చిక్కుకున్న కీటకాలు. మృత్యుముఖంలో వ్యక్తులు ఏమాలోచిస్తారు? ఎలా ప్రవర్తిస్తారు? ధైర్యం అంటే ఏమిటి? శవాల గుట్టలుగా మారిన యుద్ధరంగంలో హీరోలెవరు? సైనికులది సామూహిక జీవితమే. బెటాలియన్‌గా కదులుతారు. అయినా చివరి క్షణంలో ఎవడికి వాడే. హెన్రీ ఫ్లెమింగ్ వ్యక్తికాదు. తుపాకి పొగలలో పుట్టి, మృత్యువుతో సహజీవనం చేసిన ఒక సైనికుడు. దేశకాలాలకు అతీతంగా, 'సైనికుని' ఆత్మను మన ముందు ఆవిష్కరిస్తాడు రచయిత.

కోపంగా రైఫిల్‌తో తలమీద మోది కదిలిపోయాడు. బాధతో తల్లడిల్లి కిందపడిపోయాడు హెన్రీ. తలకు పెద్ద గాయమైంది. అయితే ఇప్పుడదే ఆభరణం. రెడ్ బాడ్జ్.

తిరిగి వచ్చి బెటాలియన్‌లో కలిశాడు. సెంట్రీ డ్యూటీ చేస్తున్నాడు విల్సన్. మరణించాడనుకున్న మిత్రుడు వచ్చినందుకు సంతోషించాడు. యుద్ధంలోనే తలకు గాయమైందని అబద్ధమాడాడు హెన్రీ.

మరునాడు మళ్లీ యుద్ధం ప్రారంభం. బురద గుంటల గుండా ప్రయాణిస్తారు. తుపాకీ మోతలతో ఒకరి మాటలొకరికి విన్పించవు. ఈ కష్టాలకు కమాండింగ్ ఆఫీసర్ నిర్ణయాలే కారణమంటాడు హెన్రీ.

శత్రువుల మీద కూడా కోపం వచ్చింది. వాళ్లకు విశ్రాంతి వద్దా? అటువైపు యుద్ధం చేస్తున్నది కూడా తమ లాంటి మనుషులే గదా! ఊళ్లో జంతువులు కూడా తమకన్నా సుఖంగానే బతుకుతాయి.

తుపాకీ పొగతో కళ్లు మండుతున్నాయి. శత్రువును ఓడిస్తే తప్ప తమకు విశ్రాంతి ఉండదు. ప్రాణ భయంతో బిగుసుకుపోతే యుద్ధం చెయ్యలేడు. ఒక్కసారి తమ రైఫిళ్లలోని తూటాలన్నీ వాళ్లమీద వర్షించాలి. యుద్ధమంటే ప్రత్యర్థి సైనికుల పట్ల ద్వేషం పెంచుకోవటం. వాళ్లను చంప

# స్టీఫెన్ క్రేన్ ( 1871 - 1900 )

స్టీఫెన్ క్రేన్ నెవార్క్ (న్యూజెర్సీ)లో జన్మించాడు. తండ్రి మెథడిస్ట్ మినిస్టర్. ఆయన సంతానంలో స్టీఫెన్ పద్నాలుగోవాడు. బాల్యం నుండీ అనారోగ్య పీడితుడే. తెలివితేటలు బాగానే ఉన్నా స్కూలు చదువులో పెద్దగా శ్రద్ధ చూపించలేదు. బేస్‌బాల్ అంటే అతడికి చాలా ఇష్టం. 1890లో లఫాయెట్ కాలేజీ, సిరాక్యూజ్ యూనివర్సిటీలో చేరాడు. తన కోర్సుకు సంబంధించినవి తప్ప మిగతా పుస్తకాలన్నీ విపరీతంగా చదివాడు. అథ్లెటిక్స్‌లో ప్రతిభ కనబరిచాడు. ఆ తర్వాత న్యూయార్క్‌లో కొన్నాళ్లు ఉద్యోగం చేసి రచనా జీవితాన్ని ఎంచుకున్నాడు. ఫ్రీలాన్స్ విలేఖరిగా అనేక పత్రికలకు రాశాడు. కాని దానివల్ల వచ్చే ఆదాయం నిత్యావసరాలకు కూడా సరిపోలేదు.

తొలి రచన 'మాగీ: ఎ గర్ల్ ఆఫ్ ది స్ట్రీట్స్' ప్రచురణకర్తల్ని షాక్‌కు గురి చేసింది. ఆ పుస్తకాన్ని క్రేన్ స్వయంగా అచ్చేసుకున్నాడు. టాల్‌స్టాయ్ రచనల ప్రభావంతో 1893లో "ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్" నవల తొలి ప్రతి రాశాడు. అందులో యుద్ధ దృశ్యాలను, సైనికుల మనస్తత్వాలను కళ్లకుకట్టినట్టు చూపిన ఈ యువరచయిత ప్రతిభ అందర్నీ ఆశ్చర్యపరిచింది. కేవలం పదిరోజుల్లో ఈ నవల ముగించాడట క్రేన్. ఫిలడెల్ఫియా పత్రికలో అది సీరియల్‌గా వచ్చినప్పుడు, అశేష పాఠకులు ఈ రచయితను 'గ్రేటెస్ట్ అమెరికన్ రైటర్' అన్నారు.

యుద్ధ నవలలతో ప్రఖ్యాతుడైన క్రేన్‌కు వార్ కరెస్పాండెంట్‌గా చాలా అవకాశాలు వచ్చాయి. గ్రీస్-టర్కిష్ యుద్ధం గురించి పత్రికలకు రిపోర్ట్ చేశాడు. గ్రీస్‌లో ఉన్నప్పుడు కోరా టేలర్‌ను పెళ్లి చేసుకుని ఇంగ్లండులో కొంతకాలం నివసించాడు. అక్కడే క్షయవ్యాధి సోకింది. చికిత్సకోసం జర్మనీ వెళ్లాడు. అప్పట్లో దానికి తగిన చికిత్స లేకపోవడంతో ఫలితం కనిపించలేదు. ఇరవై ఎనిమిదేళ్ల లేత ప్రాయంలోనే మరణించాడు. ఈయన కలం నుంచి వెలువడ్డ బ్లూ హోటల్, బ్రైడ్ కమ్స్ టు ది ఎల్లో స్కై, ది ఓపెన్ బోట్ కథలు అమెరికన్ సాహిత్యంలో ఆణిముత్యాలు.

అల్పాయుష్కుడైన క్రేన్ మరణానంతరం ప్రచురితమైన 'ఊండ్స్ ఇన్ ది రెయిన్' (1900), 'స్కెచెస్' రచనలు గొప్ప రచయిత హెమింగ్వే ప్రశంసలు పొందాయి.

1925-26 మధ్య ఈయన సమగ్ర రచనలు పన్నెండు సంపుటాలుగా వెలువడ్డాయి.

టమే లక్ష్యమనుకుంటే తప్ప తుపాకీ పట్టలేదు. దూకుడుగా కదిలిన హెన్రీ తోటి సైనికులకు హీరోలా కనిపిస్తాడు 'నీ లాంటి వాళ్లుంటే పది రోజుల్లో విజయం తథ్యం' అంటాడు కమాండింగ్ ఆఫీసర్.

సైనికుడు జిమ్మి రోజర్స్‌కు బులెట్ తగులుతుంది. ఎవరూ అతణ్ణి పట్టించుకోరు. బాధతో మెలికలు తిరిగిపోతూ దొర్లుతాడు. హెన్రీ, విల్సన్ అతడికి గుక్కెడు నీళ్లివ్వాలని చూస్తారు. పరిసరాల్లో కాలువలేదు. ఆ అన్వేషణలో ఇద్దరు సీనియర్ ఆఫీసర్ల సంభాషణ కనిపిస్తుంది. "సైనికులంతా పల్లెటూరి రైతులు, రైతులు, పశువుల కాపర్లు" అంటాడొకడు. ఆఫీసర్లు తమ గురించి ఇంత నీచంగా మాట్లాడుకుంటున్నారు.. వీళ్ల కోసమా ప్రాణ త్యాగానికి సిద్ధపడ్డారు? బెటాలియన్ చేరుకుని వాళ్ళ గురించి చెబుతారు. సైన్యం ముందుకు కదులుతుంది. ఈ పశువుల కాపర్లలో ఎంతమంది ప్రాణాలతో బతికి బయటపడతారు?

గుర్రపు స్వారీ చేస్తున్న సైనికుడు జెండా పట్టుకుని పరుగెత్తుకొస్తాడు. దేశానికే గర్వ కారణం ఆ జెండా! తుపాకీ గుండు తగిలి జెండా పట్టుకున్న సార్జంట్ నేలకొరుగుతాడు. హెన్రీ ఆవేశంగా జెండా కర్ర పట్టుకుని నిటారుగా నిలబెడతాడు. విల్సన్ కూడా సాయం చేస్తాడు. ఇద్దరిలో ఎవరి వద్ద

ఉండాలి జెండా? ధైర్యసాహసాలు ప్రదర్శించి దాన్ని కాపాడిందెవరు? హెన్రీకే ఆ హక్కు ఉందంటారు మిగతావారు.

తమను 'పశువుల కాపర్లు' అన్నందుకు ఆఫీసర్ల మీద కోపం వస్తుంది అందరికీ. యుద్ధంలో శత్రువును ఓడించి తమ అర్హత నిరూపించుకోవాలి. అప్పటికే అందరూ అలిసిపోయారు. ముందుండవలసిన వాళ్ళు వెనక వరుసల్లో విశ్రాంతి తీసుకుంటారు. కొందరు గుళ్లు తగలకుండా తప్పించుకోవాలని అనుకుంటున్నప్పుడు మిగతా వాళ్లు యుద్ధం చెయ్యటంలో అర్థం లేదు.

ప్రత్యర్థి సైనికులు తమ రెజిమెంట్ మీద దాడి తీవ్రతరం చేస్తారు. ఆత్మరక్షణలో తలోదిక్కు పరిగెడతారు సైనికులు.

హెన్రీ ధైర్యంగా జెండా పట్టుకుని ముందుకు కదులుతాడు. ఎంత సాహసోపేతంగా యుద్ధం చేసినప్పటికీ ఆఫీసర్లు అవమానిస్తూనే ఉంటారు. సీనియర్లు ప్రాణాలకు ప్రమాదం లేని పద్ధతిలో యుద్ధం చేసినట్లు నటిస్తారు. కొత్తగా చేరినవాళ్లు మాత్రం నిబద్ధతను నిరూపించుకునేందుకు ముందుకురుకుతారు.

'పశువుల కాపర్లను రిక్రూట్ చేసుకొని యుద్ధం చేస్తాం?' అంటూ వికటంగా నవ్వుతాడు జనరల్.

'ఇంకేం చెయ్యాలి? ఇంకెంతమంది చావాలి?' అనుకుంటారు సైనికులు. "హెన్రీ, విల్సన్‌లను చూసిన ఓ సీనియర్, 'మిమ్మల్ని మేజర్ జనరల్‌గా ప్రమోట్ చెయ్యాలి!' అంటాడు.

"ఒక్కడన్నా తమ సామర్థ్యాన్ని గుర్తించాడు!" అనుకుంటాడు హెన్రీ.

అప్పటిదాకా దాగిన శత్రువులు మెరుపు దాడి చేస్తారు. సైనికులు ఒకసారి ముందుకు కదిలి, వెనక్కు తగ్గి యుద్ధం చేస్తారు. ఆఫీసర్ల అవహేళనవల్ల ప్రాణాలకు తెగించి పోరాడతారు.

శత్రువులు ముందుకు కదులుతున్నారు. ఇక ఎదిరించకపోతే కాలికి బుద్ధి చెప్పాల్సిందే. ఒళ్లంతా దుమ్ముకొట్టుకుపోయి చిరిగిన యూనిఫారాలతో, అలిసిన మొహాలతో అయిష్టంగానే యుద్ధం చేసింది రెజిమెంట్. జెండాను చూసి హెన్రీలో దేశభక్తి పొంగింది. దీని కోసం ప్రాణాలర్పించవచ్చు యుద్ధరంగంలో ఎంత దయనీయంగా మరణించినా తమ త్యాగం గొప్పదని కీర్తిస్తారు. శత్రువుల పక్షాన జెండా మోసినవాడు బులెట్ తగిలి మరణించాడు. ఏ వైరమూ లేని రెండు సైన్యాలు ఆఫీసర్ల ఆదేశాల మేరకు పరస్పరం చంపుకుంటున్నాయి. శత్రువుల జెండాను చేజిక్కించుకుంటాడు విల్సన్. నలుగురు సైనికులను బందీలుగా పట్టుకుంటారు. ఇదో అనూహ్య విజయం. హెన్రీ, విల్సన్ పరస్పరం అభినందనలు తెలుపుకుంటారు.

అంతర్ముఖుడైన హెన్రీ తన యుద్ధానుభవాన్ని విశ్లేషించుకుంటాడు. బతికుండటమే నిజమైన విజయం. మరణించిన వాళ్ళకు కూడా తనకున్నట్లాంటి కోరికలే ఉండవా? మొత్తం మీద తను మృత్యువు మొహంలో మొహం పెట్టి చూశాడు. ఎవరు గెలిచినా, ఎవరోడినా ప్రాణాలర్పించేది మాత్రం సాధారణ సైనికులే.

పాటలు పాడుకుంటూ ఫీల్డ్ హెడ్ క్వార్టర్స్ వైపు రెజిమెంట్ కదిలింది.

'కరేజ్' అంటే ఏమిటి? స్వార్థ ప్రయోజనాలను మరిచి, ఉన్నత ఆశయాలకోసం పోరాడటం. కాని యుద్ధం వల్ల ఎవరికి ప్రయోజనం? గెలిచినవాళ్లూ, ఓడినవాళ్లూ సాధించేదేమీలేదు. రెడ్ బాడ్జ్ పొందడమంటే కరేజ్ చూపించడమో, తలకు తగిలిన గాయమో కాదు. దేశభక్తి అనేది కూడా కాదు. యుద్ధం గురించిన భ్రమలు తొలగిపోవటమే నిజమైన బాడ్జి.

– ఎం.వసంత

(పేజి 121 తరువాయి..)

కవితా రచనకు శ్రీకారం చుట్టారు. ఎం.ఏ. చదువుతున్నప్పుడే 'ఆంధ్ర పౌరుషము' పద్యకృతి వెలుగు చూసింది. కవితాఝురి వేగోద్ధతితో పరుగులు తీసింది. ఆయన పద్య రచన వివిధ గతుల్లో రసమనోహరంగా అలరారుతుంది. దీర్ఘ సమాస బంధురంగా, లలిత పదసమన్వితంగా విన్యాసాలు ప్రదర్శిస్తుంది. 'ఆంధ్రప్రశస్తి', 'కుమారాభ్యుదయం', 'ఋతుసంహారం', 'వల్లీ కళ్యాణం', గోపాలోదాహరణ' ప్రద్యుమ్నాభ్యుదయం' 'విశ్వనాథ మధ్యాక్కరలు', 'విశ్వేశ్వర శతకం', 'వరలక్ష్మీ త్రిశతి', 'శశిదూతము', 'శృంగార వీధి' మున్నగు ముప్పైకి పైగా కావ్యాలకు స్వర్ణశిఖరంగా భాసించే మహోన్నతి కృతి 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము'. ఇంకా 200 పైబడి పద్య ఖండికలు ఆయన కలం నుంచి జాలువారాయి. ఆయన గేయ రచనా వైదుష్యానికి అద్భుత నిదర్శనాలు 'కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్లి, నృత్య సంగీతమయంగా, శబ్దనాదరమ్యంగా నడిచిన ఈ గేయ కావ్యాలు విలక్షణమైనవి. విశ్వనాథ కథల్లో ఆయన ముద్ర ప్రస్ఫుటమవుతుంది. 'పరీక్ష', 'ముగ్గురు భిక్షకులు', 'తిరోధానము' వంటి 35 కథలు రచించారు. నాటక రచనలో ఆయన కొత్తబాణీ ఏర్పరిచారు. చారిత్రక, పౌరాణిక ఇతి వృత్తాలలో విషాదాంత నాటకాలు వెలయించారు. నర్తనశాల, అనార్కలి, వేనరాజు, త్రిశూలము, ధన్యకైలాసము మొదలైన 20 నాటకాలతో పాటు 50 రేడియో రూపకాలు, అమృత శర్మిష్ఠం, గుప్తపాశుపతమ్ అనే సంస్కృత నాటకాలు అందించారు. ఆయన విమర్శన గ్రంథాలు లోతైన పరిశీలనతో నిండి ఉంటాయి. పాండితీ పాటవాన్ని చాటుతాయి. నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తి, 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత' వంటి 10 విమర్శన గ్రంథాలు అత్యంత ప్రామాణికాలు. వ్యాస రచనలో ఆయన శైలి ప్రత్యేకతను సంతరించుకుంది. తెలుగు, ఆంగ్లంలోనూ 70కు పైగా వ్యాసాలు రాశారు. 100కు పైగా గ్రంథ పీఠికలలో తమ సాహితీ దృక్పథాన్ని ఆవిష్కరించారు. ఒక నవలాకర్తగా విశ్వనాథకు ప్రపంచ సాహిత్యంలో విశిష్టస్థానం ఉంది. ఆయన 'వేయిపడగలు' ఇందుకు మహోన్నత తార్కాణం. 37 అధ్యాయాలు, 657 పుటలున్న ఈ నవల ఒక అపూర్వ సృష్టి. ఇది ఒకరీతిగా ఆత్మకథ వంటిదనవచ్చు భారతీయ విజ్ఞాన భాండాగారంలోని అనేక అద్భుత విషయాలిందులో పొందుపరిచారు. సమకాలీన సమాజ స్వరూపాన్ని ప్రతిభాన్వితంగా ఆవిష్కరించారు. గృహస్థాశ్రమ ధర్మ విశేషాన్ని వివరించారు. 'ఈ దేశమునందు సర్వ ధర్మములు నశించవచ్చు కాని దాంపత్య ధర్మము, పాతివ్రత్యము ఎన్ని చిల్లులు పెట్టినను పోదు' అంటారాయన. 'తెరచి రాజు', 'మా బాబు', 'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు' 'చెలియలి కట్ట', 'పునర్జన్మ' తదితర 34 సాంఘిక నవలలు, 'ధూమరేఖ', 'వేదవతి', 'అమృతవల్లి', 'నాస్తిక ధూమం' ఇత్యాది 12 పురాణవైర నవలలు, 'యశోవతి', 'భ్రమరవాసిని', 'సంజీవికరణి' మొదలైన కాశ్మీర రాజవంశ నవలలు, 'సౌదామిని', 'దూతమేఘం', 'దిండుకింద పోక చెక్క' వంటి నేపాళరాజవంశ నవలలు, విశ్వనాథ విశిష్ట నవలా నిర్మాణ దక్షతను ప్రకటిస్తాయి.

# తెలుగు తావి.. లీవి

జ్ఞానపీఠ పురస్కృతిని పొందిన 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము' గొప్ప మహేతిహాసం. 'మరల నిదేల రామాయణంబన్నచో- నీ ప్రపంచకమెల్ల నెల్లవేళc/దినుచున్నయన్నమే తినుచున్న దిన్నాళ్లు- తన రుచి బ్రదుకులు తనవిగాన.. తలచిన రామునే తలcచెద నేనును- నాభక్తి రచనలు నావిగాన...?' అని కావ్య రచనాధ్యేయం వ్యక్తం చేశారు. అనుభూతి, భక్తి, రచనాత్మక దృష్టి కూడా ప్రేరకాలయ్యాయి. ఈ కృతి వాల్మీకి రచనకు అనువాదం కాదు. వాల్మీకి ఆత్మకు మహత్తర భాష్యం. విశ్వనాథ అద్వైతతత్వాన్ని దీనిలో రసార్ద్రంగా చిత్రించారు. ధర్మవీరాన్ని సహితం అంత ఆర్ద్రభావంతో చూపారు. గ్రంథ నామమే భావస్ఫోరకంగా వుంది. కాండాల్ని విశ్వనాథ ఖండాలుగా విభజించారు. 'ఆత్మనిత్యమ్ము కాలాద్యవచ్ఛిన్నము- సచ్చిదానంద సంపచ్చయమ్ము...' అనే సీస పద్యంతో కథ ప్రారంభం చేస్తారు. ఇష్టి, అవతార, అహల్య, ధనుస్సు, కల్యాణ ఖండాలతో 1824 పద్యాలున్నాయి. బాలకాండలో కథ కథనానికి అనుగుణమైన ఛందంలో, శైలిలో పద్య నిర్మాణం సాగించారు. శిఖరిణీ ఛందంలో చివరి పద్యం ప్రథమ పాదం. 'ధృతాంభఃపూతాకృత్యమరతటినీ తీరసుగృహీ!' ఈ కృతిలో విశ్వనాథ గాఢ భావుకత గోచరిస్తుంది. స్వోపజ్ఞత, పాండితీ ప్రకర్ష ఆవిష్కృతమవుతాయి. కల్పవృక్ష స్వరూపానికిది లఘు చిత్రణ. వాల్మీకిపై విశేష గౌరవం ఉన్న విశ్వనాథ తన కృతిని స్వతంత్ర కావ్యంగా మలిచేందుకు నూత్న కల్పనలు చేశారు. ఇవి ఇతి

# మనసున ఉన్నదీ..

★ మా ప్రాంతానికి చతుర చాలా ఆలస్యంగా వస్తుంది. ఎందుకో.. ఎలాంటి ఇబ్బందులున్నాయో మరి? చాలా విలువైన ఈ పత్రికను త్వరగా పాఠకులకు అందేలా చేయకూడదూ?

– చాట్రాతి ఉమామహేశ్వర వేణుగోపాలరావు, జీడిమెట్ల, హైదరాబాద్

★ కల్యాణిగారి 'శ్రీకారం' చదివాను. రమ కథను దయనీయంగా చిత్రించేరు. బాగోగులు తెలుసుకోకుండా కేవలం ఉద్యోగం చూసి చేసే సంబంధాలవల్ల జరిగే పరిణామాల్ని ఒక కవయిత్రిగా స్త్రీ మనోభావ విపంచిని చక్కగా లమీటారు. చతురలో వస్తున్న నవలలు వేటికవే సాటిగా ఉంటున్నాయి. 'కొత్తగాలి' యువకవులకు చక్కని పవర్‌ఫుల్ టానిక్. వచ్చేనెల చతురకోసం నా ఆత్రుత ఆరంభమైంది.

– జి.గోపాలకృష్ణ, అరసవిల్లి

★ కవర్‌పేజీలో అనుష్క నవ్వు ఒక పువ్వులా పరిమళిస్తోంది. ఆమె చెప్పిన ఆరోగ్య చిట్కాలు అనుసరించదగ్గవి. కొత్తగాలి పాఠకులను అలరిస్తోంది.

–సిరిశైలమప్ప, పెద్ద చెల్మెడ, మెదక్ జిల్లా

★ 'నిన్నటి నిజం'లో 'ఎవరిదైనా ఆకలే' చదివిన తర్వాత కళాకారుడి నుంచి కాలక్షేపం, ఆనందం పొందాలనే యోచనే తప్ప, ఎదుటివారికి కూడా కడుపాకలి ఉంటుందన్న సంగతిని కొద్దిమంది సంపన్నులు ఆలోచించరని చక్కటి చురక వేశారు. కొత్తగాలుల్లో అగ్నిపర్వతాల్లా సామాజిక రుగ్మతలు, రకరకాల జీవన సరళి గురించిన కవితలు ఫెళఫెళమని పెల్లుబికి వస్తున్నాయి. అభినందనలు. అపార్ట్‌మెంటాలజీలో 'సీరియల్ పెళ్లిచూపులు' కడుపుబ్బ నవ్వించింది..

–పి.సూర్యనారాయణ రాజు, బంజారాహిల్స్, హైదరాబాద్

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

వృత్తపరంగా, పాత్రచిత్రణపరంగా జరిగాయి. ఉదాహరణకు అహల్యా వృత్తాంతంలో వాల్మీకంలో లేని విస్మృతిని, సహజత్వాన్ని విశ్వనాథ కల్పించారు. అలాగే అయోధ్యకాండలో చిత్రకూట సన్నివేశం సందర్భంగా రాముడు కైకేయికి బాసట నిలుస్తాడు. యుద్ధకాండలో రావణ వధానంతర ఘట్టాన్ని కరుణరసనిర్భరంగా చిత్రించారు. విశ్వనాథ తమ ప్రతిభాపాండిత్యాలనేగాక వేదవేదాంగ పరిజ్ఞానాన్ని ఈ కావ్యంలో నిక్షిప్తం చేశారు. భారతీయ ధార్మికతకు అద్దంపట్టే ఈ కృతి ఒక కల్పవృక్షమే.

విశ్వనాథ సకల గౌరవాలు అందుకున్నారు. రాష్ట్ర, కేంద్ర సాహిత్య అకాడమీల అవార్డులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు బహుమతి- కళాప్రపూర్ణ గౌరవపట్టం, గుడివాడలో గజారోహణం, మచిలీపట్నంలో కవిసామ్రాట్ బిరుదం, వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు, కోల్‌కత్తాలో పుష్పకిరీటాలంకరణ, నాగపూర్‌లో జాతీయ కవిగా సత్కారం - వీటిలో కొన్ని. కేంద్ర ప్రభుత్వం 'పద్మభూషణ్' గౌరవం ప్రదానం చేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థానకవిగా పరిగణించింది. ఆయన పలుకు కొంత కటువుగా వున్నా మనసు వెన్న. గుప్తదానాలు అసంఖ్యాకంగా చేశారు. దీనికి తార్కాణం- జ్ఞానపీఠ పురస్కారం తాలూకు నగదు చేతికందగానే కపిలేశ్వరపురం వెళ్ళి అందులో కొంతభాగం కొందరికీ, ఇతర చోట్ల మరికొందరికీ యిచ్చిన వదాన్యుడాయన. 'నేను - అనేవాణ్ని నా పుస్తకాల నిండా నింపాను' అని ప్రకటించారు. 'వేయిపడగలు' నవల ప్రధాన పాత్ర ధర్మారావు ఆయనే. 1976 అక్టోబరు 18న విజయవాడలో నిర్యాణం చెందిన విశ్వనాథ సత్యనారాయణ అమరుడైన మహాకవి. తెలుగు అక్షరం ఉన్నంత వరకు ఆయన పేరు ఉజ్జ్వలంగా భాసిస్తుంది.

–గోవిందరాజుల రామకృష్ణారావు



# చతుర ప్రవేశిక



## ఆగస్టు - 09

ఆగస్టు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. చక్రధర్ బామ్మ పేరేమిటి?
2. చాముండి ప్రేమిస్తున్న యువకుడి పేరేమిటి?
3. బావిలోపడి ఆత్మహత్య చేసుకున్న ముసలయ్య భార్య?
4. వెంకటేశ్వరరావు కూతురు?
5. చక్రధర్ ఊరిపేరు?
6. 'వేయిపడగలు' ఎవరి రచన?
7. ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్ నవలా రచయిత?
8. ఇదివరకే దీపక్ పెళ్లి చేసుకున్న అమ్మాయి?
9. ఖడ్గాలూ కాటుక పిట్టలు రచయిత?
10. ప్రిన్సెస్ థెక్లా పేరుతో ప్రముఖులకు ఉత్తరాలు రాసింది ఎవరు?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

**ప్రవేశికలకు చివరి తేదీ 17**

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవద్దు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 8



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

**ఫలం అందినా**
**ఫలితం అందుకోలేని త్రిశంకు**

-బి.ఎస్.రావు,
కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా



## కాప్షన్ మీదే -7

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

కొరికినా కొరక్కున్నా.. నా కాళ్లు కట్టుకు పుత్తూరు వెళ్లవలసిందే

-సి హెచ్.కిషోర్,
సెంట్రల్ ప్రిజన్, కడప

హెల్ప్.. హెల్ప్.. అని అడుగుదామన్నా ఆ.. అవకాశమే లేకుండా పోయింది.. ప్చ్... ఎలా?

- బి.ఆర్. వేంకటకుమార్, కత్తిపూడి, తూ.గో.జిల్లా

కొమ్మకి కాయభారమో కాదో గాని, ఈ పండుకు మాత్రం మనిషి భారమే!!

- షేక్‌రియాజ్ అలీ,
గూడూరు, నెల్లూరు జిల్లా

ఆశ చావ నివ్వదు!
ఆకలి బ్రతక నివ్వదు!!

-వేలేటి శ్రీనివాసరావు,
వుడా కాలని, విజయనగరం

